దులలోనిదె యనిసూరి తలఁచిన ట్లాతనివివరణము స్పష్టము చేయుచున్నది. టీకాదులు రానిపక్షమందుఁ దనప్రత్యయం బన్నింటి కగు ననుదానికిముందే సూరి దీనిని జూపుట గమనార్హము. మగఁటిమి- మగతనము అనఁగా నిట సూరి యర్థము వివరించె నని వీరు భావించి రేమో.కాని చిన్నటీకము మొద లగుపూర్వస్థలములం దిట్లు చెప్పెనా సూరి?

ఇది మగఁటిమ్యాదులలో వీరును జేర్చుకొనకతప్పదు.కానిచో మను మనియొక్క భావముమనుమనితనము అని యైనట్లుగా నిచట మగనియొక్క భావము మగనితనము అనియే కావలయును. మగతన మని యొకపక్షమున నయ్యెడునవకాశము లేదు. సూరి మొదటిసూత్రమునొద్ద 'రామునితనము రాముతనము' నని రెండింటిని జూపెను. పిదప మనుమనితన మనుచో (రాముతన మనురీతిని) మనుమతన మని చూపలేదు. అనుదంత మగునీ తెనుఁగుడుమంతమునకు నిగాగమము నిత్య మగుటచేతనె యని స్పష్టమే. కాఁగా నట్లే యిట మగనితన మని మాత్రమె కావలె. మగతన మనిమాత్ర మెయగుటకు నివర్ణము తొలఁగించు టెట్లు?అందు కిది మగఁటిమ్యాదులఁ జేర్పఁబడినది. 'ని'లోపము మగఁటిమ్యాదిత్వముచేత సిద్ధించిన దని తాత్ప ర్యము. మనుమనితనము, తేనితన మిత్యాదుల నివర్ణము తప్పక నిల్చి యుండుటయు నిట్లు స్పష్టమె.

షష్ఠికి ద్వితీయాతుల్యత చెప్పుకొన్నవీరిమతమున నైనను ద్వితీయ లో 'మగని' (మగన్) అని యుండుటకు వీలు లేదు.కావున వీరును దీనిని మగఁటిమ్యాదులలోఁ జేర్చుకొనవలసినదే. కావున వీరు మగతనమును కుండలీకరణమునఁ జూపుట సరి కా దని నిశ్చయింపఁదగు.

దీనినిబట్టియె సూరిమతమున మిండటీకము మిండతన మనుచో మిండ శబ్దము స్త్రీసమ మని గ్రహింపవచ్చును. లేనిచో 'ని'గాగమలోపమునకై 'మగతనము'ను మగఁటిమ్యాదులలోఁ జేర్చినట్లే మిండతన మన్నదియుఁ

జేర్పవలసినపని గదా. 'చుట్టము' అని క్లీబసమమును ముపర్ణకాంతముగాఁ జూపె. ఎల్లెడల నాయాగణములందలిశబ్దములను బ్రథమాంతములుగాఁ జూపుట స్పష్టమె. చూపవలయుటయు స్పష్టమె. అట్లే చిన్న - దొంగ - మిండ ఇత్యాదులును స్త్రీసమప్రథమైకవచనాంతములే యని గుర్తింపవలెను. మిండ చేరొక్కమ మిండలు మొ॥ దీనినిబట్టి చిన్నశబ్దముపైఁ దచ్ఛబ్దముతోఁ జిన్నదానియొక్క భావ మనురీతిని జెప్పుట సూరిమతము కా దని గుర్తింప వలయును.

మగఁటిమి యనుచో వఝులవారు 'మగ + ట్ + ఇమి' (వ్యా. సం.స.1273) అని చూపుటలో నచ్చుపొరపాటు గల దేమో. మగంటిమి యనియుఁ జూపుచు టకారమునకు ముం దఱసున్న చూపకుంట యెట్లు? 'మగాదిభ్యష్టిమిజాదయః' అని సూరి సూత్ర.లోఁ జెప్పినట్లు ఇట టిమిజ్ ప్రత్యయ మై 'ని'గాగమము లోపించిన దనఁదగు. ఇట్టియెడల సూరి'మగ టిమిని' సం.14సూత్రమునొద్దఁ జూపుట విచార్యము.

అగ్గలంపుఁదన మని సూరి యిట నుదాహరించుటను దిరస్కరించుచు వీరు [వ్యా.సం.స.1276,1266మొ॥] తనపరకత్వమున పుంపులును నుగా గమమును రా వని చెప్పుట కవిప్రయోగవిరుద్ధ మని సంధి.35సూత్రమువద్ద గుర్తించియున్నారము. ఇట నథర్వణకారికను సూరి పొరపాటుగా నర్థము చేసికొనె ననువఝులవారియభిప్రాయ మసంజస మని యచ్చోటితిక్కనాదుల ప్రయోగములే నిరూపించినవి.

బా.సా.పే. 'కోమలశబ్దంబుపై ఇకప్రత్యయము గలుగ' - ననుటను దిరస్కరించుచు వఝులవారు "సంస్కృతకోమలశబ్దముపై నాచ్ఛిక మగు ఇకప్రత్యయ మగుటయు నట నపదాదిస్వరసంధి వర్తించుటయు నసంభవ ములు" [వ్యా.సం.స.1274] అనుట విషయము. కోమలముయొక్కభావ మనుచో సంస్కృతసమముపైఁ బ్రత్యయ మైన దనవలె. అచ్ఛికతద్ధితము సంస్కృసమములపై నగుట యసంభవమా? 'నావెఁడు అనుప్రయోగ

మునుబట్టి నావ వైకృత మనుకొనరా దనియుఁ గటిబంటి యనురీతిగాఁ దత్సమంబులపైఁ దెలుఁగుప్రత్యయములు నిల్చుట క్వాచిత్కముగ లేకపోలే (వ్యా.సం.స.609) దని చెప్పిరే కదా.ఇది యట్టిద యన్న నిం దసంభవత్వ మేమి? అది గాకున్న కోపగాఁడు మొ॥

ఇట వీరు ప్రత్యయ మగుటనుగూర్చి చెప్పినఁ జాలెతుదానికినపదాది స్వరసంధి యగుటయు నసంభవ మనుట విశేషము. ప్రత్యయము వచ్చు నంతవఱ కంగీకరించిన నిఁక సంధి యగుటలో బాధ లేదు. అపదాదిస్వర పరకత్వమున సంస్కృతీయస్వరమునకు సంధి యగుటలో బాధ లేదు గదా. అట సూరి 'అర్థ + ఇంచు- అర్థించు, నిర్జి + ఇంచు- నిర్జించు' అని యుదా హరించియే యుండెను. కావున నీపక్షము కేవల మసంభవ మనరాదు. వే తే దేని గారణము చూపవలె.

ప్రౌఢ. పేర్కొన్న నాయఁకరము(తద్ధి.12)ఒంటి, (తద్ధి.15)యను వానిని వఝులవా రిటనే మగఁటిమ్యాదులలోఁ జేర్చుట యుచితమె యనఁ దగును. ఇందు లాఘవమును గలదు. ప్రౌఢ. స్పష్టము చేసె.

## స్వార్థికపంచలు :

బాల.తద్ధి.9,10సూత్రము లట్ల గ్రహించిరి. (ఉ.9,10సూ) మెలఁత యనుచో "మెలుఁత అనఁదగును' (ఉ.303)అనుటలో సూరి మెల్త యని చూపుట పొరపా టని తలఁపరాదు.దానిని వీరును బేర్కొనిరి.చిఱుతాదులలో మెలఁతశబ్దముతోపాటు 'మెలుఁత' యనుశబ్దమును గల దనియే వఝులవారి యుద్దేశ్యము. 'మెలఁతుక మెలుఁ తుక' యని వ్యా.సం.స.(1276)లో వీ రీరెండింటిని జూపిరి. కావున నిట వివరణమున 'మెలుఁతి' యనునదియుఁ జూపిన సరిపోయెడిది. 'మెలుఁత' యనఁదగు' ననుట వలన నపార్థమున కవకాశము గల్గినది.

ఇటఁ ప్రౌఢ.లోనిస్వార్థికములు చూపిరి. (ఉ.తద్ధి.12-26)

బాల.తద్ధి.11,12సూత్రము లట్ల గ్రహించిరి. (ఉ.17,18సూ)

"కాగాప్రత్యయాంతములకుఁ బుంలింగసమత్వముచేతనె డు జ్జగు' (ఉ.30.4) ననిరి. కాప్రత్యయాంతము మగాదులలోని దనుసూరిమత ముచితముగాఁ దోఁపకున్నది.కాన బుంలింగసమత్వముచేతనెడు జ్జగు ననువఝుల వారివివరణము సమంజసమే.

కాని సూరి 'కాప్రత్యయాంత' మనఁగా వీరు'కాగాప్రత్యయాంతము' లని 'గా'వర్ణము నధికముగాఁ జూపుట సమంజసము గాదు. 'కాఁడుర్గాడుఁ' అని వి.వి. కా,గాప్రత్యయములుగా వీనిని భిన్నములుగాఁ జెప్పినను వీ రిట సూరికివలెనె కాకత్తియలకకారమునకు గకారము చెప్పి 'గా' యనురూపము ను సాధించిరి. కావున 'గా'యన్నది 'కా'కంటె వే అగుప్రత్యయము గాదు గదా. కాన నిట వివరణమున నైనను భిన్నముగాఁ జూపుట సరి కాదు. కాప్రత్యయాంతమున కని చెప్పినను అందగా- ఇత్యాదులకును బుంలింగసమత్వమువలన డుజ్జు రాకపోదు గదా.

"కాఁడుర్గాఁడుర్భవేదీఁడుఃఅసునథర్వణవచనముచొప్పున గత్వము లేదనఁజాలము గాని యట్టిగకారమునకుఁ బ్రాసాదిగతప్రయోగము దొరకలేదు' (ఉ.304)దీనినిబట్టి యథర్వణుఁడు చెప్పఁబట్టి యంగీకరించిరి గాని కానిచోఁ 'బ్రాసాదిగతప్రయోగములు లేమింజేసి యితరస్థలములం దున్నగత్వము కవిప్రయుక్తము గా దనియు[ముద్రణసంస్కర్తలె యట్లు నిల్పి రనియు] కవు లట్టిచో నందకాఁ డనురీతిగనె ప్రయోగించి రనియు నిర్ణయించి చెప్పెడివా రనవచ్చును. [వ్యా.సం.స.1287] 'కత్తియ నథర్వణుఁడు చెప్పలేదు. అయ్యు 'గాఁడు'అనుదానిసామాన్యమున నేని కత్తియలోను గత్వమును వఝులవా రంగీకరించు టుచితముగ నున్నది.

అన్న మీతండ్రి కోపగాఁ డౌనొ కాఁడొ [కాశీ.4.60] మున్నగు ప్రయోగములనుబట్టి యీకాకత్తియవర్ణము లరుదుగా సంస్కృతశబ్దముల మీఁద నిల్పుటయుఁ గల దని కొందఱయాశయము. ఇట్టియెడల కోపకుండు

అనునది కవిప్రయుక్తపాఠ మనుట యుక్తము"- (ఉ.305) ఇట్లు కవి ప్రయోగములను దిద్ది యవియే కవిప్రయుక్తము లనుటకంటె నవ్వాని నట్టె విశిష్టస్థలములుగ నేని గుర్తించుట యుచితము.

'సంస్కృతశబ్దముల మీఁద నిల్చు' ననువఝులవారివచనమున నభిప్రాయ మస్పష్టము. 'కోప' అనుసంస్కృతశబ్దముపై 'కా' తెలుఁగు ప్రత్యయ మగుటలేదు. అందము + కా ఇత్యాదులవలె కోపము గలవాఁ డనునర్థమున కోపముశబ్దముపై కాప్రత్యయ మయి కోపము + కా అని యుండఁగా విభక్తి లోపించి కోపకా- అని యగును. ఇట 'కోప' యనుదానిపైనె కాప్రత్యయము నిల్చియున్నను ములోపముచేఁ గోప శబ్దము సంస్కృతసమ మనుట యుచితము గదా. బహుశః పై వివఝులవారి యభిప్రాయ మదియ యగు నేమో.

వ్యా-సం.స.లో కోపకాఁడు, కోపకత్తె యనువానికిఁ బ్రయోగములు చూపి కవిప్రయుక్తము లనుచు నవ్వాని నింకొకతీరుగా నూహించియుఁ బిదప 'కాని తిక్కయజ్వయె తత్సమముపై 'కా'ప్రత్యయమును బ్రయోగించియున్నాఁడు. ఆమిషము గాలకాని కెట్లట్ల (అను.5.256) (వ్యా.సం. స.1283) ఇట్లనుచునే పిదప నిది యాచ్ఛిక మనిరి.

గాలవమువిషయమునను నిట్లె సూ.ని.అభిప్రాయమును బరామర్శించుచు పాం-లో 'గాలము'ను బ్రత్యాఖ్యానించుచు "ఆమిషము గాలకాని కెట్లు (అను-5-256) అనుచో "సోమయాజిప్రయోగములోని'గాలకాఁడు' అనుచోట కాప్రత్యయము తత్సమములపై సైతము నిల్చు నన్నపక్షము చొప్పున నద్దాని కాచ్ఛికత్వము నంగీకరింపకతీర దనరాదు కదా -- పయి సందర్భమునుబట్టి 'గాల' యనుధాతు వాచ్ఛికము లగునంగలాదులలోఁ బఠించుట సరి కా దని తోఁచుచున్నది' (వ్యా.సం.స.1554,5మొ॥)యనిరి.

గాలవమువిషయము పిదపఁ జూతము. వీరివివరణముచొప్పున ఇటఁ

దిక్కున 'గాలకాఁడు' అనుచోఁ దత్సమముపై 'కా'ప్రత్యయము చేసె నని యుఁ బేర్కొనుట స్పష్టమె కదా. ఇట్లంగీకరించుచునే కోపగాఁ డిత్యాదులఁ బతాంతరములను గల్పింప నేల? వ్యా.సం.స. లోఁ దామె యంగీకరించియు నిటఁ దత్సమములపై నగుట కొందఱయాశయ మనుటయు విశేషమె. అయిన సంస్కృతముపై నిల్చు నని కొందఱయాశయము కాఁగాఁ దత్సమములపై నిల్చు నని వీరిమతమా? అయిన వీరిమతమె యుచితము.

గాలకాఁ డనుచో వఝులవారిసమన్వయము తత్సమముపై నివి యగు ననుటవఱకు గ్రహింపఁదగు కాని గాలకాఁ డనుచో కాప్రత్యయము తత్సమముపై నైన దనుట సరి కాదు. గాల మాచ్ఛికము కా దనియుఁ దత్సమమె యనియు వీరు పేర్కొనిరి. అయ్యు నాచ్ఛికగాలశబ్దము నంగీకరింపవలయు.

'గాలము' అనుపాం. ప్రయోగమున ఇది యేతాదులవంటిది గా దనియు, 'గాలము' అని భగణముతో నున్నను సీసపద్యమున గణభంగము లే దనిరి. ఛందోనియమానుసారముగా నైనను గవిప్రయోగములను దిద్దఁదలఁచుటయె సరి కాదు. ఇంక సూరి యేతాదులలో 'గాలము'శబ్దమును జేర్చియే యున్నాఁడు. వఝులవారును దమయాగ్రంథమున 'గాలాము అని' (ఉ.175) దీర్ఘము వచ్చినరూపమును జూపి యిది యేతాదులలోనిదిగా నంగీకరించియే యున్నారు. ఇటనే యేమి? తత్సమ మని చెప్పినవ్యా.సం.స.లోనె గాలము ఏతాదులలోనిదిగాఁ జూపియే (1766) యుండిరి. వాలారుగోరు మేల్గాలాము నేసెన్- పాండు. (వ్యా.సం.స.1766) అని సూ.ని.నుండి చూపిరి. ఇంకను పాండు.ప్రయోగమునే దీర్ఘ మయినందులకుఁ బ్రమాణముగాఁ జూపి యదే పద్యమున దీర్ఘమధ్య మగుపాఠము నంగీకరించిరి. కాఁగా నీదీర్ఘముంబట్టియు నిది యాచ్ఛికమే యని యంగీకరింపవలసియేయుండుట స్పష్టము. కావున "గాలము అనుశబ్దమును గాని గాలించు అనుధాతువును గాని వైకృత మనుట కవకాశము లేకున్నది. ఇంక వానిని దత్సమము లనియే చెప్పక

తీరకున్నది' (వ్యా.సం.స.1554) అనుట యసమంజసము గదా.

కాఁగా గాలించు అనునదియు నాచ్ఛికధాతువే యనియు నాచ్ఛికము లవునంగలాదులలో "గాల" చేర్చుట యుచితమే యనియు గుర్తింపవలెను. గాలించు (బియ్యమును) (ఉ.355)

అది య ట్లుండఁగా "గాలించు" అనుధాతువునకు నీగాలము అనుశబ్దమునకు నెట్టిసంబంధమును లే దని గుర్తింపవలె. "గాలము"నుండి యేర్పడినచో నాయర్థము గాలించుధాతువున కుండవలయును. కరుణించు పయనించు ఇత్యాదు లిట్టివె కదా. అట్టియెడ నియ్యది నామధాతు వగును. సూరి యంగలాదు లన్నది యాచ్ఛికధాతువులనుగూర్చి గాని నామము(ధాతువు)లను గూర్చి కాదు. నామంబుల కించుగాగమము జ్ఞాపకసిద్ధ మని గదా సూరి క్రియా.65సూత్రమున్ఁ జెప్పియున్నది. కావున నంగలాదులలోని "గాల" శబ్దము "గాలము"కంటె భిన్నము. ఇది ధాతువు. అంగల, ఆడక, అరగ ఇత్యాదిగా నిటఁ జూపిన వన్నియు ధాతువులే. స్వంతములు లేవు గదా. ఒకవేళ వఝులవారు చెప్పినట్లు "గాలము" అన్నది తత్సమమె యైనను నంగలాదులలో గాలశబ్దము(ధాతువు)చేర్చుట విరుద్ధము గా దని స్పష్టము. తత్సమ మన్న "గాలము" ధాతువు గాదు గదా. అంగలాదులలోని గాల ధాతువు. తద్భిన్నము. (ఉ.355)

"గాలకాని" అనుతిక్కనప్రయోగమున వీరు తత్సమముపై 'కా' ప్రత్యయ మున్న దనరాదు. అయ్యునట్టిప్రయోగములు ప్రసిద్ధములు లేక పోలేదు.

విటకత్తెలయల్కలు (హం.4.150)అరజ్జులాని (ద్రోణ.4.248) మహామాయలాఁడు (హరి.ద్వి.1854) రజ్జులానికి(కర్ణ.2.96)ఆయతికాఁడు (శాం.2.363)

బాల.తద్ధి.13,14సూత్రములట్లగ్రహించిరి. (ఉ.19,20సూ.)

కాప్రత్యయాంతము లైనను దిర్యక్కులకుఁ బుంలింగసమత్వము వలన డుజ్జు రాదు. ఇవి యమహత్తులు గదా. కావున వీనికిఁ బుంలింగ సమత్వమె లే దనఁదగును. వీనిని గయిరాదులలోఁ జేర్చి డుజ్జును సాధించు కొనవలెను. వఝులవా రిట నట్లు చెప్పకున్నను "ఏకార్థకాద్యమహత్తులలో (ఇవే సూరిపేర్కొన్నకయిరాదులు)కొమ్మకాఁడు అనుదానిం జూపుటనుబట్టి వారియభిప్రాయము నదియే యని చెప్పఁదగు.

### ఈ :

బాల.తద్ధి,15,16,సూత్రము లట్లగ్రహించిరి. (ఉ.2122సూ)

ఈప్రత్యయాంతములకు మగాదిత్వముచే డు జ్జవు ననియె సూరి. "పుంలింగసమత్వముచేతనె డు జ్జగు" (ఉ.306) ననువఝులవారియభిప్రాయమె యుచితము. ఇయ్యవి మహత్తు లవుటచేఁ బుంలింగసమత్వముచేతనె డుజ్జు సిద్ధించుచుండఁగా నందుకయి వీనిని మగాదులలోఁ జేర్పవలసినయవసరము గానరాదు.

"వీనికి మత్వర్థీయేతరప్రత్యయములు నగు" అటమటకాఁడు-- (ఉ.306) అనువీరివివరణ ముచితమ. మత్వర్థీయేతరప్రత్యయము లనఁగా మత్వర్థీయము లగునితరప్రత్యయములు. మత్వర్థీయములకంటె నితరము లైనప్రత్యయము లనుకొనరాదు. తద్ధి.2.సూ.చే విశేషవిధి యగుతద్ధి.15 సూత్రము సామాన్యవిధి యగుతద్ధి.11సూత్రమును విభాషను బాధింపఁగా నిట్టిద్వైరూప్యము సిద్ధించు. గణద్వయపాఠమువలనఁ గొన్నింటికి. అటమటాదిత్వముచే సుంకీఁడు, జాలాదిత్వముచే సుంకరి.

### అం-ఇ :

బాల.తద్ధి.17.సూత్ర మట్ల గ్రహించిరి. (ఉ.23.సూ.)

"అరిప్రత్యయాంతములు స్త్రీసమములు గానఁ బ్రయోగానుసారముగా మహన్మహతీవాచకత్వము వీనికిఁ గలదు." [ఉ.306] అనఁగా మహత్త్వ

మునను మహతీత్వమునను రూప మొకేతీరున నుండు నని వీరియుద్దేశ్యము గావలెను. మహన్మహతీవాచకము లగుటకు స్త్రీసమత్వము నిమిత్తము గానేరదు గదా.

చదువుకలది, లేదా చదువుకలవాఁడు అనురీతిగా స్త్రీత్వమునను, పుంస్త్వమునను రెండింట నీసూత్రముచే అరిప్రత్యయ మగు నని చెప్పుట సరిగా నుండును.

ఇటనే వీరు పూజ-పూజారి, పూజరి, సొన్నము సొన్నరి' అనియుఁ జూపిరి. దీర్ఘము నూహింపవలయును. ప్రౌఢ.తద్ధి.లక్షణమును సంస్కరించి చూపవలసినది. ప్రౌఢ. సొన్నారి యనియె చెప్ప వీరు సొన్నరి యనియుఁ జూపిరి. వ్యా.సం.స.లో దీనికిని దీర్ఘము వికల్ప మనినజాడ లేదు. ఇటఁ బ్రత్యేక మైనయాధారమును జూపలేదు. సొన్నారి యనియ చూపఁదగుఁ గదా.

'జూదరికత్తె జూదకత్తె జూజగాఁడు జూజకత్తె సిగ్గరికత్తె ఇత్యాది ప్రయోగములును గలవు.' (ఉ.307) జూదగాఁడు జూదకత్తె యన్నవి తద్ధి.11.చే సిద్ధించునవే. (ప్రకీ.21) జూదరికత్తె యన్నవి తద్ధి.13సూ.చే సాధ్యములు. (కల్లరీఁడు-తద్ధి.16)

బాల.తద్ధి.18.సూత్ర మట్ల గ్రహించిరి. (ఉ.24.సూ.)

త :

'తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యంబగునపుడు మతుబర్థంబు నం దగు' (19) ననుసూరిలక్షణమును సవరించి యిట్లు పేర్కొనిరి. "కుల వాచకములు మహద్వాచకములు నగు. బోయప్రభృతిశబ్దములపై ని వానిస్త్రీ అనునర్థమున తప్రత్యయ మవును" [తద్ధి.26]

సూరిసూత్రమందలిదోషము విట్లు చెప్పిరి. "చాకి బోయ ప్రభృతులు కేవలకులవాచకములు కావు. -మదావివేకిన్ చాకిన్-- చాకి అనఁగా నిట రజకుఁడు. అట్లే బోయ--" [ఉ.308) కావున నియ్యవి మహత్తులు నగుట స్పష్టము.

"ఇత్యాదులు కులవాచకంబులు" అని సూరి పేర్కొనుటవలనబోయ వాఁ డనురీతిగా మహత్తగుబోయశబ్దము నిట గ్రహింపరా దనవలె. ఇట్లే తరములు. కాఁగాఁ గులవాచకములను మాత్రమె యిట గ్రహింపవలె నని సూరిమతము స్పష్టమే.

'ఇయ్యవి కులవాచకంబు' లనుటచే నివి కులమాత్రవాచకము లని సూరి తలఁచినట్లు భావించి వరుసవారు మహత్తులనయియుంటను సూత్రించియుందురు. ఇయ్యవి కులవాచకములు మాత్రమె యగు నని సూరి తలఁచె ననరాదు. మగాదులలోఁ జేర్చి మహత్తుగాఁ జూపిన వ్రేశబ్ద మిందును సూరి చేర్చెను. ఇది కేవలము కులవాచకమె యగు నని సూరి తలఁచె నన్న మహత్తు లగుమగాదులలో దీనిని జేర్చుట విరుద్ధము కాదా?

'కులవాచకంబులు' అని ప్రత్యేకముగాఁ బేర్కొనుటనుబట్టియు నీ 'త'వర్ణకము వచ్చుసందర్భమున కులమాత్రవాచకములే కాని మహత్తులుగా వని సూరిమతమును గ్రహింపవలయును. సూరిలక్షణము నపుడ సమన్వయించును. 'స్త్రీ వాచ్యం బగునపుడు' అని గదా సూరి చెప్పునది. మహత్తయినచో స్త్రీ వాచ్య మగుట యెట్లు సంభవించును? బోయ, మహతి యయిన బోయత, మహతీత్వమున మహత్త్వ మసంభవము.

వీరు దమసూత్రమున 'కులవాచకములు మహద్వాచకములు నగు' ననిరి. కులవాచకము లన్నసూరిమతమును దిరస్కరింపఁదలఁచినవలనఁదప్ప నీయంశము సూత్రముగాఁ జెప్పవలసినది కాదు, అర్థమునుబట్టి మహత్తో మహతియో యవును, మహదమహత్తులు చెప్పఁబడఁగా మఱల నీశబ్దము మహత్తు లేదా యమహత్తు అనురీతి వేఱుగా సూత్రింప నవసర మేమి?

సూరియభిప్రాయమున దోషము లేమి పైని స్పష్టము. ఇంక నిట వీరిసూత్రమున 'మహద్వాచకములును' అనుచోటిచార్థకనుశబ్దముచే నియ్యవి కులవాచకములు మాత్రమె కాక మహత్తులు గూడ నగు నని యర్థము. చాకి బోయ ప్రభృతులు కేవలకులవాచకములు కావు" (ఉ.308) అనుటలో వఝలవారియభిప్రాయ మిదియే యగు. అనఁగా మహత్తులు గాని (కేవల) కులవాచకములు లే వన్నమాట. కావున నుశబ్దమునకుఁ గులవాచకములు మహత్తు లగుటతోపాటు కాకుండుటయుఁ గల దనురీతిగా నర్థము చేయుటకు వీలు లే దన్నమాట.

శ.ర. కొఱవ, వానె, సాలెశబ్దములను గేవలము కులమాత్రవాచకములుగాఁ (మహతీతరామహత్తు) జూపినది. వీరు 'కొఱవ బోయ మున్నగు నవియును కొఱవవాఁడు బోయవాఁడు మున్నగునవి పురుషులకును వాచకములె' (వ్యా.సం.స.1300) అనిరి. కొఱవశబ్దము పురుషవాచక మగుట, శ.ర. కాని సూ.ని. కాని పేర్కొనలేదు. వీరు నుదాహరింపలేదు. కాఁగాఁ గులవాచకములు నియతముగా మహత్తు లగు నని నిర్ణయింపరా దని స్పష్టము.

సూరిమతము ననుసరించి యియ్యవి మహత్తు లెప్పుడు గా వనరాదు. కులమాత్రవాచకము లయినపుడె తవర్ణక మగు నని సూరిమతము. అది యుచితము. అట్లు గా దని వీరు 'వానియొక్క స్త్రీ' యనునర్థమునఁ జెప్పఁ దలఁచిరి. ఆపక్షమున నైనను నీయవి మహత్తు లగుటను వేఱుగా సూత్రింప నవసరము లేదు. బోయప్రభృతిశబ్దములు మహత్తులు గానిచే వానిస్త్రీ యనునర్థ మెట్లు గుదురును?

మొత్తముపై వఝలవా రేపక్షము ననుసరించినను కులవాచకముల మహత్త్వమును సూత్రించుట యనవసర మనియుఁ గొండొకచో ననర్థకము (కొఱవ మొ॥) ననియుఁ జెప్పవచ్చును.

తమసూత్రమునఁ బిదప వీరు 'వానిస్త్రీ' యనునర్థమున తత్ప్రత్య

యము వచ్చు ననుట యింం కొంకనవరణము. సం.లోనె "తత్తజ్జాతిపురుష వాచకముకంటెఁ బరముగ తప్రత్యయము వచ్చు ననుట యుక్తము. చాకి యొక్క--చాకలవానియొక్క స్త్రీ-త- చాకిత. (వ్యా.సం.స.1300) అనిరి.

కులవాచకము లెప్పుడును మహత్తులే యగు నని భావించుట మూల మున వీరు 'వానిస్త్రీ' యనునర్థమును జెప్పుకొనిరా యని సందేహము. 'బోయత' యనుచో సూరిమతమున బోయజాతికిఁ జెందినస్త్రీ యనియర్థము. వీరిమతమున బోయవానిస్త్రీ యని యర్థము. కోశములు సూరి నిరూపించిన యర్థమునే ప్రదర్శించినవి.

'వ్రేతలు గోపకులు రండీ' (సూ.ని) అనుచో వ్రేత లనఁగా గొల్ల కులమునకుఁ జెందినస్త్రీలు, (గోపకులు=పురుషులు) అనునర్థమె సముచితము గాని గొల్లవానిస్త్రీలు అనునర్థ ముచితమా? వివాహిత లైన 'వానిస్త్రీ'లనఁగా బెండ్లము లనియుఁ గాకున్నఁ గూఁతు లనియుఁ జెప్పవలె నేమో. సూరి చేసినయర్థమె సముచిత మని స్పష్టము గదా.

కొఱవ, వానె, మున్నగునవి మహత్తులుగాఁ గాన్పింపవు. అయ్యవి కేవలము కులవాచకములె. అట్టియెడల 'వానిస్త్రీ' యనునర్థము వివక్షించు టయే యట నసంభవము. ఆజాతి కలిగినస్త్రీ యనువిధముగా సూరి చెప్పిన మతుబర్థమె పొసఁగును.

'కొఱవత వానెత అనుశబ్దములు శ.ర. నుదాహరింపఁబడెనే కాని వానికిఁ బ్రయోగములు చూపఁబడలేదు' (వ్యా.సం.స.1301) అయ్యు వీరును సూరివలె ఉ.లో వానెత చూపిరి. (ఉ.308)

శబ్దస్వరూపమునను భేదము గలదు. 'వానిస్త్రీ' యనునర్థమును వివక్షించినపుడు తవర్ణకము షష్ఠ్యంతము లగుబోయప్రభృతిశబ్దములపైఁ జేరవలయును. వ్రేనియొక్క స్త్రీ యనుచో వీరిపక్షము ననుసరించి షష్ఠికి ద్వితీయాతుల్యత యైన దన్నను 'వ్రేనిత' యని కావలె. వ్రేత యగు

యొక్క [గల]వాఁడు వగ + వాఁడు వగ + ఆఁడు 'వగాఁడు' అని కావ లదా? ఇట్లె వన్నె + వాఁడు వన్నాఁడు ఇత్యాదిగాఁ గాదా? అయిన వన్నె యాఁడు అని యగును.

ఏకవచనముపై వకారము లోపింపదా? పూనికాఁడు (ఉ.305) అను నది వీర చూపిరి కదా?

అస లీతచ్ఛబ్దవకార మెట్లు లోపించినది? 'తచ్ఛబ్దవస్య లోపస్స్యాద్ దధాతోః' అని చెప్పినది. వి.వి.(వ్యా.సం.స.1305) ఆఁడు_స్త్వన్యథా మతః స్త్రియామాఁడిర్బహుత్వే స్యాత్' అని సూరికి ముందే 'యధర్వణుఁడు' 'ఆ'ప్రత్యయమును మతుబర్థకముగా విధించెను. (వ్యా.సం.స.1281) ఇట సూరి యధర్వణసమ్మతి ననుసరించి కాక వికృతివివేకవాసనచే సూత్రించె ననవలె నేమో. మొత్తముపై వీరిప్రక్రియ నన్నయాధర్వణీయ (అధర్వ ణుఁడు చెప్పిన నన్నయ చెప్పి నట్లే యని వీరిమతము.) సమ్మతికి విరు ద్ధము. అట్ల యయిన వి.వి. ఆప్రత్యయమును విధించుట వ్యర్థము గదా. సూరిలక్షణమువలె నదియుఁ దొలఁగింపవలసినదే యగును.

తచ్ఛబ్దవకారమునకు వీ రేలక్షణముచే లోపము చేయుదురు? సూరి ఉన్నకలనవర్ణకములపై మాత్రమె యిట్టిలోపమును జెప్పెను. అందుకె వీరు తమసమా.83సూ.చే నగు ననిరి. కాని వీరు చెప్పుకొన్నయా సూత్రముచేఁ గూడ నీలోపము రానేరదు. అది వీరు గుర్తించినట్లు లేదు. ఏ లన నాసూత్రమున వీరు తచ్ఛబ్దవకారలోపమును, ఉన్నకలనవర్ణములపై మాత్రమె సూరివలెనె చెప్పిరి. అట్టిఇట్టిఎట్టిఅనువానిపై 'వా'లోపమును, కొఱకుప్రభృతిపరకతలో నమహత్తచ్ఛబ్దలోపము, తనపరకతలోఁ దచ్ఛబ్ద లోపమును జెప్పిరి. ఆభాసబహువ్రీహులలోఁ దచ్ఛబ్దవకారలోపమును వారు చెప్పలేదు. (పట్టుపుట్టమువాఁడు మొ॥) మఱి యాసూత్రముచే వగల+వాఁడు అనుచోఁ దచ్ఛబ్దవకారము లోపించు టెట్లు?

ఇటఁ దచ్ఛబ్దవకారము లోపించు నని వేఱుగా సూత్రింపవలెను. దానికంటె 'ఆ' ప్రత్యయ మగు నను టుచితము గాదా?

అధర్వణుఁడే కాక కేతనయును 'ఆఁడును నీఁడును గత్తెయుఁ గాఁ దనుచో'- నని (ఆం.భా.భూ.)'ఆ' మతుబర్థకముగాఁ జెప్పెను.

తచ్ఛబ్దవకారము లోపించిన వచ్చుచున్నాఁడు ఇత్యాదులలో ద్వితీయాదులలో వచ్చుచున్నానిని, వచ్చుచున్నారిని అనురీతిరూపము లప్రసిద్ధములు. ఉన్న వేమో వెదుకవలె. అట్టియెడల నిట మాత్రము వగలానిని, వగలానికి ఇత్యాదిగా రూపములు ప్రసిద్ధములే. వీరే సమా.9.సూత్రము చొప్పున--- ప్రకృతసూత్రము (క్రియా.117)చే వాఁడు వాదు శబ్దముల మొదటిహల్లు లోపించి (వ్యా.సం.స.805) అనిరి. (అది విచార్యము.)

తచ్ఛబ్దవకారము లోపింపనివగలవాఁ డనురీతివియునిట నప్రసిద్ధములె యగుట గుర్తింపవలెను.

కాఁగా బహువచనాంతములపై మాత్రమె యుండుటంబట్టియు, వీనికి ద్వితీయాద్యంతరూపములు ప్రసిద్ధము లగుటంబట్టియు, వగలవా, డనురీతివియు వగలాఁ డనురీతివానివలెఁ గానరాకుండుటనుబట్టియు నిటఁ దచ్ఛబ్దవకారలోప మనుట సరి కా దనియుఁ బ్రాచీనార్వాచీనలాక్షణికులు పేర్కొన్నట్లుగా 'ఆ'అనుమతుబర్థకతద్ధితప్రత్యయమె యయినట్లుగా నంగీకరించుట సమంజసము.

కావున వి.వి. చెప్పినయీవిధానమును లక్ష్యానుగుణముగా సూరి గ్రహించి చెప్పుట యుక్తమే. వఝులవారు దీనిని దొలఁగించుట సరి కాదు.

కాఁగా మాయలాఁడు (మహామాయలాఁడు హరి.ద్వి.1.1854) రజ్జులాఁడు (అర.6.63) అనురీతిగా నిది తత్సమములపై నగుటయు గుర్తింపఁదగును.

బాల.తద్ధి.24,25,26.సూత్రము లట్లు గ్రహించిరి (ఉ.29,30,31).

మతుబర్థంబునందు ఇఁడి అని సంధి వేఱు చేయుట యనవసరము. ఇట్లె ఉ.30.సూ.

నావెఁడు మద్దసంబు గొని (వ్యా.సం.ప.609)

ఇట విశేషము. 'విభాగమండలిపరిమాణార్థమునఁ గొన్నిట ఏసి వర్ణక మవును. నాలుగేసి గంపెఁడేసి -అంతలు నేసి గోరంత- అంతఇంత ఇత్యాదులు తద్ధితప్రత్యయములు గావు. అవి ప్రత్యేకశబ్దములె. (ఉ.310) అంతలు అనుచో 'లు' అనునదియుఁ దద్ధితము గా దనియె వీరియభిప్రాయ ము నెన్నఁదగు. [వ్యా.సం.స.1308)

అంత, ఇంత ఇత్యాదులు ప్రత్యేకపదము లనియు 'ఏసి' ప్రత్యయ మనుట విశేషము. దీనికి మానార్థాచ్చసిరత్రస్యా త్తనువి.వి.వచనము మూల మనఁదగు. పైకారికార్థము గ్రంథాంతరమున స్పష్ట మగును.

గంపెఁడేసి యనుచో ఎఁడు, ఏసి అనుప్రత్యయములు రెం డైన వన్నమాట. ఇటఁ బరిమాణార్థమున 'ఎఁడు'ప్రత్యయము కాఁగా దానిపై విభాగార్థమున ఏసిపదము ప్రయుక్త మైన దనుట లెస్స.

'ఏసి' అనునది యవ్యయముగాఁ గోశములు పేర్కొన్నవి. ఇది యేన్యాదులవలె వాక్యమునఁ బ్రయోగమునందుఁ గ్రమాపేక్ష కల దని చెప్పఁదగును.

"ఎఁడుప్రత్యయాంతము లౌపవిభక్తికవర్ణములతో వ్యస్తముగా వాడఁబడును. బారెంట, మూరెంటన్ [బసవ.4.557]అడుగెంటనె[పాండు. 1.114]పదాదిహ్రస్వముమీఁదవలెనె యిందును నిండుసున్న మాత్రమె. [సంధి.22] బారెటన్, మూరెటన్ అని యుండరాదు." [ఉ.310] [వ్యా. సం.స.1309] వీరియీవివరణమునకుఁ బ్రయోజన మెఁడుప్రత్యయాంతము లౌప. లని చెప్పుటయె యనఁదగును. వ్యస్తతను బ్రస్తావించుటవలన నితర

తద్ధితాంతములు వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడ వని యర్థము చేసికొనరాదు. ఎఁడుప్రత్యయాంతములు స్త్రీసమములు గావున ఆశ బారెఁడు అను రీతిగాను బ్రయోగింపఁబడును. బారెంటన్, మూరెంటన్ అనుచో సంధి.22 (అఁటయిఁక-) సూత్రమువలన ఖండబిందువు లే దనుట సరి కాదు. బారెఁడు అనుచో ఖండము నుడితొలిహ్రస్వముపై లేదు. ఉండదు. అపద మగునీప్రత్యయము స్వతంత్రముగాఁ బ్రయోగింపఁబడదు గదా. నుడితొలి హ్రస్వ మనఁ బదాదిహ్రస్వ మని వారు నట (సంధి.22)వివరించియే యుండిరి.

అయినను మూరెట ననుచోనే నిషేధింపఁబడు టేమి? 'మూరెఁడు' అనుచో మాత్రము ఖండ మె ట్లున్నది. మూరెఁడు అనుచో నున్న ఖండము మూరెఁట ననుచో నుండుటకు మాత్ర మాసూత్రము విరోధించునా? వీరివివరణము విరుద్ధ మని 'మూరెఁడు' అనురూపమె నిరూపించును.

మూరెఁట, బారెఁట ననుచో ఖండ ముండును. (మూరెఁడు బారెఁడు అనుచోవలెనె) దానికి సం.14సూత్రముచే నిండుసున్న వచ్చినపుడు మూరెంట, బారెంట నని యగును. మూఁటికి, నిత్యాఁమలండువలె మూరెఁట నను రీతి నిట ఖండ ముండుట లక్షణవిరుద్ధము గానేరదు.

ఇంక నిట వీరు 'బారెటన్ మూరెటన్' అవి యుండరా దనిరి. వీరిమతము ననుసరించి యిదియు నసంగతమే. వీరే వ్యాఖ్యానించినట్లు సంధి.22సూ.చే ఖండబిందు వుండుటకు వీలులే కున్న నాఖండము లేకుండ బారెట మూరెట నని యుండవచ్చునే కదా. వేసఁగి- వేసవి యనుమొదలగుచో ని ట్లుండుట లేదా? ఖండబిందు వుండరా దనుచో బారెఁటన్ అను రూపము లుండరా దనవచ్చు. కాని ఖండము లేనిరూపములు నుండ వనుటెట్లు?

కంటికి మంటికి ననుతీరుగా బారెంట మూరెంట నని మాత్రమె

యన్నవి తద్ధితాంతముల యనవలెఁ గదా. ఇట నౌపవిభక్తిక మెట్లు నిల్చినవి? (వ్యా.సం.స.1312) మోఁకాలియొక్క యనుషష్ఠ్యంతముపై నైనపదకతప్పదు గదా. మోఁకాలుపరిమాణముగాఁ గలది యనుచోఁ [మానెఁడురీతిగాఁ] ప్రథమాంతముపై నిల్చి 'మోఁకాలుకొలఁది' యని వీరు చూపవలె. మోఁకాలికొలఁది యనుటచేతనె యిది [పరిమాణమాత్రవాచకము గాదనియు] షష్ఠ్యంతముపై నగు ననవలె. కుత్తుకబంటి [స్త్రీ.2.8]కుచంబులబంటి [భాగ.10.పూ.1099] కార.19.సూ.చే తనప్రత్యయపరకతయంద మాత్రమె షష్ఠికి ద్వితీయాతుల్యత చెప్పిరి. కావున నీబంటికొలఁదిప్రత్యయములు పర మగుచో నాకార్యము లేదు. మోఁకాలిబంటి యని యగుట యెట్లు? వ్యస్తతలో యొక్కలోప మెట్లును సాధారణమె. కావున నిట లోపించిన దనవలె. తనపరకత్వమున ద్వితీయాతుల్యత యగుటకును బంటికొలఁదిపరకత్వమున మాత్రము వ్యస్తస్థితియందువలె లోపించుటకును భేదమేమి? వీరిప్రక్రియ యొకక్రమములోఁ గానరాదు.

మానార్థమునకు దఘ్నార్థకబంటికి [కొలఁది] భేద మిటను స్పష్టమె కుచములబంటి యనుచో కుచములయంత పరిమాణ మని యర్థము కాదు గదా. కుచములవఱకు, కటివఱకు ననురీతి నర్థమునుబట్టియుఁ బూర్వశబ్దము షష్ఠ్యంతమె యైయుండవలె. తెలుఁగున షష్ఠ్యంతముపై నవుటయు నిచటి విశేషము.

ఇఁక నీయవి షష్ఠీసమాసములవంటివి గాఁ దలఁచిన వీరు ముక్కుయొక్క బంటి- ముక్కునబంటి యనురీతి నవర్ణము నాగమముగాఁ[ప్రౌఢ. సమా.1] జెప్పక ప్రత్యయ మనుట యేలో, ఇది కొలఁదిపరకత్వమునఁ గానరాదు. దీనిని సూరి పేర్కొనలేదు. 'తతః పూర్వత్ర నః క్వచిత్'అవి వి.వి.

ఈప్రత్యయ[బంటి]పరకత్వమునసవర్ణమునుజెప్పినది.వి.వి.లోనీ'సవర్ణము' ప్రత్యయ మన్నచో బంటి షష్ఠీసమాసోత్తరపద మనుట యొప్పదు. వి.వి. మార్గ ముచితము.

ఇయ్యవి ప్రత్యేకపదములు గనుకనె షష్ఠీసమాసములుగాఁ దత్సమ ములపైఁ గూడ నిల్చుచున్న వనిరి. ప్రౌఢ.తద్ధి.17.సూ. సరి కా దని కటి బంటి యనుచో నిది తద్ధితప్రత్యయమె కా దనిరి. [వ్యా.సం.స.1312] కొలఁది యట్ల కావచ్చును. కాని'బంటి' అపద మనియ కోశములు పేర్కొన్నవి. వీరునుదగినయాధారముఁ జూపలేదు. ప్రౌఢ. బంటిని మాత్రమె [తద్ధి.17] ప్రస్తావించుట సమంజస మై యుండ వీ రద్దానిని దిరస్కరించు టకుఁ దగినయాధారము లేదు. [ముక్కనబంటి యనునదియు బంటిప్రత్యేక పద మని నిరూపింపఁజాలదు.]

## తనమయము :

వీ రీసందర్భముననె 'సంస్కృ-తనమయము'[ఉ.311]అని చూపుట విశేషము.(తద్ధి.18) పమయప్రత్యయార్థకమయశబ్దము ప్రత్యేకముగాఁదత్స మముగాఁ గల దనివీరియభిప్రాయము. (వ్యా.సం.స.1313) మయప్రత్య యార్థమున సంస్కృతమున మయపదము లేదు.తెలుఁగునఁ దత్సమ మగుట యెట్లు? మయట్ప్రత్యయము తత్సమముగాఁ బద మయ్యె ననరాదు గదా.

'సంస్కృతమయప్రత్యయార్థకమయశబ్దము సైతము ప్రత్యేకపదముగా నాంధ్రకవులచేఁ బ్రయోగింపఁబడసాగె నని చెప్పసగును. కరుణమయతన్ (శ్రీ.2.141)-మయము-ప్రచురము.' (వ్యా.సం.స.1313) ఆంధ్రకవులు ప్రయోగించి రనుటచే నిది యీయర్థమున సంస్కృతమున లేదని వారును స్పష్టము చేసినట్లే. సంస్కృతమున లేకయె తెనుఁగున సంస్కృతసమ మేర్పడుట యీయొక్కశబ్దమునెడలనె యనవచ్చు నిట్టిది భాషలో మ ఱొకటి గానరాదు.

ఇది యైన నంగీకరించుటఁకు దిక్కనప్రయోగము మూలము. 'కరుణమయత' యనుచో నట మయశబ్దముపై 'తల్' సంస్కృతప్రత్యయ మైనది. తత్సమముగా నంగీకరించిన సంస్కృతప్రత్యయ మెట్లు? అనఁగా 'మయ'పదమును సంస్కృతముననే తెలుఁగుకవులు చేర్చి రనవలె. స్పష్టముగాఁ జెప్పవలె నన్న మయట్ప్రత్యయార్థమున 'మయ'పదమును దిక్కనయె సంస్కృతమున సృష్టించె ననవలె. సంస్కృతమునఁ బుట్టించినపిదప నిఁక దానినుండి తత్సమ మేర్పడుటలో బాధ లేదు. కాని తెలుఁగుకవులు సంస్కృతమునఁ బదమును సృష్టించి రనుటయే సముచితముగాఁ దోఁపదు. ఒకవేళఁ బొరపా టయిన నది తెలుఁగుకవులది యగు టుచితము కాని దీనికి ఫలము సంస్కృతమున కంటఁగట్టుట యెట్లు? సంస్కృతమున నీయర్థమున మయపదము ప్రయుక్త మగుట లేదే. తత్సమముగా సాధించినను దెలుఁగునఁ గూడఁ దనమయ మనురీతిసమాసములందే కాని వ్యస్తముగా మయము పదము ప్రయుక్త మగుచున్నదా? అట్టిది గల దనుటకు వీ రొక్క యాధారమును జూపలేదు. సంస్కృతాంధ్రములు రెండింట లేనియాదానిని గల్పింప నేల?

సమాసమునను నిది పూర్వపదముగా నెచ్చటను లేదు. ప్రోవులమయ మనునర్థమున మయపుఁబ్రోవులు (ప్రచుర మైనప్రోవులు) అనురీతిని జూపఁగలమా? మయ మనునది యుత్తరపదముగా మాత్రమె యుండుటకు హేతు వేమి?

కరుణమయత- కరుణామయత్వము. కరుణశబ్ద మాకారాంతస్త్రీలింగము కాన కరుణామయత యనవలె. హ్రస్వముతోఁ 'గరుణమయత' యని కావలె నన్న కరుణయొక్క మయత యని దీనిని సాధ్యసమాసముగాఁ జెప్పవలె. అపుడు 'మయ'పద మంగీకరింపవలె. నని వయిలవారిమతము. నదిసుత, మున్నగుచోట్ల సిద్ధసమాసములలో జీప్ప్రత్యయమునకు హ్రస్వ

మగుటగాఁ (ఉ.సమా.26సూ) జెప్పిరి గదా. అట్లే యిట టాప్రత్యయము నకు హ్రస్వ మైనట్లు చెప్పుకొనవచ్చు. ఇట్టిది విశేషస్థలముగాఁ జెప్పు కొనుట యుచితము. లేనిపదమును సంస్కృతాంధ్రములఁ గల్పించుటకంటె భాషలో నొకానొకచోటఁ గన్పించువిశేషమును విశేషముగానె తలఁచుట సమంజసము గదా. (కరుణ-దయాయుక్త మనునర్థముతో నిది సంస్కృత మునను హ్రస్వాంతమ. అట్టియర్థము నె ట్లేఁగుదుర్చుకొనుటయు నొక మార్గము కాకపోదు.

కావున నీయొక్కప్రయోగమునుబట్టి మయపదము (నీయర్థమున) గల్పించుట సరి కాదు. దీనినిబట్టి ప్రౌఢ.లక్షణము సరి గా దనుటయు నట్లే సరి కాదు. ఇంకఁ బ్రౌఢ. తెలుఁగుశబ్దములపై (సంస్కృత)మయ ప్రత్యయ మగు ననుట యసంమజసము గావునఁ దెలుఁగుననే'మయ'(అపద ముఁగా)ప్రాచుర్యార్థకతద్ధితప్రత్యయముగాఁ జెప్పఁదగును.ఇవి యేర్పడుటలో సంస్కృతప్రత్యయమె మూలము కావచ్చును. కాని సంస్కృతప్రత్యయ ముగా విధించుట మాత్ర మిట శబ్దశాస్త్రసంప్రదాయానుగుణము కాదు. (చూ.త్రి.శే.)

కాఁగా సంస్కృతాంధ్రములం దెందును మయపదము నంగీకరించుట సరి కాదనియు, తనమయ మిత్యాదులలో 'మయ'యనునది తెలుఁగుతద్ధి తముగాఁ జెప్పఁదగిన దనియు నిశ్చయింపఁదగును. మయప్రత్యయాంతము క్లీబసమము. కావున మువర్ణక మగును.

## వర్ణకాంతరములు :

బాల.తద్ధి.28.సూత్ర మట్లగ్రహించిరి. (ఉ.33.సూ.)

ప్రౌఢ. సాధించిన చెడుగఁడు దుడుకఁడు నిడుపఁడు అనువాని నిటనే వయులవారు చూపు టుచితమ యనఁదగు. 'అడప' యనుచో సూరి మతు

బర్థమునం దప్రత్యయము చూపె. ఏతదంతము స్త్రీసమము. దుడుకఁడు ఇత్యాదుల దుడుక మొ॥ మగాదులలోఁ జేర్పవలసినవి. పుంలింగసమము లగుట కొంత భేదము గలదు. చెడుగు- ధూర్తుఁడు (సూ.ని.) చెడుగుల్ కొందఱు (కాళ.శ.101) కాఁగాఁ జెడుగు (మహదమహదర్థకము నగునుఁ. శబ్దముపై మహత్త్వమున స్వార్థమునం దప్రత్యయము చెప్పఁ దగు నని తోఁచు. (చూ.త్రి.శే.)

'సంఖ్యకుఁ బూరణార్థమున అవప్రత్యయ మగును' మున్నగునవియు నిందుఁ జేరఁదగినవే.' (ఉ.311) మున్నగున వేవో యిట వీరు దెల్పలేదు. 'అవ'నుగూర్చి అచ్ఛి.25.సూ.కడ స్పష్టము.

పిదప వీరు సంస్కృతతద్ధితములు గొన్ని ప్రదర్శించిరి.

ఇది తద్ధితపరిచ్ఛేదము

# క్రియాపరిచ్ఛేదము

బాల. క్రియా. లక్షణములు 1నుండి25 వఱకు వీరు దాదా పట్లుగనె గ్రహించిరి. (ఉ. క్రియా. 1, 11నుండి 33సూ॥) అట నట పరం బగునపుడు ఉన్న (ఉ.21) డుజ్ఞనకు ఎను (ఉ.24) అనురీతిగా సూరి సూత్రములందలి సందిని వేఱుచేసిరి. స్పష్టత కైన నది యనవసర మగుట స్పష్టము.

ఉన్న యనునది యనుబంధ మగును (ఉ.21)ఉన్న యనెడిఅనుబంధం బునకు (ఉ.23) ము న్నగురీతిగా (ఉన్నానుబంధంబు- సూరి) (ఉ. క్రి. 31) మొ॥వీరు సూత్రమును వివరణాత్మకముగాఁ జెప్పుటయుఁ గలదు. ఇదియు స్పష్టతకె కావచ్చును. వివరణముననె చెప్పవచ్చు. ఇందువలన సూరిలక్షణ ములందు దురుక్తి గల దని తలఁపరాదు. ఇట్లె ఉ. క్రియా. 16 సూత్రవివ రణమున ఇందుఁ దుదిఇకారంబు ప్రత్యాహారార్థంబు' అని సూరివివరణ మున లేనితుదిశబ్దమును జేర్చుటయు స్పష్టతకుఁ గావలె. ఏ లన నాసూత్ర మునఁ జెప్పిన డుఙ్రుపురునుముఙ్' అనువానిలో ఇకారము తుదినే తప్ప నాదిమధ్యములయం దెచ్చటను లేదు గదా సూరివివరణమును సూక్తమె.

## ఉడంతములు

ఉన్నాను- ఉన్నావు- ఉన్నాము- చేయుచున్నాను, చేయుచున్నాము చేయుచున్నావు అనురీతి గలప్రయోగములు నన్నయభారతభాగమందే కా! తిక్కనశ్రీనాథాదులగ్రంథములందును లేవు. అవి ప్రాచీనప్రామాణికకః ప్రయుక్తములు కావు. వీనిని సూరి విడిచి తక్కినవానిని సాధించు టు. తము' (వ్యా.సం.స.1357) ఇట్టి వాంధ్రభాషలోనె లే వని వధులవారుస జెప్పలేదు. ఉన్నపుడు వానిని సాధించుటలోఁ ద ప్పేమి? "వచ్చినావు అః రీతిరూపములు నైత ముత్తరాంధ్రకవులు ప్రయోగించిరి. ఇట్టీ రూపము

నర్వాచీనకవులు ప్రయోగించుటచే నివి సంగ్రహించు టుచితమె-- (వ్యా. సం.స. 1357) అనిరి కదా. మఱి నేఁటివైయాకరణుఁ డగుసూరి చేయు చున్నాను అనురీతిరూపములు సాధింపరా దను టెట్లు? "ధూర్జటి మొద లొక్క-న్నమహాకవులు చదువుచున్నాను- మున్నగువానిని నైతము ప్రయో గించిరి. నేఁటికాలపుసూరియిట్టివానిని సంగ్రహించుట యుక్తమె కాని సూరి ప్రాచీనమహాకావ్యభాషను మాత్రమె సంగ్రహింప నుద్యమించినవాఁ డగు టంచేసి యిట్టిరూపములు సాధించుట సరి గా దనక తీరదు. (వ్యా.సం.స. 1358) అని సమర్థించిరి. అంతే గాక 'నన్నయ గాకున్నను దిక్కన యైనఁ బ్రయోగింపలేదు. సూరి సాధించుట యుక్తము గా' (వ్యా.సం.స. 1480) దని మఱి యొకసిద్ధాంతము చేసిరి. సూరికి నన్నయతిక్కనలప్రయోగములు మాత్రమెసాధింపవలె ననునియమ మున్నట్లు చెప్పుట కాధారము చూపరైరి. భాషాసామాన్యలక్షణమును దిక్ప్రదర్శనముగఁ జూపఁబూనిన దగుటచే బాల. లో విశేషప్రయోగములు ప్రముఖముగా స్వీకరింపఁబడకపోవచ్చు నేమో. కాని నన్నయతిక్కనలప్రయోగములె కాని లేదా ప్రాచీనములె కాని మాత్ర మె సూరి యుద్దేశించె ననుట నిరాధారము. పెద్దనాదులప్రయోగములను సూరి ప్రదర్శించియే యుండెనే. కెంధూళికెంజడ లనియుఁ జూపట్టు ప్రయో గములు నన్నయతిక్కనలు చేసిన వగునా? ఈకార్యము లాఁతిచోనహితము గానంబడియెడి నని చూపిన 'గతానుగతికోలోకోయటంచు, నన్నది కళా పూర్ణోదయమందలిదే. పద్యాదిసూత్రము నొద్ద తిక్కనప్రయోగమునందలి పెట్టును జూపక యాముక్తమాల్యదలోని దుదాహరించె నని వీర చెప్పిరే. ఆకర్ణింపుదురు మున్నగువానినిగూర్చి (వ్యా.సం.స. 1625) వీ రిట్లు చెప్పిరేడు ఇవి భాగవతాదులనుండి కల వనిరి.

నన్నయాథర్వణసమ్మతి లే దని కొన్నియెడల సూరిలక్షణములను దిరస్కరించి యిప్పటికిని ఉ.లో వీరు పైలఘంతరూపములను సాధించిరి. ప్రౌఢవ్యాకర్త సూత్రించుట కనుమతించిరి కావునఁ దాము చెప్పుట యుక్ తమె యని వీరియభిప్రాయము కావచ్చును. అయ్యు క్త్వార్థకేకారసంధివలె

నిట్టిరూపములు భారతాదులందు లేకుండుటను సూత్రింపక సామాన్యముగా సాధించి నన్నయకాలమునాఁటిరూపము లని వివరణమునఁ బేర్కొనుట యుచిత మైయున్నది. (ఉ.63)

విశేషణరూపములను సూరియుఁ బ్రత్యేకముగ సాధించెను. కావున లడంతక్రియాపదములుగా వీని నిట్లు. సూరి సాధించుట యుచితమె కాక యవసరము నని గుర్తింపఁదగును.

## విడంతములు :

"యకారము తుదిని గలకొన్నిధాతువులప్రథమపురుషైకవచన మున 'ఎను' అనుదానితోపాటు అనుఅనునది బహుళముగా నిల్చుట కవి ప్రయోగదృష్ట మగుచున్నది. ఆయలె. తన్నుకొని పోయన్. మొ॥ (ఉ.364) 'అద్యః' క్రియాసుభూతార్థద్యోతిఁనమాద్యగం వినా" యనుచిం. లక్షణ మిట్టివానినే తిరస్కరించినది. నన్నయసమ్మతికి విరుద్ధ మయినను బ్రయోగములనుబట్టి గుర్తించుట యుచితమె. మిక్కిలియరు దగునిట్టివానికి సూత్రమున నవకాశము కల్పింపక వరుఁలవారును వివరణముననే ప్రస్తావించుట యుచితముగానె యున్నది. కానీ వీరు 'అను-బహుళముగాఁ గల దనుట సమంజసము గాదు. ఇట బహుళ మన నేమి? సూరిలక్షణములందు బహుళపదమును బెక్కుచోట్ల దిరస్కరించినవీ రిట సార్థకముగాఁ బ్రయోగించిరా? క్వాచిత్కముగా నిల్చుట గన్పించుటను బేర్కొనఁదగును. ఇది యేసూత్రముచేతను సాధింపఁబడునదియుఁ గాదు గదా.

వీరివివరణమును సరిగా లేదు. 'యకారము తుదిని గలకొన్ని ధాతువులు' అని పోయ ఆయ అని యుదాహరించు టేమి? ఇట ధాతువులు, అగు పోవు,అనునవిఇందుఁజివర యకార మేది?అగుపోవులకడ్రాలకిద్వక్రంబులు పరం బగునపుడు యకారం బగును (ఉ.క్రి.133) ఆయెను, పోయెను అని యకారము వ్యాకరణము సాధించినది. ఆసూత్రముచే నగుయకార మిద్వ

క్రములు పర మగునపుడె. 'అను' అనునది పర మైన యకారమె రాదు. పోయ ఆయ అని యగు టెట్లు?

తీయు పోయు మొద లగునవి యాంతములు. వీని కిద్వ్యక్రములు పర మగునపుడు సకార మగును. తీసెను. అట వీరు చెప్పినయీకార్యమునకుఁ బ్రసక్తియె లేదు.

కావున వీ రిట 'భూతార్థకప్రథమపురుషైకవచనములో యకారము పైని యెత్వమున కత్వ మొక్కచోఁ బ్రయోగదృష్ట' మవు ననురీతిగా వివరించుట యుక్తము. వీనిని విశేషస్థలములుగా నెన్నఁదగును. ('గతానుగతి కోలోకోయటంచు' సనువానివలె,

ఇట నొకవిశేష మిట్లు చెప్పిరి. "భవిష్యత్సామీప్యము మొదలగు కొన్నియెడల భూతార్థక్రియలు ప్రయోగింపఁబడుట గలదు. తా వచ్చె మదర్శనాయుధుఁడు, మానవపతి న న్నెక్కెడిదానవు నీ వనియె నేని అది యేల యవగుణ మయ్యెన్- ఇట అగున్ అని ప్రయోగింప నగును. నిన్నెద్ది గఱపిరి నెమ్మితోడ దానిన చేయుట ధర్మమవు' -(ఉ.361)

ఇందు "నీ వనియె నేని- అనుచోఁ జేదర్థయోగమున భావిని లృట్టునకు (క్రియా.119) ననుదానిచే లి ట్టయినది. నిన్నెద్ది గఱపిరి యనుచో న్యూనవచోవాక్యమున నది యధ్యాహరింపఁబడఁగా నట్ల లృట్టునకు లి ట్టగును. భవిష్యదర్థమును జెప్పియుఁ బక్షాంతరమును వీరు లాడంతరూపముఁ (అగు అనురీతిని) జూపిరే కాని లృడంతమును జూపకుండుట గమనార్హము.

స్త్రీరత్న సూక్ష్మ మీ వ ట్లేరూపున నైన వంశహీనత మమ్ముం జేరక యుండం దగఁ బరిహారము సేసి తది యేల యవగుణ మయ్యెన్' అనుచోఁ బరిహారము సేసి యనుభూతక్రియ ననుసరించి 'అయ్యెన్' అని భూత

క్రియ ప్రయుక్తము. ఇట్ట బక్షాంతరమున లాడ్రూపమె. అయ్యు నిట భవిష్యదర్థము గల దనుట చింత్యము.

తా వచ్చె సుదర్శనాయుధుడు అనుచో ద్వరితార్థమున భావిని భూతమును బ్రౌఢ. చెప్పుటను పీ రిట స్పష్టము చేసిరి.

## చేసినానువెం॥ :

చేసినాను- చేసినాము- చేసినావు అనునవి ప్రాచీనసమ్మతములు గావు. [ఒక్క రంగనాథరామాయణము దప్ప.] ఇవి సమాపకక్రియలవలెఁ జూపట్టును. వర్తమానభూతార్థములందె విధేయవిశేషణములం దిట్టిభేదము గల్గెను. భవిష్యద్విధేయవిశేషణములం దిట్లు చేయఁగలవు, చేయఁగలము, చేయఁగలను అనురూపములను మహాకవు లెవ్వరును బ్రయోగింపలేదు" [పు.365]

కోవఁగలా వనియు [సమీ.6.138] గోపాలుఁడు గలాఁడు [పాం. 5.44], చావఁగలా రని శాప మిచ్చె [అను.1.198] మొ॥

చేసినావు అనురీతి వర్వాచీనకావ్యములం దఱుచుగనే కలవు. సూరి వీనిని సాధింపలేదు.ఇవి విధేయవిశేషణము లనియుఁ గ్రియాపదములవలెఁ జూపట్టు ననియు వీరియభిప్రాయము. వచ్చినవాఁడను వచ్చినాఁడను- వచ్చినాను అనియే వీనియేర్పడినచరిత్ర అయ్యుండవచ్చును. కాని యిట్టియెడలఁ దచ్ఛబ్దవకారలోపముతోఁ దచ్ఛబ్దముపైని విభక్తియును లోపించిదాని కయిన యాగమములు [నువురు] మాత్రము నిల్చియున్న వని చెప్పుటకంటె శబ్దశాస్త్రోచితముగా లాఘవ మగుమార్గమునఁ గ్రియాపదములుగాసాధించుటయె యుచిత మనిపించు. వరుఖలవా రన్న ట్లివి క్రియాపదములవలెఁ జూపట్టుటయే కాక క్రియాపదములుగా నన్వయించుటలోనె సౌలభ్యము నధికము.

'వచ్చుచున్నవాఁడు' అనురీతిని విశేషణములుగా బ్రయుక్త మయినవే 'వచ్చుచున్నాఁడు' అని యై పిదప వర్తమానార్థకక్రియాపదములుగా

స్థిరపడినట్లే చేసినవాఁడు- అను క్తవదర్థకవిశేషణరూపములే చేసినాఁడు అని యై పిదపఁ గ్రియాపదములుగా స్థిరపడిన వనియు వీనిసామ్యమున చేసినావు చేసినాను- చేసినాము అనునవి మధ్యమోత్తమపురుషార్థములందుఁ గల్గిన వనియుఁ జెప్పఁదగును.

ఏ మైనను వచ్చుచున్నాఁ డనురీతివి వర్తమానార్థకక్రియాపదము లన్నట్లుగనే, చేసినాఁడు- చేసినావు- చేసినాను అనురీతివి భూతార్థకక్రియా పదములుగాఁ జెప్పుట సక్రమమె. చేసెను, చేసితివి- చేసితిని అనువానితో పాటు భూతార్థమున నీయవియుఁ గ్రియాపదము లగుట విశేషముగా గుర్తింపఁదగును.

'ఇట్టిరూపముల నర్వాచీనకవులు ప్రయోగించుటచే నేఁటివైయాకర ణులు సంగ్రహించు టుచితమె' (వ్యా.సం.స.1357) యని గుర్తించిన వరుఖులవారైన నుద్ద్యోతములో నీక్రియాపదములను సాధించిన బాగుండెడిది.

## ౡడంతములు :

'కలనుకలము కలవు అన్నవి నన్నయభారతభాగమునఁ జూపట్టలేదు' (వ్యా.సం.స.1367) కావున చేయుచున్నావు అనురీతివానివలెనె చేయఁగల వనురీతివియు సూరి సాధించుట యుచితము గా దని పైరీతిగనె చెప్పిరి. (వ్యా.సం.స.1368) సూరి సాధింతుట యుక్తము గా దనుచునే "చేయఁ గలను చేయఁగలము చేయఁగలవు అనురీతిరూపములు నేఁ డసాధువు లన రాదు. అట్టివి సయిత మర్వాచీనకవులచేఁ బ్రయుక్తము లయియున్నవి (వ్యా.సం.స.1368) [ఉ.367] యనిరి. ఇట్లు వీరు సూరి నన్నయభాషకు మాత్రమే లక్షణము చేయవలెఁ గాని యది మీర రా దని నియమించుటలో సామంజస్య మేమో తెలియకున్నది "ఎఱ్ఱాప్రెగ్గడ వందఁగలఁడు వందఁ గలరు అనురీతిని బ్రథమపురుషమునందుఁ బ్రయోగించెను. -అమహత్త్వ

మున నెల్లరును వండఁగలదు వండఁగలవు అనియె వాడిరి" (ఉ.366) (అమహదర్థమున విశేషణరూపముగ సాధించునవకాశమె లేదు.) అట్టి యెడల లృదంతములు ప్రథమపురుషలే కాని మధ్యమోత్తమపురుషక్రియలు లే వనవలెనా.తాము సాధించుచునే సూరిమాత్రము సాధింపరా దనుటయెట్లు? ఉ.లో సూరి సాధింపరా దని చెప్పకుంట కొంత యుచితమ యగుచుసం.లో వీరు చేసినవిమర్శనమును విడిచిపుచ్చి రేమో. అది యుచితమ.

జయింపఁగలను [జై.7.13]భేదంబు లె నైనఁ దెలుపఁగలము [రామా.2.126] నిర్వహింపఁగలనా నిను బాసి రఘూద్వహా [రామా.6.10] ఎట్లు వేడఁగలమయ్య [కాశ.3.123] ప్రీతి నాహారంబు పెట్టఁగలము [పం.1.252]మొ॥

## దుగాగమం :

'ఓడుదురు నీ విట వచ్చి యేల కడున్'- దీనినిబట్టి ఉదు కాదు. దు అని విదిత మగును'- [వ్యా.సం.స.1375] దుగాగమ మనక ఉదుగాగమ మన్న స్వరయతి చెల్ల వలయు నని యెంచి రేమో. కానిచో నీప్రయోగము 'ఉదు' కా దని నిరూపించు ననుట యెట్లు? ఎడు, ఎద మున్నగు నాగమస్థలముల నెత్వమునకె యతి గుదుర్పవలయునా? దీనిఁ గ-పెూద ఘనపాంశుజాలముల భీమశిఖావళి'- అని వీరే యుదాహరించిరే.ఇటవ్యంజన యతినిబట్టి ఎదగాగమము గా దన్న నారూప మగుట యెట్లు? ఉత్వము ధాత్వంతమున నిట నెల్లెడల సహజముగా నుండుటచే 'దు'వర్ణమునుమాత్ర మాగమముచేయఁజాలము.కాన లాక్షణికులు'దుతివర్ణకౌ క్రమాత్ స్తః'అను రీతిగా దువర్ణమును మాత్రమె విధించి రనఁదగును.

## ఎడుగెడికృత్తులు :

ఎడుగెడికృత్తులు కేవలవర్తమానార్థకము లనుసూరియాశయము సరి కాదు" [ఉ.365,వ్యా.సం.స.1378]ఇది సరి కాదు. ఇట సూరి వక్ష్యమాణ

విధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడుగాద్యాగమంబు లగు నవి వివరించెను. ఇట నెడుగెడిక్కులు మాత్రమె పేర్కొనఁబడలేదు. ఆవక్ష్యమాణవిధి [క్రియా.23] ఎదగాగమమును గూడఁ బేర్కొనుచున్నది. అదియుఁ గేవలము వర్తమానార్థముననె యగు నని సూరియాశయమా? సూరి ప్రాయికంబుగా వర్తమానంబునం దనుచుండ నీయవి కేవలము వర్తమానార్థమున నగు నని సూరియభిప్రాయముగాఁ జెప్పుట యసంగతము గదా. వర్తమానార్థమున వచ్చెడును వచ్చెదను అనురీతివి తఱచుగాఁ బ్రయుక్త మవుచున్న వనియు, ననఁగా వచ్చును. వత్తును అనురీతివి ప్రాయికముగా వర్తమానార్థమున లే వనియు [అరుదుగ నుండు ననియు] సూరివివరణ వాక్యములవలనఁ దేలుచుండఁగాఁ దద్భిన్నముగా నర్థము నేసి యది సరిగా దను టుచితము గాదు గదా. కేవలవర్తమానార్థముననే యగు నని తలఁచుచో సూరి యటిలు క్రియా.23 సూత్రమున లాట్టురుఙపరం బగునపు డని సామాన్యముగా లా ట్టని యేల చెప్పును వర్తమానార్థకలాట్టురుఙు అని చెప్పఁడా? ఇతరకాలములందు వీనిని వాడరా దని సూరియాశయము గానేరదు. (ఉ.367)

## భూతము-లాట్టు :

'వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడు' నని సూరి యిట వివరింపఁగా వీరు 'వచ్యర్థస్థలములందే కాక పెక్కుస్థలముల భూతమందును లాట్టురూపములు గన్పట్టుచున్న' (వ్యా.సం.స.1372) వనిరి. (ఉ.268) పెక్కనిరి కాని విందుమ- వింటివి (ఉ.268) ఒక్కటి సరియైనదిగాఁ దోఁచును. సం.లో 'నిత్యంబు నివేదింతురు తల్లికి'- నివేదించుచుండెడివారు. (వ్యా.సం.సం.స.1376) అవి చూపిరి. వీ రర్థముగా నిచ్చిన 'నివేదించుచుండెడివారు' అనునదియుఁ దద్ధ

ర్మార్థకవిశేషణరూపమే యగుట విశేషము. విపేదించినవారు- నివేదించిరి. అనురీతిగాఁ జూపఁదగును గదా. 'నిత్యము నివేదించి' రనురీతిభూతర్థకముగా నన్వయించుటకంటె నిత్యము నివేదింతు రనురీతి తద్ధర్మార్థకముగాఁ జెప్పుటయే యుక్తము గదా.

## ఉన్న :

చన్నె, ఉన్నె అనురీతివిశేషములను ప్రౌఢ. ననుసరించి వీరు పేర్కొనిరి. ఉందుధాతువున కిట్టివర్ణలోపరూపములు స్థలాంతరములందును గలవు. ఉండునది, ఉన్నది ఉండునేనిన్ ఉన్నేనిన్ ఉన్నన్- ఉండినన్- (ఉ.368) ఇందు, ఉన్నది, ఉన్నేనిన్ అన్నవి విశేషస్థలము లనవచ్చు. కాని ఉన్నన్ (ఉండినన్) అనున దట్లు గాదు. 'చేదాద్యర్థనాంతం బయిన యుండున కున్నాదేశంబు విభాష నగు' (క్రి.657) కావున నీరూపముబాల. చే సాధ్యమ. వీరును ఉ.క్రి.67సూ.గా దీనిని బేర్కొనిరి. కావున నిట ఉన్నన్ అనునది పేర్కొనఁదలఁచినను నాసూత్రసంఖ్య నీయఁదగును. ఇట వర్ణలోపము లేదు. 'ఉన్న' యన్నది మొత్త మాదేశము.ఉండునేని,ఉండునది యనుచోట్లఁ గూడ బిందుపూర్వకడువర్ణమునకు మొత్తమునకు నకారపుఁబొల్ల నాదేశము చేయుట లాఘవము.

## లూడంతములు :

'లూట్టుడుక్షున కెడుతవర్ణంబులు ద్రుతాంతంబు లగు' (26)నను సూరిసూత్రమును మార్చి' లూట్టుప్రథమడుశ్రుజలకు ఎడుమ,తన్వర్ణకము లాశీశ్యాపార్థములం దగును. (ఉ.37సూ)

సూరి డుక్షున కనియన్నిపురుషలయం దన్నివచనములకును జెప్పఁగా వీరు ప్రథమపురుషయందు మాత్ర మేకబహువచనములు రెంటికిఁ జెప్పుట మొదటిసవరణము. "లూడాదేశము లగుడుజాపురుషబోధకప్రత్యయము లన్నిటికిని నాదేశమును ఎడు-త- అది అనువానిని విధించుటచేత (ఇందు

అది సూరిదుజ్ఞానకుఁ జెప్పలేదు. లూట్టునకు మాఱుగా విధించెను.)నయ్యావి పురుషత్రయమునందును బ్రయోగింప వర్తిమ లనునప్తార్థము సూరిపక్షమున దుర్వార మగుచున్నది. సూరిగారియుదాహరణస్వారస్యమునుబట్టి ప్రథమపురుషమునందు మాత్రమె యేకత్వబహుత్వభేదము లేక ఎదుతలు వచ్చు ననియు-' (వ్యా.సం.స.1392) అని మొదలుగాఁ జెప్పుటంబట్టి వీరు సూరియుదాహరణముల ననుసరించి యీసవరణమునకుఁ బూనుకొనిరనవలెను. లక్ష్యములనుబట్టి లక్షణమునర్థము సంకుచితము చేయు టెట్లు గుదురును? ప్రథమపురుషయందు మాత్రమె యగునని సూరియుఁ దలఁచినచో వీరివలె దుజ్ఞన కనక దుజ్ఞున కనుట యేల? అట్లనుటవలన నుదాహరణములయం దెట్టిస్వారస్య మున్నదో కాని సూత్రముమాత్ర మనర్థక మగుట లేదా? కాన సూరియభిప్రాయ మిది కాదు. ఏది యపార్థ మని వీరు పేర్కొనిరో యదియే సూరి లక్షణముచేఁ జెప్పినయర్థము. మధ్యమోత్తమ పురుషలయందును నీకార్య మున్నను రూపమె ల్లెడల సమాన మగుటం జేసియును సూరి ప్రథమపురుషకు మాత్రమె యుదాహృతు లిచ్చియుండ వచ్చును.

దుఙ్రులకు దువు లగు నన్న 'వురునుము' లల్లే యుండునా? నీవు రాక్షసుఁడ వగువు మీరు అగురు అని మధ్యమపురుషయందు మాత్రము లూణమ్మధ్యమపురులకు ముదుజ్ఞు లవును గాన నిబ్బంది లేకపోవచ్చును. (కాని సూరిమతమున నొకపక్షమున నీవు రాక్షసుఁ డ వయ్యెదును రాక్షసుల రగతను అని యేర్పతురూపములు వీరిమతమున నసాధువు లగును.)

ఉత్తమపురుషయం దెట్లు? నేను దీర్ఘాయు వగును, మేము అగుము అని యుండునా? లేక యీయర్థములం దుత్తమపురుషక్రియారూపము లుండవా? నిర్ణయించిచెప్పమింజేసి దుఙ్రుల కన్నవీరిలక్షణము పై రీతి నప రూపములను సాధించుచున్న దనక తప్పదు.

సూరి 'లూ' ట్టని సామాన్యముగాఁ జెప్పఁగా వీ తాళీశ్యాపార్థములందు

మాత్రమె చెప్పిరి. కావి లూదర్థములలో నొక టగుప్రార్థనమునఁ బ్రథమ పురుషయందును దుఙ్రు లట్లె యుండి హరి ప్రసన్నుఁ డగును, హరి హరులు ప్రసన్ను లగురు అనురీతిగా నుండవలెను. ఇవి యాశీరర్థకము లనుట గుదురదు గదా. (వ్యా.సం.స.1393)(ప్రార్థనార్థమునఁ బ్రథమో త్తమపురుషక్రియ లుండ వని నియమింపలేదు.ఁ

కావున వీరు ప్రథమయందె యగు ననియు, నాశీశ్ప్రార్థములంద యగు ననియుఁ జెప్పుట సరి కా దని నిశ్చయింపఁదగును.

సూరి 'ఎడుతవర్ణంబులు ద్రుతాంతంబు లగు ననఁగా వీరు 'ఎడుమ తన్' అని విధించిరి. ఇందు తన్ సూరి విధించినదే. కాని భేద మొందు. (సూరివలె) వీరు ద్రుతము 'ను'వర్ణముగాఁ జెప్పిరి. ద్రుతాంత మగుచో 'తను' అని యుండవలె. వీరు పొల్లను (తన్) జూపిరి. నువర్ణమును జూపిన నం దవపానద్రుతస్వరలోపముతో 'తన్' అనునది సాధ్యమ యగును. కాక 'తన్' అని పొల్లనే విధించినపుడు 'నీబుద్ధి ధర్మైకనిష్ఠ గావుతను' (అను.5.442) (ఉ.360) అని నుస్వరూప మెట్లు సిద్ధించినదో వివరింపకయె వీ రుదాహరించుట విశేషము. 'తను' అని విధింపవలె నను టుచితమె కదా.

సూరి 'ఎడును' విధింప వీ రది సరి కా దని 'ఎడుమ' విధించిరి. 'ఎడును' సరి కా దన్నమాట. (ఉ.370)

కలిగెడున్ మున్నరూపములు లాట్టుప్రథమపురుషైకవచనరూపములె యగుటచేతను లాదర్థములలో నాశీరర్థ మొకటి యగుటచేతను సూరి ప్రకృత సూత్రమం దుపదేశించిన 'ఎడున్' అనునది పునరుక్త మని శంకింపరాదు. నీకు బహుపుత్రులు కలిగెడున్ అనురీతివాక్యములందలికలిగెడున్ మున్న గునవి లాడ్రూపము లని సమర్థింపరాదు గదా. (వ్యా.సం.స.1393) అని వీరు సూరి 'ఎడును' విధానమును సముచితముగా గుర్తించియును నీకు

బహుపుత్రులు కలిగెడున్ అనురీతివాక్యములు నన్నయాధర్వణసమ్మత ములు గామింజేసియు నట్టిమహాకవిప్రయోగములు లేమింజేసియు నయ్యవి సాధువులు కానేరవు. అట్టియెడల నీకు బహుపుత్రులుకల్గెడువు అనియె ప్రయోగింప నగు నని డుమకాతావిత్యాద్యథర్వణవచనముచొప్పున గ్రహింపనగును' (వ్యా.సం.స.1394) అనిరి.

'ఎడును' లూట్టున రా దనుటకు వీరు చూపినవి రెండుకారణములు. అందు నన్నయాధర్వణసమ్మతము గా దన్న మొదటికారణము సరి యైనది కాదు. నన్నయాధర్వణులు సమ్మతింపలే దనుటకు వారు 'ఎడును' అవి యుండరా దని నిషేధించిరా? అది గ్రామ్య మని చెప్పిరా? 'ఎడును' విధింపలేదు. అంతియ కదా. నన్నయాధర్వణులు చెప్పనిలక్షణభాగమె లేదా. వీరు ఉ.లో॰ జెప్పిన దెల్ల నన్నయాధర్వణులు చెప్పినదె యగునా? 'అ'పతుబర్థకము గా దనిరే. అది నన్నయాధర్వణసమ్మతముగాదు గదా, విరుద్ధ మైనది.

ఇంక రెండవకారణ మట్టిమహాకవిప్రయోగములు లే వనునది. వి.వి.కారికావివరణమున నింతకు ముందు ఇష్టసంసిద్ధి యయ్యెడు, పుట్టువు కాకుండెడు బ్రాహ్మణకులమునంద యయ్యెడు కాచుచుండెడున్ అని 'ఎడును చూపియేయుండిరి. (వ్యా.సం.స.1389) దీనినిబట్టి డుమాదులలో 'ఎడును' ప్రత్యయ మున్నట్లు వీరివచనములచేతనే చెప్పవలదా? ఇపు డివి యెల్ల గ్రామ్యరూపము లందురా? 'డుమాదులకు' నుదాహరింప నవసర మేమి?

'పుత్రులు కలిగెడున్' వంటిప్రయోగములు లే వనుటయు నసంగ తము. 'ప్రసన్నులయ్యెడున్' అనునన్నయగారిప్రయోగమును ఓరును ద్రు.ప్ర.లలో॰ బ్రదర్శించిరి. అది తద్ధర్మక్రియ యని యట వారు వివ రించిరి. అట్లనుట యసంగత మని మనము గుర్తించితి మటనే. ఇం తేల

వీరే వ్యా.సం.స.1392పుటలోఁ బైని జెప్పినసమన్వయ మది లాద్రూప మనుట యసంగత మని నిరూపించుచున్నది. అధర్వణుఁడు చెప్పెను గదా యని 'ప్రసన్ను లయ్యెడుమ' యనియె నన్నయ ప్రయోగించియుండు ననియు సంస్కర్తలు ప్రక్షిప్తము చేసి రనియుఁ జెప్పుటకు నిట వీలు లేదు. అట్టియెడల గణభంగ మగును. ఇంక నది తిర్యక్కర్తృక మై బహువచనమున కేకవచన మైనలాద్రూప మనుటకును వీలు లేదు. 'ప్రసన్నులు' అనుచోను మహత్త్వము బాధకమె కదా.

ఇట్లే "ఆశీరర్థమునఁ దద్ధర్మక్రియామాత్రమె ప్రయుక్త మవుచున్నది. వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్" (ఆది.1.106) ఇట్లే 105, 107, 108 పద్యములలో సయితము ప్రయుక్త మయ్యె' (వ్యా.సం.స.1388) అనుట సరి కాదు. 'మహానుభావు లైరావత కోటిఫణిరాజులు మాకుఁ బ్రసన్ను లయ్యెడున్' (107పద్యము) అనునది లాద్రూప మగుట యెట్లు? పుత్రులు గలిగెదునువంటిది కాదా యిది. 'వాసుకి ప్రసన్నుఁ డయ్యెడున్' అనునేకత్వస్థలము నుద్ధరించుటలో వీరు మిగిలినవానియందలి భేదమును గమనింపలే దేమో. ఇవి లాద్రూపము లనుట వారివివరణమునకును విరుద్ధమే.

గు.ప్ర. ఇట 'పతిహీన లై నభామిను లతిధనవతు లయ్యుఁ గులజ లయ్యును ననలంకృత లయ్యెడు, మాంగల్యరహిత లయ్యెడుఁ గృపణవృత్తి నిదియు మొదలుగాన్' (ఆ.ది4228) అనువన్నయ పద్యమును శాపార్థమున కుదాహరించె. ఇట 'అయ్యెడు' లాద్రూప మనుట గుదురునా? అసలు లాద్రూప మిటఁ గుదురునా? 'క్వచిద్ధర్మక్రియామాత్ర' మ్మనువి.వి. లక్షణమునకు 'నాశీర్వాదార్థమందు' (వ్యా.సం.స.1387) అని వీ రర్థము చేసిరి. మఱి శాపార్థమునఁ దద్ధర్మక్రియాప్రయోగ మధర్వణసమ్మత మన వచ్చునా? 'ఆశీరర్థేతు సమ్మతాః' అని చెప్పినదుమాదులను వీరు శాపార్థమునను జెప్పుట విశేషమె. అట్లే యిటఁ గూడఁ దద్ధర్మక్రియ శాపార్థమున నైన దందురు

అనలంకృతలు మాంగల్యరహితలు- తిర్యగ్జడములు గావు. మహతీ వాచకములు. వీనిబహువచక్రియాపదము మహత్తునకువలెఁ గావలె. అట్టిచో లాడంత మగునీక్రియ ప్రథమపురుషయందు బహుత్వమున అయ్యెదరు' అనురీతిగా నుండవలె. ఇట బహువచనమున కేకవచన మగుట యెట్లు?

కాఁగా 'పుత్రులు కలిగెడున్' అనురీతిప్రయోగములు లేమింజేసి' యనుట సరి కాదు. ఈనన్నయప్రయోగ మట్టిదె. ఇట్టిమహాకవిప్రయోగ ములకలిమి 'నన్నయాథర్వణీయ'లక్షణగ్రంథములు చెప్పకున్నను 'ఎడును' లూట్టునకు విధింపక తప్పదు. అధర్వణుఁడు చెప్పె నని ఎడుమ నిల్పిన గణభంగము.

కాఁగా బహుత్వస్థలమునఁ గన్పించు 'ఎడున్' అనుదానివిబట్టియె వాసుకి ప్రసన్నుఁ డయ్యెడున్, అనంతుఁడు ప్రసన్నుఁ డయ్యెడున్ మున్నగురీతిగా నేకత్వస్థలములందలియెడున్నంతములును లాట్రూపములు మాత్రమె యని నిశ్చయింప నక్కఱ లేదు. లూట్రూపము లనియుఁ జెప్ప వచ్చును.

'నాగపతుల నెల్ల ని ట్లని స్తుతించి' (ఆది.1.103) అని ప్రారంభిం పఁబడుటనుబట్టి యాస్తోత్రమునందలియెడున్నంతములు ప్రార్థనార్థకములే యని వఝులవారు నంగీకరించిరి. కావున వీని నెట్లో యాశీరర్థకములుగా సమన్వయించుట సరి గా దని వారిపలుకులనుబట్టియె తెలియవచ్చును. కావ నీ రీసూత్రమునఁ బ్రార్థనార్థమును జేర్పకుండుట సరి కా దనుట స్పష్టము.

ఎడుమ :

ఎడుమ ప్రత్యయ మొకవేళ నంగీకరించినను, సూరి విధించిన ఎడుప్రత్యయము చెప్పవలసియే యున్న దని స్పష్టము. వఝులవారు 'ఎడును' విధింపకుంట యసంగత మనియు స్పష్టము.

'ఎడుమ' అన్నది గల దనుటకు నాధార మధర్వణవచనము. 'పుత్రులు కలిగెడుమ' అనియె యుండవలె ననుటకు 'చంద్రాదిత్యులు-- రక్షించెడు మెల్ల' నన్నద యాధారముగా (వ్యా.సం.స.1394) వఝులవారు తలఁచియుందురు. ఇక్లై 'సీతమ్మలందఱు లబ్ధజీవను లయ్యేడు మని (అర.7.459) కాని యిట స్వరపరకస్థితి గమనార్హము. సూరి 'ఎడును' ప్రత్యయము చెప్పి యచ్చు పర మయినపు డెడుతలద్రుతమునకు మకార మును విధించెను. (క్రి.28) దానిచే నీరూపమునందలిమకారము బాల.సిద్ధ మగుచున్నది. 'ఎడుమ' ప్రత్యయ మని చెప్పుటకు బల మైనయాధారము హలవసానపరకతయం దట్లున్న దానిని జూపవలెను. పైని 'అనలంకృత లయ్యేడు మాంగల్యరహిత లయ్యేడుఁ గృపణ- అనుచో హల్పరకత యందును ప్రసన్ను లయ్యేడున్ అనుచో నవసానమునందును 'మ'కారము లేదు. ఇంక ద్రుతాంత మగు'ఎడు' అనునదే ప్రత్యయ మనియు నిరూపించుచున్నవి.

'ప్రాచీనతాళపత్రగ్రంథములందును నాశీరాదులందు ఎడుమ కొన వచ్చుచున్నది. డుమకాతౌ కావుతాద్యాః అని యధర్వణుఁడును వచించెను. (ఉ.370) తాళపత్రప్రతులనుబట్టి 'ఎడుమ' ప్రత్యయ మందమా? "డుము అని కొన్నియెడలఁ దాళపత్రమాతృకలలోఁ గన్పట్టుచున్నది. (వ్యా.సం.స. 1387) ఉండెడుమ కప్పలు (హల్పరకతలో నిట ఎడుమ కలదు) (శాపము. అను.3.143)--కొన్నియెడలఁ గొన్నితాళపత్రమాతృకలలో ఉండెడుము కప్పలు అని యున్నది. ఇట్టివానిని బట్టి యీప్రత్యయము డుమ అనియో డుము అనియో నిర్ణయింపరాకున్నది' (వ్యా.సం.స.1380) అనియుఁ జెప్పిరి. మఱి 'డుమ' యని చెప్పు టెట్లు. వి.వి.కారిక ననుసరించి యనఁదగును.

'దీవన కెడుమయ్యుఁ గాతయుఁ గావుత-[ఆ'భూ.]అనుఅం.భా.అ. అభిప్రాయమును దిరస్కరించి వీరు 'అధర్వణకారికనుబట్టియు 'ఎడుమ'

అనుస్థితి సరి మైయున్నట్లు తోఁచదు. 'ఎడున్' అనుదానినిబట్టి ఎడుమ అనునదే నిజరూపము [స్వరూపము?] అనియుఁ దోఁచుచు న్నది' [వ్యా. సం.స.1389] యనిరి. 'ఎడున్' అనునదాశీరర్థకప్రత్యయముగా నంగీకరింప నిపీరు దానినిబట్టి 'ఎడుమ' యన్నదె ప్రత్యయ మనుట విచార్యము.

ఈపాఠము వీరిసిద్ధాంతమునకు విరుద్ధముగా నుండుటచేఁ గాఁబో లును 'దీవెన లగునెడఁ గాతయుఁ గావుతయుం దెనుఁగుకవులకబ్బంబులలో శ్రీవెలిగెడు నధిపుఁడు మేల్గావించుం గాత మేలు గావుత యవఁగన్' [ఆం.భూ.160] [వ్యా.సం.స.1389] అని చూపిరి. ఇందు 'అగును' అన్నది యధ్యాహార్యము గావచ్చును. వీరిపాఠమున 'ఎడు'ప్రత్యయము చెప్పఁబడలేదు. కాని యిందలి'శ్రీవెలిగెడును' అనునది ఎడు అనునాశీరర్థ ప్రత్యయ మైనందుల కుదాహరింపఁబడినది. నేఁ డిట దీవెన కగు నెడ గాతను గావుతనున్' --- శ్రీవెలిగెడు మధిపుఁడు- ఇత్యాదిగా నున్నది. ఇదియె లక్ష్యలక్షణములు సరిపడుచు నుచిత మనఁదగియున్నది.

భారతాదుల 'ఎడుమ' ప్రత్యయ మనవచ్చునా? నన్నయప్రయోగ ములలో నెచ్చటను 'ఎడుమ' కల దనుటకుఁ దగినయాధారము లేదు. 'పొందెడు మంచు, లగ్గయ్యెడు మని' రక్షించుచుండెడు మెల్లకార్యముల యందును, అయ్యెడు మరుగుండు (వ్యా.సం.స.1389) అనురీతిగా నచ్చర కత్వమునందలిమకారము క్రియ.28.చే సిద్ధము. వరుఖలవా రన్నట్లు 'పొం దుమ + అంచున్ అనురీతిగా విభాగించిన (వ్యా.సం.స.1395) నెల్లెడల సంధి నిత్యముగా నగుట విశేష మనక తప్పదు. నన్నయప్రయోగములలో హలవసానపరకతలో 'మ'కార మసలు గనఁబడకుండుటయు, నచ్చర కతలో నిత్యముగా సంధిలోనె కనఁబడుటయు వింత లనక తీఱదు. 'ఎడును' ప్రత్యయ మంగీకరింపకతప్పదు గావునను నచ్చరకతలో దాని ద్రుతమునకు సూరి మకారమును విధించెను గావునను నిట సూరిప్రణా

కలో లాఘవము సమగ్రతయు స్పష్టము. అచ్చరకతలోనియీమకారము నుద్దేశించియె యధర్వణుఁడు 'డుము' ప్రత్యయ మన్నచో దానికంటె సూరి విధాన ముచితము.

ఎఱ్ఱనాదులును 'ఎడుమ' ప్రయోగించినజాడ లేదు. తిక్కనప్రయోగములందు మాత్రము వీరు 'ఎడుమ' చూపిరి. ప్రసన్నుఁ డయ్యెడుమ నీకు (శాంతి.4.222) వైభవము నయ్యెడుమ నీకు (అను.2.187) పెక్కుతునియ లయ్యెడుమ యనవుడు (సా ప్తి.2.124)

అయ్యెడుమ నాకు ననుచో అయ్యెడును నాకు అని భారతసంశోధిత ముద్రణము చూపినది. దీనికిఁ బాఠాంతము 'అయ్యెడమ' అని యిచ్చె. అయ్యెడుమ యనుచో 'అయ్యెడుమ' [అయ్యెడము] అనియె పెక్కుప్రతుల నున్నట్లు ఫేర్కొనె.

ఇట్టి వివాదగ్రస్తస్థలములనుబట్టి 'ఎడుమ' ప్రత్యయ మని సాధారణముగా విధించుట యుచితమా? అది భాషాసామాన్యలక్షణమున కనుగుణమా? 'బుగ్గిగాను' అనురీతివానికంటెఁ గూడ మిక్కిలిక్వాచిత్కము లనఁదగినయిట్టిస్థలములను విశేషముగా గుర్తించుట యుచితము. ప్రచురమై కవిప్రయోగప్రసిద్ధమైన 'ఎడుమ' అనుదానిని సామాన్యముగాఁ జెప్పి యచ్చరకతలో మకారముతో నిట్టిప్రయోగములను సంగ్రహించినసూరి లక్షణము లక్ష్యానుగుణమై యథాతథముగా గ్రహింపఁదగియున్నది.

'డుమకాతావిత్యాదికారికను సరిగ గ్రహింపమింజేసి' [వ్యా.సం.స.1395] సూరి భిన్నముగాఁ జెప్పె ననువఝులవారియభిప్రాయము సరి కాదు. అర్థము కాకుండుట కాలక్షణమున గూఢత యేమి? ఉన్నను సూరి సరిగా గ్రహింపలే దనుట సాహసము కాదా? [డుజ్మ్రకారౌ' యని కవిజనమండన పాఠము] సరిగా గ్రహింపనివాఁడు ఎడును, తను అని విధించు టేమి? అచ్చరకత్వమున ద్రుతమునకు మకారమును జెప్పు టేమి? శ.ల.సం.లోను సూరి 'తవర్ణకం బాశీస్సులందు సర్వవచనంబుల కగు, ఎడువర్ణకం

బొండె, --(53,54) ఎడుతల(దుతం బచ్చురా మకారం బగు. ((క్రి.33) అనురీతి నిట్లు చెప్పె. ప్రయోగానుసారముగా భాషాలక్షణమును సముచితముగా గ్రహించియె సూరి యిట్టియేర్పాటు చేసె నని గుర్తింపఁదగును.

సూరి 'ఎడును' విధించుట యుక్తము. ఎడుమ లేదా ఎడుము అను రీతి నొక్కొక్కచో నుంట నయ్యది విశేషస్థలముగా నెన్నఁదగు. (చూ.కావుతమ.) డుమకావుతావాశిషి (వై.చం. అవ్య.9.) రక్షించెడు మమ్ము.

విధ్యర్థమున విశేషవిధి యారంభింపఁబోవుచున్నాఁడు గావున సూరి యిట నాశీశ్శాపసంప్రార్థనముల నుదాహరించెను. కావున 'లుట్టుడుక్షు' అని చెప్పినను నాశీశ్శాపసంప్రార్థనములు మూఁటనే యీకార్య మగును. వఝులవారు సంప్రార్థమును దొలఁగించి యాశీశ్శాపములు రెండే పేర్కొనిరి. అది సరి గా దని వారివచనములతోనె గుర్తించితిమి.

కాఁగా సూరిలక్షణము సూక్తము.

## విధి :

'విధియందు లుట్టునకు మాఱుగ నది యనుతచ్ఛబ్దంబును ముందునుగాగమంబు నగు (27) ననుసూరిసూత్రమును వీరు "లూణ్మధ్యమపురుషచో విధిప్రభృత్యర్థవిశేషములందు ద్రుతపూర్వక మగుఅదిశబ్దము నిల్చును." (ఉ.35సూ) అని పేర్కొనిరి.

"సూరిగారియుదాహరణస్వారస్యమునుబట్టి --ద్రుతపూర్వక మగు నదిశబ్దము ప్రథమమధ్యమపురుషములందు మాత్రమె వచ్చు ననియు--- విధ్యర్థమునందు మాత్రము వచ్చుననియు సూరి తలఁచినట్లు తోఁచుచున్నది. ---ద్రుతపూర్వక మగుఅదిశబ్దము విధ్యర్థమందే గాక ప్రార్థనాద్యర్థవిశేషములందును మధ్యమపురుషమందు మాత్రమె వచ్చుటయు మహాకవిప్రయోగములందుఁ గన్పట్టుచున్నవి' [వ్యా.సం స.1392]

సూరి 'విధియం' దని చెప్పఁగా వీరు విధిప్రభృత్యర్థవిశేషములం దనిరి. ఈయర్థ మనవసరమె యని తోఁచుచున్నది. 'ద్వారవతినుండియును నిట నారసియుంచునది దానవాంతక' (సభా.2.82) అనురీతిస్థలములలో విధ్యర్థ మనుట యుచితము గాదు. ప్రార్థనార్థము.

కాని యిద్దానికై వీరు 'ప్రభృత్యర్థవిశేషములం' దనుట యుచితముగాఁ దోఁపదు. "లూట్టు వురుల కనుటచే నిది లూడర్థ మనుట స్పష్టము. "ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు" ననుచో విధి చివరిదిగాఁ బేర్కొనఁబడినది. విధిప్రభృతు లనుచోఁ బ్రభృతిశబ్దముచే నేది గ్రహింపవలె. ఆశీశ్శాపార్థములం దీ'అది' కానరాకుండుటచే వీరు 'సంప్రార్థనవిధులం దని స్పష్టముగాఁ జెప్పఁదగును గదా.

వీరు 'అనుష్ఠించునది ఇత్యాదులలో నుపదేశ మర్థ మనియు, నన్నుఁ బ్రియమ్మున నిచ్చునది యనుచో సమ్మతి యనియు' మున్నుగా "ఇట్టి యర్థవిశేషము లింకను బెక్కు గలవు గావున నర్థవిశేషద్యోతక మవు నని యధర్వణుఁడు (అదిశబ్దప్రయోగస్స్యాద్విశేషార్థే నిరీక్షితే) వచించుట యెంతయు సమంజసముగా నున్న దనియు (వ్యా.సం.స.1391) వీరు పేర్కొనిరి. అనఁగా విధిప్రభృత్యర్థవిశేషములం దనుచో నుపదేశాదులు ప్రభృతిశబ్దముచే నుద్దేశించి రేమో. కాని వి.వి.మార్గము వేఱు. "తద్ధర్మప్రథమైకత్వవాచకాద్ధిక్రియాపదా" త్తని చెప్పుటచే నది యెట్టియర్థవిశేషములై నను దెల్పునవు నేమో. ఇవి ప్రత్యేకలకారమున నుపదేశింపలేదు.

కాని యిట వీరు "లూట్టువురులచో" అనుటవలన లూట్టున కాదేశమయినవురులనే గ్రహింపవలెను. ఉపదేశాద్యర్థములు సంగ్రహింపఁబడు నన్న ముం దవి లాయర్థములలో లూట్టు విధింపఁబడవలెనే. అది లేకుండ లూట్టున కాదేశ మయినవురులచో వచ్చుఅదిశబ్దమునకు విశేషార్థ మెట్లు వచ్చును?

అధర్వణుఁడు చెప్పినదే సమంజస మని తలఁచుచో వీ రిట లూట్టు

తెల్ల రట్లు నిత్యసంధినె ప్రయోగించి రని సమర్థించుటకంటె సూరిమార్గ ముచితము కాదా?

వఝలవారు పొరవడిరి గాని యాశీరర్థమున 'ఎడును' ప్రత్యయము ప్రత్యేకముగాఁ జెప్పవలసియె యున్నది. అట్టియెడల 'ఎడుమ' ప్రత్యయ మందలి 'మ' వర్ణమునకు హలవసానపరకతలో ద్రుతమును, (అచ్పర కతలో నిత్యసంధియు) జెప్పవలె. లేదా ఎడుమప్రత్యయముతోపాటు "ఎడును" అనునది వేఱుగా విధింపవలె. ఆరెంటికంటె సూరిమార్గము లాఘవముతో నుచితముగా లేదా? వఝలవారు "ఎడును" ప్రత్యయమును గుర్తించిన సూత్రవిధానమునందలియౌచిత్యమును గుర్తించెడివా రనవచ్చును.

## కావుతము :

ఒనరించుచుండుఁ గావుతమ యఖండితముగ (ఆది.8.63) ఒన రించుచుండుఁ గావుత నఖండితముగ- నని కవిప్రయుక్త మనఁదగును. కావుతాదులలోనిమకారస్థితి విశ్వసనీయము కాదు" (వ్యా.సం.స.1389) ఇట్లు వీరు నన్నయప్రయోగము నెడలను గవిప్రయుక్త మనుచు నిం కొక పాఠమును సృజించుటలో విశేషము లేకపోవచ్చును. ఇందుఁ దమసిద్ధాంత ముతో విరోధము గల్గి నిట్లు చేసిరనవచ్చు. అట్టివిరోధ మేమి?

అథర్వణుఁడు వీనిని వివరించుటలో "డుమ" అనుదానిని మాత్రమె మవర్ణఘటితముగఁ బేర్కొని తక్కినవాని నట్లు పేర్కొనకుండుటచే డుమేతరములందు మవర్ణస్థితి లే దని తోఁచుచున్నది. వీనిలో నెద్దాని యందును మకారస్థితిని నిర్వహింపఁజాలుప్రామాణికకవిప్రయోగము గానరా కాని ముద్రణములందే గాక తాళపత్రమాతృకలందును వీనిలో మకారస్థితి కన్పట్టుచున్నది. డుమలోనిమకారమునుబట్టి సామ్యముచేఁ దక్కినకావు తాదులందును స్వరసంధిలో మకారస్థితి యర్వాచీనులచేఁ బ్రక్షిప్త మగుచు

వచ్చె నని తోఁచుచున్నది. ఇష్టసిద్ధులఁ జేయు నెల్లప్పు డీశ్వరుఁడు మున్నగుచోటులందువలెనె చేసెడున్- చేసెదిన్ మున్నగువానియందును మకారాభావము న్యాయ్యము. ఇట్లగుటచేతనె గదా డుమ అని మకారఘటితము నధర్వణుఁడు విధింపవలసెను. కాఁబట్టి కావుతాదులద్రుతమునకును స్వర పరకతలో మకారాదేశము రానేర దనుట యుక్తము' (వ్యా.సం.స.1387) అని విస్తరించిరి.

డుమేతరములలో మకారస్థితిని నిర్వహింపఁజాలుప్రయోగమె లే దనుట సరి కాదు. ముద్రణములందే కాక తాళపత్రప్రతులందును మకారము గల దని వీరె చెప్పుచుండిరి కదా. పైఁగా 'స్వరసంధిలోమకారస్థితి'యనుట స్వరపరకత్వమున ద్రుతమునకు మకారము చెప్పినయీసూరివిధానము సమంజస మని వారివాక్యములె నిరూపించుచున్నవి. 'అయ్యెడుమ నీకు' ఇత్యాదిగా నెల్లెడలఁ గానవచ్చినను నట 'అయ్యెడును నీకు' అనియె కవి ప్రయుక్త మని చెప్పుచో 'ఎడుమ'ను నిర్వహింపఁజాలుప్రయోగము మాత్ర ముండును. (అయ్యెడుమ యనవుఁ డనుచో నర్థవిశేషము చెప్పుదుము.) తాళపత్రప్రతులందున్న దని 'డుమ' యంగీకరించినవీ రందె యున్న స్వర పరకతలోనిమకారము నంగీకరింపకపోవుట సక్రమమా? ఇట్లుండుటనుబట్టి యే సూరి ద్రుతమునకు మకారము విధించె నని గ్రహింపఁదగదా?

ఈమకార మర్వాచీనులచేఁ బ్రక్షిప్త మయిన దనుటయు విశ్వసింప రాకున్నది. తాళపత్రప్రతులందును నర్వాచీనులే ప్రక్షిప్తము చేసి రను టెట్లు?

'స్వరసంధియందే ప్రక్షిప్తము చేయు టేమి? హల్పరకతలో నేల చేయలేదు. గణభంగ మగు నని కాఁబోలును. అనఁగా మకారము పైస్వర ముతోఁ గూడియె యుండును గాని విడిగా 'మ' యని యుండ దన్నమాట. ఇదియు సూరిమకారవిధానమును సమర్థించుచున్నది.

డుమలోనిమకారము సామ్యముచే స్వరసంధియందుఁ బ్రక్షిప్తము

చేసి రనఁగా 'డుమ' యన్నది కూడ స్వరపరకతలోనె యున్న దని వీరు నంగీకరింతురా? (హల్పరకతలో అయ్యెడును నీకు ననురీతి ద్రుతసువర్ణము కవిప్రయుక్త మందు రని కాఁబోలును వీరు స్వరపరకస్థితిని బేర్కొనుట) హల్పరకత్వమునను 'డుమ' అని యుండఁగా 'త'వర్ణముపై స్వరసంధి యందు మాత్రమె మకారమును ('మ'వర్ణమును గాదు) ప్రక్షిప్తము చేయు టేమి? 'సామ్యము' స్వరపరకతలో మాత్రమె యనుసరించుటకుఁ గారణ మేమి?

ఇష్టసిద్ధులఁ జేయు నెప్పు డనుచో మకారము లేదు గావున చేసె డున్, చేసెడిన్ అనుచోట లేకుండుట న్యాయ్య మనిరి. ఈరెండింటికి సామ్య మేమి? చేసెడిన్ అనుచో మకారమును సూరియుఁ జెప్పలేదు. చేయు నెప్పు డనుచో చేయు నన్నది తద్ధర్మక్రియ. చేసెడిన్ అని చూపుటను బట్టి వీ రిటఁ బేర్కొన్న 'చేసెడున్' అనునదియుఁ దద్ధర్మక్రియయే తద్ధ ర్మక్రియలో ద్రుతమునకు మకారమును సూరియుఁ జెప్పలేదే. కావున నీతద్ధర్మక్రియలలో ద్రుతమునకు మకార మవుట న్యాయ్యమె కాదు. లక్షణ విరుద్ధమును. ఇట్లనుటనుబట్టి లూట్టులోని 'చేసెడును' అనుచో ద్రుతమునకు మకార మగుట న్యాయ్యమె. లక్షణానుగుణమును. కాఁగా లూట్టులో మకా రము లే దనుటకు వీరు లాద్రూపములను జూపుటయె న్యాయ్యము గా దని గుర్తింపఁదగును.

లూట్టులో (ఎడు)'త'ద్రుతమునకు మకారము కల్పించుచున్నను లే దనుట కథర్వణుఁడు డుమవలె 'తమ' అని చెప్పకుండుటయె కారణ మనవలె.

అథర్వణుఁడు చెప్పకున్నను 'తన్'ప్రత్యయమును వీ రిట విధింప లేదా? ప్రయోగములనుబట్టియే కదా. అట్లె యథర్వణుఁడు 'డుమ' అని మాత్రమె చెప్పినను 'తన్'వర్ణకమందును ద్రుతమున కచ్పరకత్వమున మకారమును ప్రయోగానుగుణముగాఁ జెప్పు టుచితమె కదా.

కాఁగా నిట మకారము లే దనుటకు వయులవారు చూపినకారణములు విరుద్ధార్థకము లై సూరివిధాన ముచితమ యని నిరూపించుచున్నవి.

'కనుఁగావుత మంచు (అను.3.34) కనుఁగావుత నంచు- అని ప్రయుక్త మనఁదగును. ఇచ్చుచుండుఁ గాత మివ్వసుమతి (హరి.పూ.1.124) ఇచ్చుచుండుఁ గాత నివ్వసుమతి అని కవి ప్రయుక్తపాఠ మనఁ దగును. పయిప్రయోగములం దెల్ల మకారఘటితపాఠమువలె తాళపత్ర మాతృకలందును గలవు' (వ్యా.సం.స.1390) అని గుర్తించినవీరు కవి ప్రయుక్తపాఠములనుచు నున్నవానిని దిద్ది వానిని సాధించుసూరిలక్షణము నిరాధారముగాఁ దిరస్కరించుట యనుచిత మనక తీఱదు. ఇట్లు ప్రయోగము లను దిద్దివేసిన వీరిగ్రంథమున మాత్రము 'కవిప్రయుక్తపాఠములలో' మకారము గానరాదు గాని మూలగ్రంథములందు మకారమె కలదు. కాన సూరి యట్లు విధించుటయె సమంజసము. వీరు దీనిని దొలఁగిఁచుట కవి ప్రయోగవిరుద్ధము గాన సంగీకరింపరాకున్నది.

ఇంతకును 'గావుతమ యఖండితముగ' నన్నది బాల సాధ్య మగుట యెట్లు? తిక్కన్నగారియొండురెండు 'డుమ' ప్రయోగములవంటి దగునా యిదియు.

కాని యిటఁ గూడ నచ్పరకతలోనె మకార మయ్యె నని తోఁచు చున్నది. "దానహోమజపవిధానముల్ మన కివి గలవ యేని ధరణివలయ రాజ్య మింద యుండి ధర్మనందనుఁడొనరించుఁ గావుతమ యఖండితముగ" అనుచోఁ బద్యమునఁ బూర్వస్థలముల ననుసరించి యిటఁ గూడఁ గావుతను అనుక్రియాపదముపై నవధారణార్థక మగు'అ'శబ్ద ముండఁగా కావు తను + అ అనుచో నచ్చు పర మయినది గావునఁ బ్రస్తుతసూత్రముచే ద్రుతమునకు మకార మై 'కావుతమ' యని యయ్యె ననవచ్చును. దీనికి సంధి రాదు గావున కావుతమ యఖండితముగ. 'ధరణీవలయరాజ్యమును

దప్పక యొనరించుచుండుఁ గావుత' మనురీతి నన్వయము సముచితము గనె కుదురుచున్నది.

పెక్కు దునియ లయ్యెడుమ యనవ్రుడు, అయ్యెడుమ నీకు నీత్యాది తిక్కనప్రయోగములును ని ట్లవధారణార్థక మగు 'అ' శబ్దముతో సమన్వ యించిన నుచిత మగు నేమో పరిశీలింపవలె. అపుడీవియు నిట లక్షణసాధ్య ములు గానివిశేషస్థలము లసవలసినయక్కఱ యుండదు. ఎదుము, ఎడమ యనురూపములును గొన్నియెడల నిటఁ బాఠాంతరములుగా నుంటయు విశేషమె.

## ఇందు:

లూణ్మధ్యమవురులకు ముడుఙ్ఞ లగు (26)ననుడాని నట్ల గ్రహిం చిరి. (ఉ.36సూ)

"ఇందలిమువర్ణకమునకు లోపము పాక్షికము. రక్షింపుము- రక్షింపు- ఇందము-ఇంద (-ఆదిగో పుచ్చికొమ్ము.) సూ.రా.నిఘంటువు దీని నవ్యయ మనెను. ఇందధాతురూప మనుట యుక్త మని తోఁచును' (ఉ.371) మధ్యమమువర్ణకమున కెల్లయెడల లోపము వికల్ప మని తలఁ చుటచే వీ రిట్లు పేర్కొనియుందురు. ('న ప్రాణే తు కదాచన' యనునధ ర్వణవచనమునకు విరుద్ధముగ నైనను వీరు స్వరపరకతలో ములోపము చెప్పుట విశేషమె.)

'ఇందు' ధాతు వనుట విచార్యము. 'ఇందు' అనుధాతువు గానరాదు. దీనికి వర్తమానాద్యర్థములందు రూపములును లేవు. శ.ర. ఇందుము. దే.స.క్రి.ని. అని చెప్పె. దానినిబట్టి వీరు విది ధాతునిష్పన్న మని తలఁచి యుందురు. శ.ర.క్రియ యని చెప్పియు నిపాత మనుట యితరరూపములు

లేకుండుటవలనన గావచ్చును. ఇట దీనిబహువచనాంతరూపమును శర. ఇందండి మొ॥ అని చెప్పెఁ గాని ప్రయోగము నీలేదు. మొద లగున వేవో యస్పష్టము. 'ఇందము' మధ్యమపురుషైకవచన మన్నను నిందే ఇందఁడు ఇందండు అనుబహువచనాంతరూపములు లేవు. అందుకె సూ.ని. ఇది యవ్యయ మని యుండు. 'శార్ఙ మింద. అనుచో ములోపమునుబట్టి యిది లూణ్మధ్యమైకవచన (వ్యా.సం.స.1399) మనుట పొసఁగునా? స్త్రీసమక్లీబ సమములుగా నెంచుచో ఇంద, ఇందము అని రెండురూపములు నవును. ఎట్లయినను నిట ధాతువు 'ఇంద' అని చెప్పుటకుఁ దగినయాధారము లేమి దీనిని ధాతునిష్పన్నముగాఁ జెప్పుట విశ్వసింపరాకున్నది. ('కొమ్ము రూపాంతర మైన 'కో'తోఁ గూడి 'అదిగో' నిర్దేశవాచక(అవ్యయ)ముగా వీరును జెప్పిరి.(ఉ.180)

## వండువపుం :

"ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు" (30)నను సూరిసూత్రమును వీరు "ఉభయప్రార్థనంబున లూట్టునకు దుగాగమంబును దానియుత్వంబున కత్వంబు నగు" (ఉ 37సూ) నని సవరించిరి.

"సూరి -- ప్రార్థనార్థమున దుక్కును విధింపలేదు. ప్రార్థనార్థము లూట్టె కాని లాట్టు గాదు గదా" (ఉ.371)అందు కని వీ రిట దుగాగమ మును బ్రత్యేకముగా విధించి రన్నమాట. "సూరి లాదర్థములలోఁ బ్రార్థ నార్థమును వేర్కొనియుండలేదు" (వ్యా.సం.స.1406)కాని "యాశీరాదులు" అనుచోటియాదిపదముచేఁ దద్ధర్మాదులలోఁ బ్రార్థనార్థమును సంగ్రహింప రాదా? సూరి లాట్సూత్రము నట్ల గ్రహించి వీరును దద్ధర్మాదులలోఁ బ్రార్థనమును వేర్కొనలేదు. కాని "వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్" అనురీతివి లాట్టుయొక్క ప్రథమపురుషైకవచనరూపము లని యెఱుంగనగు (ఉ.370) ననిరి. మఱి ప్రార్థనార్థమున లాట్టు గాక పోవు టేమి? ఆశీరాదు లన్నప్పటియాదిశబ్దముచేతనె వీరును బ్రార్థనమును గ్రహింపవలెఁ గదా.

మూల మయినసూరిలక్షణమున మాత్ర మ ట్లేల గ్రహింపరాదు.

అది య ట్లుండఁగా సం.లో వీరు "సంస్కృతవ్యాకరణవ్యాఖ్యల పద్ధతి ననుసరించి ప్రార్థనమున దుక్కున కత్వము విధించినసామర్థ్యముచే "అత ఏవ దుక్" అనురీతి నుభయప్రార్థనమున దుక్కును ఘటించుకొన వలయును (వ్యా.సం.స.1405) అని ప్రస్తుతసూత్రముచేతనె దుక్కును సాధించిరి. ఇట్టిపద్ధతి తెలుగువ్యాకరణవ్యాఖ్యలయందును గలదు."కేషాఞ్చిదుదన్తానాం నేతివిభక్తావునోలుక్ స్యా" త్తనుచిం.సూత్రవ్యాఖ్యయం దహో. "ఉకారాన్తాత్ నవర్ణకవిధానమిత్యత్ర ఇదమేవసూత్రం జ్ఞాపకమ్" (కవిశి.483) అనెను. "కేషాఞ్చిదుదన్తానామ్- అనుజ్ఞాపకసూత్రముచొప్పునఁ గొన్నియుదంతములపైని మాత్రమె నప్రత్యయము నిల్చును. (వ్యా.సం.స. 507,) ఉదంతజడవాచకములకు నన్ అనుప్తమీవిభక్తివచ్చు ననుటకును నీసూత్రమె జ్ఞాపక మగుచున్నది' (వ్యా.సం.స.927) అని వీరును నట్లే వ్యాఖ్యానించిరి. నన్నయకు సమ్మత మైయున్నయిట్టిపద్ధతిని బాల.లో సమ న్వయించుటకు బాధ యేమి?

సూరిలక్షణమున దురుక్తి లే దని ముందు గుర్తింపవలెను. ఇ ట్లేల యని వీరు స్పష్టముగాఁ జెప్పఁబూని రందును దోషము లేదు. కాని వీరిలక్ష ణము దోషగ్రస్త మయియున్నది.

వీరు దమసూత్రమున 'లూట్టునకు దుగాగమంబును' అని దుగాగమ మును లూట్టునకే విధించిరి. ధాతువున కనునధికారసూత్ర మున్నను నీసూత్ర మునఁ బ్రత్యేకముగా 'లూట్టునకు' అని నిర్దేశించుటచే ధాతువునకుఁ బర మైనలూట్టునకె దుగాగమ మగును. దు(క్) కిత్తు గావున లూట్టున కంత్యా వయవముగా నయి వండు + ల్ + దు- వండుముదు- వండుముద- యను రీతిని గావలె. ఇది యసంగతము గదా. 'లూట్టునకు' అనుట యనర్థకము. లూట్టు పరం బగు నపు డన్నఁ గొంత మేలు.

ఇంక వీ రిటఁ జెప్పినదానినిబట్టి ప్రార్థనార్థమున లూట్టుమాత్రమె

యగును. కావున 'ఉభయప్రార్థనమున' ననుటచేతనే లూట్టని స్పష్ట మగును గావున సూత్రమున దానిని మఱలఁ బ్రస్తావింప నక్కఱయె లేదు. ఉభయప్రార్థనంబున దుగాగమంబును- అనుతీరుగా మాత్రమె చెప్పినఁ జాలును. సూరి లూట్టులో దుగాగమము చెప్పకుండఁగాఁ దాము చెప్పుచున్న ట్లు చెప్పుటకై వీరు సూత్రముననె 'లూట్టునకు' నని చేర్చుటచే నీయనర్థము వాటిల్లిన దని గుర్తింపవచ్చును.

ఇట్లె వీరు సూరిసూత్రముకంటె విశేషముగా 'దానియుత్వంబున కత్వంబు నగు' ననుచో 'నుత్వంబున' కనుదళమునైతము స్పష్టతకు మాత్రమె. అత్వ మేకాల్లు గావున నంత్యవర్ణమునకె కదా యవును.'ఉభయ ప్రార్థనంబున దుగాగమంబును దాని కత్వంబు నగు' నని మాత్రమె సూత్రిం చిన నుద్దిష్టాలుర్థము సముచితముగ సిద్ధించెడిది.

'అత్వంబు నగు' అనుచోటినుశబ్దము పూర్వోక్త మగుదుగాగమము తోడిసముచ్చయమునకై వీరు ప్రయోగించిరి. కావున సూరిమతమునవలె వీరిమతమునను దుగాగమమున కత్వము నిత్యమె. "ఉభయకర్తృకప్రార్థన స్థలములం దెల్ల అత్వము కలుగుచుండును. (వ్యా.సం.స.1400) అట్టియెడ వీరు దుగాగమ మని యుత్వముతోఁ జెప్పి దానికి నిత్యముగా నత్వము చెప్ప నేల? ఆగమము నెట్లును బ్రత్యేకముగా విధించుచుండిరి గావున నత్వ ముతోనె విధించిన నుత్వమున కత్వము చేయుగౌరవము తప్పెడిది గదా. (ఉభయప్రార్థనంబున దగాగమం బగు' నని మాత్రమె సూత్రించినఁ జాలదా?)

ఉభయప్రార్థమునందు మాత్రమె వీరు దుగాగమమును విధించుటచే నితరము లగులాడర్థములలోను, నితరపురుషవచనములందును, దుగాగమ ము ప్రవర్తిల్లుటకే యవకాశము లేదు. కావున నితరత్ర యత్వము లేక పోవుటతో దుగాగమవిధానము ప్రయోజనవంత మగు నని తలఁప నవకాశ మును లేదు.

వి.వి.లోఁ దద్ధర్మార్థకరూపమునందే ప్రార్థనమున 'నుభయార్థే భవే దత్వ' మ్మని యత్వము చెప్పె. లాదర్థములందుఁ బ్రార్థనమును జెప్పియు నిట వీరు సూరి ననుసరించి యది లాడ్రూపముగనె సాధించిరి.

సూరిమత మేమి? తద్ధర్మాదులలోఁ బ్రార్థనమును సూరియు సమ్మతించిన నాతఁడును దీనిని లాడ్రూపముగా సాధించుట యనవసరమే యగును. లాడంతరూపములు సాధించుసందర్భమున లట్యంతములకుఁ బూర్వము, నంతకు ముందు చెప్పినలకారములయొక్క క్రమములోను దీనిని సాధించుటనుబట్టి 'వండుద' మన్నది లాడంతముగనె సూరి యుద్దేశించె ననక తప్పదు. (ఉభయార్థము విశేష మైన లట్యంతములకును బిదప నిది చెప్పవలె.) తద్ధర్మాదులలోఁ బ్రార్థనమును సూరి యుద్దేశింపలే దనవలె. అందుఁ బరిగణింపకుండుటయె కాక లాదర్థముల నుదాహరించు సందర్భముననను బ్రార్థనమును జూపలేదు. ఇంక వధులవారు 'ప్రార్థనార్థకముగులాడ్రూపముగాఁ జూపిన 'ప్రసన్నుఁడయ్యెడున్' అను నదియు సూరి 'ఎదు' ప్రత్యయముగాఁ జెప్పి లాడంతముగనె సాధించెను. కావున నివి లాడ్రూపము లనువధులవారియభిప్రాయము సూరికి సమ్మతము గా దని నిశ్చయింపనగును. అది యుచితము.

ప్రార్థనార్థమున దుగాగమముతోడిరూపములును గానరావు. 'మనకు వండవలసియున్న దని తెలిసియున్నచో మన మపుడే వండుదుము' (వ్యా.సం.స.1400) వండుదుము వండియుండెదివార మనురీతిగా నిది సంభావనార్థముతో లాడ్రూపమె. ఇట్టియెడలఁ బ్రార్థనము గోచరింపదు. 'రక్షింపుము' అనురీతియర్థములో రక్షింతు వనురీతిదుగాగమముతోడిరూపములు లే వనుట స్పష్టమె. ఇట్లె యితరపురుషలయందును.

అం.శ.శా.లో సూరి 'ధర్మంబునందు దిదుతల్లోపంబు లగు.

ఎత్వంబు దీదులు రా నగు. దువర్ణంబు రా నొండె. అవ్వర్ణకంబుమీఁది దానియుత్వంబున కత్వంబు నిత్యంబుగ నగు (ఎద) ఉభయార్థంబునందు -- వులోపంబునం గలుగదు (4-9) ఎత్వముపై దువర్ణమున కత్వము నిత్యముగాఁ జెప్పెను గావున నుభయార్థమునం దెత్వము రాకున్నను దువర్ణమున కత్వ మగు నని (వందుదము) సూరియభిప్రాయము. ఈలక్షణక్రమములో నుభయప్రార్థనము తద్ధర్మాదులలోనిదిగాఁ జెప్పవలె. కాని రక్షించెదవు- రక్షించెదు అనురీతిని ప్రార్థనార్థమున లేకుండుటంబట్టి సూరి యీమార్గమును బాల.లో విడిచిపుచ్చె ననఁదగును. వీనిని బాల.లో మార్గాంతరమున సాధించుటయు స్పష్టమె.

కావున సూరిమతమున లాదర్థములయందుఁ బ్రార్థనము లేదు· ప్రసన్నుఁ డయ్యెడున్ అనుతీరుగాఁ బ్రార్థనార్థ మిటఁ గల దనువరుల వారియభిప్రాయము సరి గామియుఁ బైని స్పష్టమె. కాఁగా సూరిమత ముచితము.

కాఁగా మనము వందుద మన్నది లాడ్రూపమె. ల్యాట్టులో సూరి దుగాగమము చెప్పలేదు. అం దత్వవిధానసామర్థ్యముచే నీసూత్రముచేతనె యిటనె దుగాగమ మగు ననవలె. ఇట్టియెడలఁ బైని వరులవారిలక్షణ మునఁ గన్పించిన యనౌచిత్య మొండు సూరిలక్షణమునను గల్గుచున్నది. దుగాగమమున కత్వము నిత్యమె యవుచో దగాగమ మని చెప్పక దుక్కును జ్ఞాపకసిద్ధము చేయుచు నత్వము విధింప నేల? చిం.లో నవర్ణకము జ్ఞాపకము చేసినస్థలమున ఊరున, పేరున అనురీతి నవర్ణకాంతరూపములస్థితిని సాధించుచు నది ప్రయోజనవంత మగుచున్నది. ఇట 'దు' నిల్చియున్నస్థలము లేవి?

'దు' నిల్వకున్నను స్థలాంతరమున లాఘవరూప మైనప్రయోజనమును సాధించుటకయి సూరి దుగాగమముగాఁ జెప్పుట యొప్పుచున్నది.

చువర్ణంబుతోడ డుగ్గకారంబు తకారం బగు, ఆగమచకారంబునకు నెఱుసున్నమీఁదిదానికి దుక్కు పరం బగునపుడు, పోవునకు దుజ్మాత్తులు-

అనురీతిగా నాయావిధానములందు దుక్కు పేర్కొనఁబడినది. అటఁ జెప్పిన కార్యము లీయుభయప్రార్థనస్థలమునను నగుట గమనింపవచ్చును. (పరిగ్రహించుదము) పరిగ్రహింతము. ఆకర్ణింపుదము, పోదము మొ॥

అత్వవిధానము గౌరవ మని దగాగమమునే విధించినచో నీస్థలము లందు దుక్కుతోపాటు దక్కును గూడఁ బ్రత్యేకముగాఁ బేర్కొనవలసి యుండును. ఇట్టియవసర మనేకస్థలములఁ గల్గుటనుబట్టి యట నెల్ల గౌర వమును దగ్గించుటకుఁగా నిటనే దుగాగమ మని యత్వము చెప్పుట లాఘవ మును సంపాదించుచున్నది. ఇంక దుక్ స్థలమున నగుకార్యము లెల్ల నిట నగుటనుబట్టియు దుక్కుకంటె భిన్నముగా (దక్ అని) చెప్పుటకంటె దుగాగమముగాఁ జెప్పుటయు నుచిత మగుచున్నది.

ఇంక నిట సూరి దుక్కును ప్రధానముగా విధింపక జ్ఞాపితము చేయుటయు గమనార్హ మైయున్నది. కావున నిత్యముగనె యైనను దుగాగ మమున కత్వము చెప్పుసూరివిధి యుక్తమె.

ఇట్టిప్రయోజనము వరుులవారిమతమున మాత్ర మేల గుర్తింపరాదు? కాని యట వీరు సూరివిధానములకంటె భిన్నముగాఁ జెప్పుకొనుటచే నీ ప్రయోజనము వీరిమతమున నెన్నరాకున్నది.

బాల. క్రియా. 90, 108 సూత్రస్థలముల నొకచో సంగ్రహించుచు వీరు "తద్ధర్మాద్యర్థకము నుభయప్రార్థనాద్యర్థకము నగుదుక్కుతోఁగూడ- (ఉ. 94సూ) అని యుభయప్రార్థనార్థకదుక్కును వేఱుగాఁ బరిగణించిరి. వేఱు గాఁ జెప్పునప్పుడు దుక్కు యన నేల? దక్కన్న నందుఁ గ్రొత్తగా నేర్పడు గౌరవ మేమి?

'పోవునకు దుఙ్మత్తులు' (ఉ. 102సూ) అనుచో మాత్ర ముభయ ప్రార్థనార్థమును వేఱుగాఁ బ్రస్తావింపలేదు. అయ్యు పోవుదము-పోదము అనియుఁ జూపిరి. ఈయొక్కదానికై యుభయప్రార్థనమున దుగాగమ మని చెప్పవలెనా?

ఏ మైనను వీరి క్రియా. 102. సూత్రవివరణములనుబట్టి దుక్కు- అనుదానిచే నుభయప్రార్థనమందలిదుక్కును గ్రహింపఁబడుట వీరు నుద్దేశించిరనవచ్చును. కాన సూరి సాధించినప్రయోజనము వీరిలక్షణముననుగలదు గాన దగాగమ మనకుండ దుగాగమ మను టుచితమే యనుచు నాపక్షమున ఉ. క్రియా. 94సూత్రమున నుభయప్రార్థనాద్యర్థక మగుదుక్కును వేఱుగాఁ బ్రస్తావించుటయే యనుచిత మని నిర్ణయింపఁదగును.

అయ్యు దుగాగమము సూరి జ్ఞాపితము చేయఁగా వీరు ప్రత్యేకముగా విధించుట స్పష్టతకే యనవలెను. 'దు' నిలువకుండుటనుబట్టి సూరి దానిని బ్రత్యేకముగా విధించుటకంటె శాస్త్రీయ మగుప్రయోజనమునకై జ్ఞాపితము చేసె ననఁదగు నది యుచితము గదా.

పరిగ్రహింతము. నిశ్చయము గాని ప్రార్థనము లేదు. చూతము యంచు. మానసోద్దిష్టప్రేరణము మాత్రము (వ్యా.సం.స. 1401) ఇట్టి స్థలముల నెల్లఁ బ్రార్థన మంతగాఁ గన్పట్టదు. అస్మచ్ఛబ్దవాచ్యుఁడు యుష్మచ్ఛబ్దవాచ్యుని బ్రేరించుట మాత్రమె తఱచుగాఁ దోఁచుచుండును' (వ్యా.సం. స. 1400) అని వీ రింతకుముందు పేర్కొనిరి. దీనింబట్టి సూరి 'ఉభయప్రార్థన మనుట సరి గా దేమో యనునభిప్రాయము గల్గుచున్నను, వీరు నిట (దీనిని ఖాట్టుగాఁ బేర్కొనుటనుబట్టియు) నుభయప్రార్థనంబున నని సూరివలెనె తమసూత్రమునఁ జెప్పుటనుబట్టియుఁ బూర్వపుఁదమయభిప్రాయమును విడిచిపుచ్చుకొని రనఁదగు.

కాఁగా సూరిసూత్రమ సూక్తము.

**మున్ఙ్ :**

బాల. క్రియా. 31, 32సూత్రము లట్ల గ్రహించిరి. (ఉ. 38, 39సూ.)

'ము-డుఙ్ అనెడిప్రార్థనాద్యర్థకమధ్యమపురుషప్రత్యయములప్రత్యాహారమె ముఙ్ అనునది యని చెప్పినఁజాలును. అట్లయినను సూరి

యట్టివిషయమునె బా.క్రి.31సూత్రమున మధ్యమముదుజ్జులు ముజ్జు నాఁబడు అని స్పష్టార్థముగా రచించెను' (వ్యా.సం.స.1533)

అసూరిసూత్రము నట్లు గ్రహించి యిటఁ జెప్పినవీరియభిప్రాయము పైనట్లు స్పష్టతయె కాని సూరి యట్లు స్పష్టతకయియే చెప్పెనా యని సందేహము. లకారంబునకు డుబ్రువురునుముఞ్ - అనుచో 'ఞకారంబు ప్రత్యాహారార్థంబు' అని సూరి స్పష్టము చేసెను. ఇచట డుఞ్ లో ఞకార మిద్వర్ణమె. 'ఞిత్తు బిందుపూర్వం బగు' నని ముందుబిందువు చేరుట ప్రయోజనముగా నుద్దేశింపఁబడిన దనుట స్పష్టము. అయ్యు ముపర్ణముతో దీనింగూర్చి ప్రత్యాహారము చేయుటలో నడ్డంకి లేకపోవచ్చును. కాని యిట్లు చేయుతలఁపు సూరి కున్నట్లు తోఁపకున్నది. సూరి ప్రత్యేకముగాఁ జేర్కొన్నచోఁ దప్పఁ బ్రత్యాహార మితరత్ర చేయుట గానరాదు.

## అదాదులు

'సంప్రార్థనంబున ముజ్జున కదాదులు విభాష ననుప్రయుక్తంబు లగు' (33) సనుసూరిలక్షణమును వీరు"సంప్రార్థనంబున ముజ్జునకు అఆ ఇఈఅయ్యఅన్న మున్నగునవి విభాష ననుప్రయుక్తము లగు'(ఉ.40) నని చెప్పిరి. సూరి 'అదాదు' లన్నదానిని వీరుసూత్రముననె వివరించి చెప్పుటయె యిందలిమార్పు.

అదాదులలో సూరి పేర్కొన్న ఎ,ఏ,ఒ,ఓలను వీరు తొలగించిరి. దానింగూర్చి పై సూత్రమున గమనింతము. వీనిని బరిహరించినమాత్రమున నదాదు లనుటలో దోసఁగు లేదు. అదాదు లేవియో యవి యన్ని నిర్దేశింప లేదు. 'మున్నగునవి' యని సూత్రమున నిల్పిరే కదా. అన్నింటిని నిర్దే శించునప్పటికిని వాని నెల్ల సూత్రముననే పఠించుట గౌరవమాత్రమునకె. అదాదు లని చెప్పి యవి యేవో వివరణమునఁ దెల్పుట యుక్తము గదా.

ఏమ్యాదులకు నిత్యాదులలో నవి కొన్నిసూత్రమునఁ బఠించిరా?

సూత్రమును వీరు వ్యాఖ్యానప్రాయముగాఁ జెప్పి రనఁదగు. సూరి సూత్రము సూక్తము.

'అదాదులలోని ఇ శబ్దమును నిర్వహించుప్రబలప్రయోగము కానరాదు'. దీనికిఁ గారణము 'నన్నయ సంప్రార్థనార్థకాదీ' త్తని వచించుట చేత ఇశబ్ద మిట నన్నయ్యకు సమ్మతము కా దని తోఁచుచున్నది' (వ్యా.సం.స.1416) అయిన సూరి అదాదులలో 'ఇ'వర్ణమును బఠింపరా దని పీ రుద్దేశించి రేమో. కాని ఉ.లోవీరు ఇవర్ణమును గూడ నీసూత్రమునఁ బఠించిరి. (అయ్యు దీనికిఁ బ్రయోగము చూపలేదు.) 'సంప్రార్థనార్థకాదీత్' అనుచో 'ఈత్' అనెఁ గాన 'ఇ'వర్ణము గ్రహింపఁబడ దని యెంచినవీరు 'ఉదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః' అనుచో 'అత్' అన్నను 'అ'వర్ణమునుచిం. లోనె గ్రహించిరి.'అచ్చతుష్కం భవేత్' అనునథర్వణలక్షణవివరణమున' హ్రస్వదీర్ఘము లగుఇఈలు గ్రహించి చెప్పుమి. చెప్పుమీ' (వాం.సం.స. 1410) అని యుదాహరించిరి. సూరి అదాదులలో 'ఇ' పేర్కొనుట సముచితమె. (నన్నయాథర్వణసమ్మతము ననవలె.)

## వినవె-వినరె:

'ఎదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముజ్ఞునకు వుజీ రుజీ యగు' (34) ననుసూరిలక్షణమును వీరు దమగ్రంథమునఁ దొలఁగించిరి. ఈలక్షణముచే సిద్ధించురూపములను సాధించుటకై వయ్యలవారు మార్గాంతరమున వే తొకరెండుసూత్రములు చెప్పిరి.

'వ్యతిరేకార్థకక్రియలమీఁద ఎఎటఓఆయ్యఅన్నఅమ్మమున్నదునవి నిల్చుటచే నది ప్రార్థనాద్యర్థకములగును.(బాల.లోలేదు.) (ఉ.41.సూ) ఇట్టి లక్షణము బాల.లో లేకుండు టుచితము. ఇట్టిరూపములు బాల.34సూ. సాధించుచున్నది గదా. ఆసూరిసూత్రములు ఉ.లో లేకుండుటయు, బాల.లో లేనియీసూత్ర మిట నుండుటయు సరి గాదు.

ఎవి మొదలుగాఁ గొన్నింటిని నిర్దేశించినను వీరు సూత్రమున మున్నగునవి' యనక తప్ప లేదు. అట్టి వీనియన్నింటిని సూత్రమున కెక్కించుట యేల? అన్నింటిని నిర్దేశించినను నివి పెక్కు లయినపుడు సూత్రమునఁ జేర్కొనుట గౌరవమునకె. సూరి చెప్పినట్లు 'ఎదాదులు' అని సూత్రమున నుంచి యవి వివరణమునఁ దెల్పుట లాఘవముతో నుచిత మైయుండును.

ఎవి- మున్నగునవి నిల్చుటచే ననుటచే నవి చేరుట పూర్వసిద్ధముగాఁ జెప్పవలె. వ్యతిరేకక్రియలపై వీనినిలుకడ యిచటను వీరు విధింపలేదు. ఇంక విధానసామర్థ్యముచే నీసూత్రముచేతనె నిల్చు ననవలె. బాల.క్రియా. 30.సూత్రమునెడల వీరివిధానము స్మరింపఁదగును. దాని నట్లు మార్చిన వీ రిట నిట్లు చెప్పుట విరుద్ధము గదా? 'ఎ-ప్రభృతులు నిల్చుటచేఁ బ్రార్థ నాద్యర్థవిశేషములు గల్గు ననుటకంటెఁ బ్రార్థనాద్యర్థవిశేషములందు ఎ-ప్రభృతులు చేరు నని చెప్పుట శాస్త్రమార్గమున కనుగుణ మైయుండును.

'వ్యతిరేకక్రియలమీఁద' నని సామాన్యముగాఁ జెప్పుటచే వ్యతి రేకక్రియ లెల్ల నెదాదియోగమునఁ బ్రార్థనాద్యర్థకములు గావలె. వీ రిట నెల్ల యెడల వ్యతిరేకార్థకమధ్యమపురుషక్రియలనే చూపిరి. ప్రార్థనార్థము మధ్యమపురుషయందే సంభవము గావునఁ బ్రత్యేకముగా మధ్యమపురుష క్రియలమీఁద' నని చెప్ప నవసరము లే దనుకొనిరా? అయిన ఉ.35సూత్ర మున 'లూణ్మధ్యమపురులచో' నని యేల చెప్పిరి.

వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్, ఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్నులయ్యెడున్ అనుచోఁ బ్రార్థనార్థకక్రియ ప్రథమపురుషయం దుండుట గుర్తించితిమి. కాఁగా (వారు) ప్రసన్ను లయ్యెడున్ అనునర్థమున ప్రస న్నులు కారే ఇక్లే రాదే,పంపఁడటయ్య ఇత్యాదిగాఁ బ్రథమపురుషయందును బ్రార్థనార్థకరూప మేర్పడు నని చెప్పవలె.

కావున 'వ్యతిరేకక్రియలపై' నని సామాన్యముగాఁ గాక 'వ్యతిరేక

మధ్యమక్రియలపై' నని వీరు చెప్పుకొనవలసియున్నది. సూరి శ.ల.సం. లో 'వ్యతిరేకమధ్యమంబుమీఁద నెదాదు లగు సంప్రార్థనపరంబు లగు' (92)ననెను.

'ప్రార్థనాద్యర్థక' అనుచో నాదిశబ్దముచే వీరు ప్రశ్నాద్యర్థము లుద్దేశించిరి. (వ్యా.సం.స.1410)

"సూరి --- ప్రార్థనాద్యర్థకముజ్ఞనకు ఎదాదు లనుప్రయుక్త మగునపుడు -- (ఉ.373) అని వఝలవారు పేర్కొనుట సరి కాదు. సూరి అదాదులు (ఎదాదు లిందలివే) సంప్రార్థనమున ననుప్రయుక్తము చేసెను. కాని 'ఆది'శబ్దమును సూరి ప్రయోగింపలేదు. (ఉ.40.సూ) కావునఁ బ్రార్థనాద్యర్థక మని సూరియాశయముగాఁ జెప్ప(వ్యా.సం.స.1416)రాదు. చిం.ఆశయము గ్రంథాంతరమునఁ జూతము.

ఇఁక వీరు విశేషముగాఁ జెప్పినఆదిశబ్దముచే గ్రహింపఁబడువ్యతిరేకవ్యంజకప్రశ్నాద్యర్థములుమాత్రముప్రార్థనార్థకములవలె మధ్యమక్రియలపైనె యగు నని చెప్పుటకు వీలు లేదు. నృపులు లేరో -లేరా- ఉన్నారు. వేట రారో- రాలేదా? వచ్చిరి. మేము కామో- కామా? అవుదుము. ఇట్లిది వ్యతిరేకక్రియ లన్నింటిపైఁ గలుగును.

కాఁగా మధ్యమక్రియలపై మాత్రమె గలప్రార్థనార్థమును నెల్లెడలఁ గలవ్యతిరేకవ్యంజకప్రశ్నార్థమును గలిపి 'ప్రార్థనాద్యర్థకము'గాఁ గూర్చుటెట్లు పొసఁగును? చిత్తశాంతి యొనర్పవే- నన్నుఁజూచి నగరె. వ్యా.సం.స.1415.

కాఁగా నిట వీ రాదిశబ్దమును జేర్చుట సరి గా దని నిశ్చయింపఁదగును. అట్లు చెప్పనిసూరిలక్షణము సమంజసము.

వ్యతిరేకవ్యంజకప్రశ్నార్థము వ్యతిరేకక్రియలయెడనే కాక, చెల్లునయ్యా, యనుతీరుగా తద్ధర్మభూతక్రియలయెడఁ గూడఁ గలదు. కావున (ప్రౌ.క్రి.2,4.5)వీరు వ్యతిరేకక్రియలయెడ మాత్రమె చెప్పుటయు సరికాదు.

'వ్యతిరేకక్రియలు- ప్రార్థనాద్యర్థకము లగును' అనువీరిలక్షణముచే వీనిపైని నిల్చినఏదాదు లనుప్రయుక్తము లనియె వీరును దలఁచి రనవచ్చు. కాఁగా నీయంశమున సూరితో విభేదము లేదు.

ముఖ్య మైనమార్పు సూరి ప్రార్థనార్థకక్రియపై నెదాదులను జేర్ప వీరు వ్యతిరేకక్రియ ప్రార్థనాద్యర్థక మగు ననుట. వ్యతిరేకక్రియ ప్రార్థనాద్యర్థక మగు నన వ్యతిరేకార్థవిశిష్ట మగుప్రార్థనార్థక మగు ననుసందేహమున కవకాశము గల్గుచున్నది.' నన్నుఁ బంపవే' యనుచోఁ 'బంపవు'అను వ్యతిరేకక్రియ ఏతోఁడియోగమువలనఁ బ్రార్థనార్థమును బొంది 'పంపకుము' అనురీతిగాఁ బ్రార్థనార్థము గల్గును గదా. వ్యతిరేకార్థము నశించుట యెట్లు? తెలుఁగున నదాదులు పెక్కిటిపైఁ గాననవును. కాని విరుద్ధార్థక మవుట మాత్ర మిచ్చుటనే యనవలె. (పంపవే-పంపుమా)

నన్నుఁ జూచి నగరె యనుచో 'నగరు' అనువ్యతిరేకక్రియపై 'ఎ' అనునది చేరి 'నగరె' అని కాఁగా 'నగరు' అనుక్రియయొక్క వ్యతిరేకార్థము ప్రశ్నార్థయుక్త మగును. దీనికి వాచ్య మగునర్థము నగువారు కారా యనియె. పిదప 'నగుదురు' అనునర్థము వ్యంగ్యముగా సిద్ధించును.

చిత్తశాంతి యొనర్పవే యనుచో నిట్లు గాదు. ఒనర్పవు- అనువ్యతిరేకక్రియపై 'ఏ' యనునది చేరఁగా నేర్పడిన 'ఒనర్పవె' యనుదానిచే 'ఒనర్పుము' అనునదే వాచ్య మగునర్థము. వీని నెల్ల నొకేకోవకుఁ జెందినవిగా (వ్యా.సం.స.1415) వఝులవారు చూపుట సరి కాదు.

ఈ భేదమునుబట్టియె 'ఒనర్పవె' యనురీతివి "ఒనర్పుము" అను రీతిప్రార్థనార్థకరూపమునుండి సాధించుటయె యుచిత మనియు నట్టిసూరిలక్షణ మర్థక్రమానుగుణ మనియును నిశ్చయింపవచ్చును.

అజరత్కారుఁ గని చెప్పవయ్యె వాని నెఱుఁగు దేని, చెప్పుమయ్య తపతికపత్యుల మైనతెఱఁగు (వ్యా.సం.స.1415) అనుచోఁ జెప్పవయ్య చెప్పవయ్య యనునవి సమానార్థకములు. చెప్పుమయ్య యనుదానినుండి చెప్పవయ్యయని సాధించినసూరిమత ముచితము.

సూరి యెదాదిపరకత్వమున ముజ్ఞస్థానమున వుజీ, రుజీ విధించెను. ముదుజ్ఞలస్థానమున నైన వగుటచే నాయర్థమె సహజము గాన పంపవే యనురీతివానికి పంపుము అనురీతిగా నర్థ ముండుట సముచితముగ సూరి మతమున సిద్ధించుచున్నది.

ప్రొద్దు వోయెడుఁ బదవమ్మ ముద్దుగుమ్మ (విజ.3.207)చూతము పదరమ్మ (కువ.4.142) పదవే పదరమ్మ యనునీరీతిప్రయోగములు సూరి విధానము నెంతయు సమర్థించుచున్నవి. ఇట వ్యతిరేకక్రియలపై ఎదాదులు చేయవలె నన్న పోవె, పోరమ్మ యనియె యగును.పోవుధాతువునకు వ్యతి రేకార్థమునఁ బదవు, బదరు అనువిధ మైనరూపము లుండవు గదా. పదము పదఁడు అనువానిలో వరులవారు గుర్తించినవిశేషార్థము వ్యతిరేకక్రియలం దెట్లు సాధ్యము? ఇంక వీరిలక్షణముచే సాధ్యములు గాని యీయవి కవి ప్రయుక్తములు గా వనవలె నేమో.

వ్యతిరేకక్రియనుండి యీరూపములను సాధించువీరిలక్షణము "ఏదోతౌవ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః" అనుచిం.లక్షణము ననుసరించియున్న దనుట స్పష్టమె.

సూరియు మొదట నీవరులవారిపద్ధతిలో ననఁగాఁ జిం.మార్గములోనె వీనిని నిరూపించుట గమనింపవచ్చును. "అదాదిదీర్తులు మధ్యమముదుజ్ఞల మీఁద నొందె నగు– వ్యతిరేకమధ్యమంబు మీఁద (వీరు దమ 41.సూ.లో మధ్యమమున కనకుంట గమనించితిమి. చిం.ని గ్రహించుచునే సూరి యుచి తముగాఁ జెప్పెను.) నెదాదులు సంప్రార్థనపరంబు లగు" (శ.సం.87,92) కాఁగా చిం.పద్ధతి యర్థ మయియుండియు, సూరి బాల.లో నామార్గమును

బరిహరించి ముదుల జకు వుజీ, రుజీ విధించుట యనాలోచితముగ ననఁదగునా? శబ్దస్వరూపమునందలిసామ్యముకంటె నర్థము ప్రధాన మని సూరి ముజనకు వుజీ రుజీ విధించెను. ఇందలియౌచిత్యము నెన్నక వరుులవారు మఱలఁ జిం. మార్గమును బునరుద్ధరించుట యేల?

'వీరితరువాతిసూత్రమె పై సూరిప్రణాళిక యుచిత మని నిరూపించు.

## వినతెంవె :

'ఎఏలయోగమున వ్యతిరేకప్రార్థనాద్యర్థకమువర్ణకముకారమునకు వకారాదేశ మగును' (ఉ.42)

'ఎఏలయోగమున' ననుటచేతనె ఎఏలు చేరుటను సాధించుకొనవలె. అనఁగా బాల.క్రియా.30.సూత్రమునొద్ద వీరు తలఁచినయనౌచిత్యమె వీరిసూత్రమునను గల్గిన దన్నమాట. సంప్రార్థమున ముజనకు వీరు ఎఏలనుప్రయుక్తములుగాఁ జెప్పలేదు. సూరి యట్లు చెప్పుటను దిరస్కరించిరి కదా. కావున ఎఏలు ప్రస్తుతసూత్రముచేతనె వచ్చు ననుకొనవలె. అపుడు వీరు ఉ.క్రి.37సూత్రమున దుగాగమమును జెప్పుటయు సూరి యట్లు చెప్ప లే దని విమర్శించుటయు నసంగతములు.

సూరి(వలె వీరును) "సంప్రార్థనంబున' నని ప్రార్థనముననె ముజనకదాదులయనుప్రయోగమును జెప్పెను. కాని యిట వీరు "పార్థనాద్యర్థక" మని యాదిశబ్దము చేర్చిరి. ఈమువర్ణకము లూట్టువవర్ణమున కైనది. లూట్టు ఆశీశ్శాపసంప్రార్థనవిధులం దగును. మఱి యిటఁ బ్రార్థనాద్యర్థకమన నాదిశబ్దముచే నేది గ్రహింపవలె. ఆశీశ్శాపవిధులం దీకార్య మయినట్లు వీ రొక్కలక్ష్యమును జూపలేదు. వీ రధికముగాఁ జేర్చినయాదిశబ్దము నిరర్థకము.

"మువర్ణకముకారమున" కనుచో ముకారమున కన్నది యచ్చుపొర

పాటు గావచ్చును. ముపర్ణక"మ"కారమున కని యుండఁదగును. (ము కార మన ముపర్ణము మొత్త మగును. అట్టియెడల ముపర్ణకమున కన్ననే చాలు. మఱలముకారమున కనఁబని లేదు.ముకారమునం దుత్వమునకె యయి వినకుమ్వే యని యపరూప మేర్పడు ప్రమాదమును గలదు.) సూరి ముఖులకు వురులు విధించెను. జీర్త్వమునుబట్టి యాతఁ డట్లు చెప్పుట లాఘవము.

మకారమునకు అనుచో టిషష్ఠిచేతనె మకారముస్థానమున నని యర్థ మగును కావున. "వకారాదేశ" మగు నని "యాదేశము"గాఁ జెప్పుట యవసరము గాదు.

ఈసూత్రముచే వీరు లక్ష్యానుసారముగా సూరిప్రణాళికవైపు మఱలిరని స్పష్టము. వినవు + ఎ-వినవె యనుచో వ్యతిరేకక్రియపై నెత్వ మగు నన్నవీరు,వ్యతిరేకక్రియ వినకువు అనురీతి నుండదు గాన సూరిమార్గమును ద్రొక్కి 'వినకుము' అను(వ్యతిరేక)ప్రార్థనార్థకక్రియాపదమునుండియె మకారమునకు వకారమును విధించి సాధించికొనవలసివచ్చినది. 'వినకువె' యన్నది 'వినకుము' అనుదానినుండి సాధించినట్లె, వినవె (వినరె) యన్నది వినుము (వినుఁడు) అన్నదానినుండి సాధించుట సక్రమ మని వరులవారియీసూత్రము సూచించుచున్న దని గమనింపవచ్చును.

సూరిపక్షమున వినవె-వినరె వినకువె వినకురె వినవయ్య మున్నగు చోటులందు వినుము+ఎ-వినవె వినకుము+ఎ- వినకువె- -అనురీతిని బదచ్ఛేదము-- ఇది యెంతయు నస్వాభావికము నసత్యము ననుటకు సందియము లే (వ్యా.సం.స.1418) దన్నవీ రిట వినకుము + ఎ- వినకువె పడకుము + ఎ పడకువె' యని సాధించుట స్వాభావికమును, సత్యము నై యున్నదా? వినకుము + ఎ- వినకువె యనుట స్వాభావికము కాఁగా వినుము + ఎ- వినవె యన్నదే యస్వాభావికమా?

వినవు—ఎ—వినవె— వినుము అనుదానికంటె వినుము + ఎ-వినవె—

వినుము అనురీతిప్రక్రియ స్వాభావిక మనుటలో సందియ మక్కఱ లేదు. 'వినవె' -యనుచోటిశబ్దముసామ్యము (చిం.) ననుసరించి. వీ రిది స్వాభావిక మనుకొని శ్రేమో. కాని యర్థస్వరూపము స్వాభావికమా? కారే-కారా-అగుదురు అన్నట్లుగా వినవే- వినువా- వినుము అని యగు ననుకొంటకు వీలు లే దని పైని గమనించితిమి. అర్థవంత మగుసూరిప్రక్రియయె సమంజసము.

## చూవె-చూరె :

ప్రార్థనమున ముజ్జునకు ఎఏ లనుప్రయుక్తములు గా వనియు వుజీ రుజీ రా వనియుఁ జెప్పుట వీరియుద్దేశ్య మనుట స్పష్టము. కాని వీరే తరువాత నొకసూత్ర మిట్లు పేర్కొనిరి.

'చూచుధాతుప్రార్థనాద్యర్థక సంక్షేపరూపము లగు చుమ్మ-చుమ (చూడుము) చుండు- చుఁడు(చూడుఁడు) అనునవి యెదాద్యనుప్రయోగమున చూవె-చువ్వె (చూడవె) చూరె (చూడరె) అనురూపముల నంది-'(ఉ.43.బాల.లో లేదు.) నిట్టిసూత్ర ముండ నవసరము లేదు. చుమ్మ, చుండు అనునవి యేర్పడిన బాల.క్రియా.34సూ.చే నీరూపము లేర్పడును.

చూడుము-చూడుఁడు అనువానిసంక్షేపరూపము లనుటచేతనె చుమ్మ చుండు అనురూపములు సిద్ధించు నని వీరు దలఁచియుందురు. చూఁము, చూడుఁడు అనువానిప్రక్రియ స్పష్టమె.

చుమ్మ చుండు అనువానిప్రక్రియయు నూహింప నవకాశము లేక పోలేదు. చూచు + ము, చూచు + డుజ్ 'అనుచో చూచున కర్థవిశేషమున ముజ్వరకత్వమునందు 'చు'లోపమును క్రియా.101సూత్రమునందలి బహుళపదముచే సాధించుకొనవచ్చును. అపుడు చూ + ము, చూ+డుజ్ అని కాఁగా, చుమ్మ,చుండు-(లెమ్ము- లెండు) అని యేర్పడు. అఁటయిఁక

చుఁడుసూత్రము ననుసరించిఖండబిందువును నిర్బాధ మగుట 'చుఁడు' అనియు నగును. 'చుమ్మి' అనుదాని నక్కటాదులలోఁ జేర్చుటచే 'చుము' అనియు నగు.

సంక్షేపరూపము లనుటకంటె నిట్లు ప్రక్రియనూహించుట యుచితమె. అర్థవిశేషమును బ్రస్తావించిరే కదా.

చుమ్మి, చుఁడు అనువీనియందలిముదుజ్జులు మధ్యమముదుజ్జులె కాన 'బాల.క్రియా.33సూ.చే చుమ్మీ చుమీ ఇత్యాదు లగు. బాల.క్రి.34 సూ.లే వే లేరే యనురీతిని చూవె చూరె యనియు నేర్పడును.ఇ ట్లేర్పడుట యసంగత మను (వ్యా.సం.స.1420) వీరియభిప్రాయము సరి కాదు. ఇమ్ము+ఎ-ఈవె,ఇండు+ఎ-ఈరె.

ఇ ట్టీరూపములు క్రియా.34.సూ.చే సిద్ధించుచునే యుండఁగా వీనికై వే ఱొకసూత్రము రచింప నవసరము బాల.లో లేదు గదా.

వఝులవారిలక్షణముచే నీరూపము లేర్పడు టెట్లు? వ్యతిరేకార్థమున చూవు, చూరు అని యుండవు గాన వీరు వినవె, వినరె యన్నవి సాధించినపద్ధతిలో చూవె, చూరె యన్నవి సాధ్యములు గావు, (చూడవె, చూడరె యని యగును.) 'ఎదాద్యనుప్రయోగమున- చూవె చూరె అను రూపము లందు' ననఁగా నిది నిపాతసూత్రము గాఁబోలును. ఎదాద్యను ప్రయోగమును నీనిపాతసూత్రముచేతనె యగు ననవలె. ప్రార్థనార్థకముల యైనను ఉ.క్రి.సూ.చే ఎదాద్యనుప్రయోగ మెట్లు? ఇట 'ఎదాదు లన్నవీరు 40.సూ.లో నదాదు లనియు, 41సూ.లో నెదాదు లనియుఁ జెప్పక యందుఁ గొన్నింటిని సూత్రముననే యేల పఠించిరో తెలియదు.

'నామములును యథాప్రయోగముగ అదాదులతోఁ గూడి యర్థవిశేషముల నిచ్చుచుండును. నే నొకబ్రాహ్మణుండనె- ద్రుపదమహారాజులె- అదాదులు -(క్రియా 40.సూ.వివ)' (ఉ.374) అనువీరివివరణము నను

సరించి యెదాద్యనుప్రయోగ ముక్త మందమా? ఇట వీరు అదాదులు అని చెప్పి 40.సూత్రమును జూడు మనిరి. ఆసూత్రములో అదాదు లని చెప్పక వానిని నిర్దేశించిరి. అందు ఏఏలు లేవు. ఇంక నెదాదు లన నేవి? వీ రావిషయమును మఱచిరా? బ్రాహ్మణుండనె, ద్రుపదమహారాజులె యనుచో నెత్వమును జూపిరి. ఎదాదు లదాదులలోఁ గల వేమో యని సందేహింపకుండ 40సూ. చూడు మనిరి.

ఇచ్చటివివరణము ననుసరించి యచ్చట (40.సూ.)నున్న 'మున్న గు'శబ్దముచే ఎఏఒఓలు గ్రహింతమా? అపు డట చూడుమే (చూడవే) వండుఁడో (వండరో) ఇత్యాదిగా రూపములు సిద్ధింపఁగలవు. "చూడుమే మున్నగురూపములు లే వని" (ఉ 374) వీరును స్పష్టము చేసిరి. కాన నట నదాదులలో ఎఏప్రభృతులు గ్రహింపరాదు.

ఇంతకు నిట వీరు 40సూత్రమున మఱనకె యదాదులయనుప్రయోగమును జెప్పిరి. బ్రాహ్మణుండనె ఇత్యాదుల నితరస్థలముల నె ట్లయినది? వివరణముచే నగునా? సూత్రముగాఁ జెప్పి యదాదులలో నెదాదులను వేర్కొన్నబా గుండెడిది.

ఈవివరణమున వీరు 'నామము' లన్నది సుబంతము లనునర్థమునఁ (బ్రాహ్మణుండనె మొ॥) బ్రయోగించుట విశేషము. వ్యాకరణమున దీనికిఁ బ్రాతిపదిక మనియ యర్థము. క్రియ లనఁగాఁ దిఙంతము లని చూపిరి. కాఁగా నామము (క్రియ)లనక పదసామాన్యముపైఁ జేరుట నిం కొకతీరుగఁ జెప్పఁదగును.

ఈపదము లదాదులతోఁ గూడి యర్థవిశేషము నిచ్చు ననుటకంటె నర్థవిశేషమున నదాదులు చేరుటను జెప్పిన నుచితముగా నుండెడిది.

ఇఁకఁ బ్రస్తుతస్థలమున నెదాదు లనఁగా నేవో వీరు స్పష్టముగాఁ జెప్పలేదు. ఉదాహరణములనుబట్టి ఎ,ఏలు రెండె యగునా? అయిన 'ఎఏ'

అని స్పష్టముగా నిర్దేశించిన సరిపోవుదానికి 'అది'శబ్ద మేల? పెక్కు లున్న చోట్ల సూత్రమునన గొన్ని నిర్దేశించి మున్నగున వనుటయు ఎ,ఏలు రెండే యుండ నిట మాత్రము ఎదాదు లనుటయు వింత గాక తప్పదు. ఎదాదు లనుప్రయుక్త మగునపుడు 'చూవె- చూరె' యగు ననిరి. దీర్ఘ ముప లక్షణ మనుకొనవలె. ఎదాదులలో నేది యనుప్రయుక్త మయినను చూవె, చూరె అనియె యగు నని తలఁచుటకు నవకాశము గల్గుఁ గదా. కాక యెదాదులలో నితరము లనుప్రయుక్తము లయినపు డిట్టిమార్గమున రూపము లగు నని చెప్పచో నెదాదు లనుటయు నొప్పును.

అయిన నెదాదు లేవి? సూరిగారియెదాదులలో ఎఏ,ఒఓ అయ్యె మున్నగున వున్నవి. అ వన్నియు నిట గ్రహింపవచ్చునా? అయినచోఁ జూవయ్యె, చూరయ్యె అనియె కావలెను. చుమ్మయ్యె, చుండయ్యె యను రీతిరూపము లసాధువు లగును. అట్టియెడల లోఁగడ సూరిలక్షణమున వీరు చూపినదోషము (ఉ.373. దీనింగూర్చి పైని జూతము) వీరిలక్షణమునను నేర్పడును సిద్ధుఁడఁ జు మయ (భోజ.2.190) రప్పింపవలెఁ జుమయ్యె (కాశీ.6.32) [సూ.ని.] కాన నయ్యాదు లిచ్చట నెదాదులలో లే వనవలె. వోసీ ఒఓలు గలవా? చేయవలయుఁ జుండో [రుక్మాం.1.126] తప్పగుఁ జుఁడో [కాశీ.5.270][సూ.ని.] అనురీతి వసాధువు లగును. కావున ఒఓలు గూడ నిట నెదాదులలో లే వనవలె.

"ఇట్టిచూవె మున్నగుచోటులు తప్ప మ తెచ్చుటను ప్రార్థనాద్యర్థక మధ్యమపురుషపై ఎఏలు నిల్చుట లేదు. చూడుమే మున్నగురూపములు లే వని తాత్పర్యము' [ఉ.374]అని వీరే ఎఏలు మాత్రమె యని స్పష్టము చేసిరి. 'ఎదాది' అనుచోటియాదిశబ్దముచే 'ఏ' అనున దొక్కటి గ్రహింపవలె నన్న మాట. ఎఏ లని యిట స్పష్టముగా నిర్దేశింపఁదగును. 40,సూత్రమున అదాదు లనియు, 41సూత్రమున నెదాదు లనియు వీరు చెప్పఁదగును.

ఏ మైన నిటఁ జూవె, (చూరె) మున్నగుచోట్లఁ ముజపై ఎఏలు

వినుము అనురీతిప్రక్రియ స్వాభావిక మనుటలో సందియ మక్కఱ లేదు. 'వినవె' -యనుచోటిశబ్దముసామ్యము (చిం.) ననుసరించి. వీ రిది స్వాభావిక మనుకొని భ్రమో. కాని యర్థస్వరూపము స్వాభావికమా? కారే-కారా-అగుదురు అన్నట్లుగా వినవే- వినువా- వినుము అని యగు ననుకొంటకు వీలు లే దని పైని గమనించితిమి. అర్థవంత మగుసూరిప్రక్రియయె సమంజసము.

## చూవె-చూరె :

ప్రార్థనమున ముజ్ఞనకు ఎవే లనుప్రయుక్తములు గా వనియు వుజి రజి రా వనియుఁ జెప్పుట వీరియుద్దేశ్య మనుట స్పష్టము. కాని వీరే తరువాత నొకసూత్ర మిట్లు పేర్కొనిరి.

'చూచుధాతుప్రార్థనాద్యర్థక సంక్షేపరూపము లగు చుమ్ము-చుము (చూడుము) చుండు- చుఁడు(చూడుఁడు) అనునవి యెదాద్యనుప్రయోగమున చూవె-చువ్వె (చూడవె) చూరె (చూడరె) అనురూపముల సంధి-'(ఉ.43.బాల.లో లేదు.) నిట్టిసూత్ర ముండ నవసరము లేదు. చుమ్మ, చుండు అనునవి యేర్పడిన బాల.క్రియా.34సూ.చే నీరూపము లేర్పడును.

చూడుము-చూడుఁడు అనువానిసంక్షేపరూపము లనుటచేతనె చుమ్ము చుండు అనురూపములు సిద్ధించు నని వీరు దలఁచియుందురు. చూఁడు, చూడుఁడు అనువానిప్రక్రియ స్పష్టమె.

చుమ్ము చుండు అనువానిప్రక్రియయు నూహింప నవకాశము లేకపోలేదు. చూచు + ము, చూచు + డుజ్' అనుచో చూచున కర్థవిశేషమున ముఖ్వరకత్వమునందు 'చు'లోపమును క్రియా.101సూత్రమునందలి బహుళపదముచే సాధించుకొనవచ్చును.అపుడు చూ + ము,చూ+డుజ్ అని కాఁగా, చుమ్ము,చుండు-(లెమ్ము- లెండు) అని యేర్పడు. అఁటయిఁక

చుఁడుసూత్రము ననుసరించిఖండబిందువును నిర్బాధ మగుట చుఁడు అనియు నగును. 'చుమ్మ' అనుదాని నక్కటాదులలోఁ జేర్చుటచే చుము అనియు నగు.

సంక్షేపరూపము లనుటకంటె నిట్లు ప్రక్రియనూహించుట యుచితమె అర్థవిశేషమును బ్రస్తావించిరే కదా.

చుమ్మ, చుఁడు అనువీనియందలిముడుఁజులు మధ్యమముడుఁజులె కాన 'బాల.క్రియా.33సూ.చే చుమ్మీ చుమీ ఇత్యాదు లగు. బాల.క్రి.34 సూ.లే వే లేరే యనురీతిని చూవె చూరె యనియు నేర్పడును. ఇ ట్లేర్పడుట యసంగత మను (వ్యా.సం.స.1420) వీరియభిప్రాయము సరి కాదు. ఇమ్మ+ఎ-ఈవె, ఇండు+ఎ-ఈరె.

ఇ ట్లీరూపములు క్రియా.34.సూ.చే సిద్ధించుచునే యుండఁగా వీనికై వే తొకసూత్రము రచింప నవసరము బాల.లో లేదు గదా.

వర్షులవారిలక్షణముచే నీరూపము లేర్పడు టెట్లు? వ్యతిరేకార్థమున చూవు, చూరు అని యుండవు గాన వీరు వినవె, వినరె యన్నవి సాధించినపద్ధతిలో చూవె, చూరె యన్నవి సాధ్యములు గావు. (చూడవె, చూడరె యని యగును.) 'ఎదాద్యనుప్రయోగమున- చూవె చూరె అను రూపము లందు' ననఁగా నిది నిపాతసూత్రము గాఁబోలును. ఎదాద్యను ప్రయోగమును నీనిపాతసూత్రముచేతనె యగు ననవలె. ప్రార్థనార్థకముల యైనను ఉ.క్రి.సూ.చే ఎదాద్యనుప్రయోగ మెట్లు? ఇట 'ఎదాదు' లన్నవీరు 40.సూ.లో నదాదు లనియు, 41సూ.లో నెదాదు లనియుఁ జెప్పక యుండుఁ గొన్నింటిని సూత్రముననే యేల పఠించిరో తెలియదు.

'నామములును యథాప్రయోగముగ అదాదులతోఁ గూడి యర్థవిశేషముల నిచ్చుచుండును. నే నొకబ్రాహ్మణుండనె- ద్రుపదమహారాజులె- అదాదులు -క్రియా40.సూ.వివ)' (ఉ.374) అనువీరివివరణము నను

సరించి యెదాద్యనుప్రయోగ ముక్త మందమా? ఇట వీరు అదాదులు అని చెప్పి 40.సూత్రమును జూడు మనిరి. ఆసూత్రములో అదాదు లని చెప్పక వానిని నిర్దేశించిరి. అందు ఏఏలు లేవు. ఇంక నెదాదు లన నేవి? వీ రావిషయమును మఱచిరా? బ్రాహ్మణుండనె, ద్రుపదమహరాజులె యనుచో నెత్వమును జూపిరి. ఎదాదు లదాదులలోఁ గల వేమో యని సందేహింపకుండ 40సూ. చూడు మనిరి.

ఇచ్చటివివరణము ననుసరించి యచ్చట (40.సూ.)నున్న 'మున్న గు'శబ్దముచే ఎఏఒఓలు గ్రహింతమా? అపు డట చూడుమే (చూడవే) వండుఁడో (వండరో) ఇత్యాదిగా రూపములు సిద్ధింపఁగలవు. "చూడుమే మున్నగురూపములు లే వని" (ఉ 374) వీరును స్పష్టము చేసిరి. కాన నట నదాదులలో ఎఏప్రభృతులు గ్రహింపరాదు.

ఇంతకు నిట వీరు 40సూత్రమున ముఱనకె యదాదులయనుప్రయోగమును జెప్పిరి. బ్రాహ్మణుండనె ఇత్యాదుల నితరస్థలముల నె ట్లయినది? వివరణముచే నగునా? సూత్రముగాఁ జెప్పి యదాదులలో నెదాదులను జేర్కొన్నచో బాగుండెడిది.

ఈవివరణమున వీరు 'నామము' అన్నది సుబంతము లను నర్థమునఁ (బ్రాహ్మణుండనె మొ॥) బ్రయోగించుట విశేషము. వ్యాకరణమున దీనికిఁ బ్రాతిపదిక మనియ యర్థము. క్రియ లనఁగాఁ దిఙంతము లని చూపిరి. కాఁగా నామము (క్రియ)లనక పదసామాన్యముపైఁ జేరుట నిం కొకటిదనఁగఁ జెప్పఁదగును.

ఈపదము లదాదులతోఁ గూడి యర్థవిశేషము నిచ్చు ననుటకంటె నర్థవిశేషమున నదాదులు చేరుటను జెప్పిన నుచితముగా నుండెడిది.

ఇఁకఁ బ్రస్తుతస్థలమున నెదాదు లనఁగా నేవో వీరు స్పష్టముగాఁ జెప్పలేదు. ఉదాహరణములనుబట్టి ఎ,ఏలు రెండె యగునా? అయిన 'ఏప'

అని స్పష్టముగా నిర్దేశించిన సరిపోవుదానికి 'ఆది'శబ్ద మేల? పెక్కు లుగ
చోట్ల సూత్రమునన గొన్ని నిర్దేశించి మున్నగున వనుటయు ఎ,ఏ
రెండే యుండ నిట మాత్రము ఎదాదు లనుటయు వింత గాక తప్పదు. ఎ
దు లనుప్రయుక్త మగునపుడు 'చూవె- చూరె' యగు ననిరి. దీర్ఘ మ
లక్షణ మనుకొనవలె. ఎదాదులలో నేది యనుప్రయుక్త మయినను చూ
చూరె అనియె యగు నని తలఁచుటకు నవకాశము గల్గుఁ గదా. కాక యె
దులలో. నితరము లనుప్రయుక్తము లయినవు డిట్టిమార్గమున రూపము ల
నని చెప్పుచో నెదాదు లనుటయు నొప్పును.

అయిన నెదాదు లేవి? సూరిగారియెదాదులలో ఎఏ,ఒఓ అవ
మున్నగున వున్నవి. అ వన్నియు నిట గ్రహింపవచ్చునా? అయినచొ
జూవయ్యె, చూరయ్యె అనియె కావలెను. చుమ్మయ్యె, చుండయ్యె య
రీతిరూపము లసాధువు లగును. అట్టియెడల లోఁగడ సూరిలక్షణమున పీ
చూపినదోషము (ఉ.373. దీనింగూర్చి పైని జాతము) వీరిలక్షణమున
నేర్పడును సిద్ధుఁడఁ జు మయ (భోజ.2.190) రప్పింపవలెఁ జుమఁ
(కాశీ.6.32) [సూ.ని.] కాన నయ్యాదు లిచ్చుట నెదాదులలో లే వనవ
పోనీ ఒఓలు గలవా? చేయవలయుఁ జుండో [రుక్మాం.1.126] తప్పఁ
జుఁదో [కాశీ.5.270][సూ.ని.] అనురీతి వసాధువు లగును. కావున ఒఓ
గూడ నిట నెదాదులలో లే వనవలె.

"ఇట్టిచూవె మున్నగుచోటులు తప్ప మ తెచ్చుటను ప్రార్థనాద్య
మధ్యమపురుషపై ఎఏలు నిల్చుట లేదు. చూడుమే మున్నగురూపము
లే వని తాత్పర్యము" [ఉ.374]అని వీరే ఎఏలు మాత్రమె యని స్పష్ట
చేసిరి. 'ఎదాది' అనుచోటియాదిశబ్దముచే 'ఏ' అనున దొక్కటి గ్రహిం
వలె నన్న మాట. ఎఏ లని యిట స్పష్టముగా నిర్దేశింపఁదగును. 40,సూ
మున అదాదు లనియు, 41సూత్రమున నెదాదు లనియు వీరు చెప్పఁదగు

ఏ మైన నిటఁ జూవె, (చూరె) మున్నగుచోట్లఁ ముజపై ఎఏ

చేరుట నంగీకరించి సూరిప్రక్రియను గొంత యామోదింపకతప్పలేదు. 'విన కువె'యనునది మొదటిదిగా నిది రెండవస్థలము. వ్యతిరేకక్రియలపైఁ గుదు రనిచో నెల్ల వీరు సూరిమార్గము ననుసరించుచుండి రని గమనింపవచ్చును.

మ తెచ్చుటను బ్రార్థనార్థకముపై ఎఏలు లేవు గావునఁ జూడుమే యని యుండ దనిరి. అందుకే సూరి ఎదాద్యనుప్రయోగమున ముజ్ఞనకు వుజీ రుజీ చెప్పి చూడవె యని సాధించెను. చుమ్ము, చుండు అనుచోఁ బ్రార్థనార్థకముపై ఎఏలు గలవు గదా. అట మాత్రము చూడుము+ఏ-చూడు మె వలె చుమ్ము+ఎ- చుమ్మె, చుండు+ఎ-చుండె యగుచున్నదా? ఇటఁ జూవె చూరె యని యెట్లగునో యట్లే చూము-ఎ- చూడవె యని యగు నని చెప్పుటలో దోషమేమి? సూరిమత ముచితమే. సూరి 34 సూత్రమొక్కటి తొలఁగించి, 41, 42, 43గా మూఁడుసూత్రములు రచించినను వీరు సూరి 34సూత్రాభిప్రాయమును గొన్నియెడల ననుసరింపకతప్పకుండుటయు గమ నార్హము.

## వినకురె:

వ్యతిరేకప్రార్థనమునందును వీరు 'ము'వర్ణకమకారమునకు వకారమునె చెప్పిరి. (మూకు వుజీ సూరి విధించె) సూరిలక్షణము ననుసరించి ముజ్ఞ నకు రుజీ యగును. వినకురె యని సూరి యుదాహరించెను. 'వినకురె మున్నగుబహువచనప్రయోగములు కవిప్రయోగములందు లే' (ఉ.378) వనిరి. 'వినకువమ్మ- వినకురయ్య- అనురూపములు సైత ముత్తరసూత్ర మునకు లక్ష్యము లని చెప్పుటకు వెనుదీయఁ డని చెప్పనగు' (వ్యా.సం.స. 1417) నని గు.ప్ర.కర్తను వీరు విమర్శించిరి. అయ్యవి సూరిలక్షణముచే సాధింపఁబడుచుండఁగా లక్ష్యములు గా వనుట సరి కాదు. బా.సా.చే. అయ్యాద్యులు వ్యతిరేకక్రియలపైఁ జేరు ననుటయుఁ బొరపాటు.)

వినకురె యనురీతిప్రయోగములు లే వనుదృష్టితోనె వీ రి శ్లేకవచన మున నకారము చెప్పి రన్నమాట. అ ట్లయిన బహువచనమందు రూపము లె ట్లుండవలె. వినకుఁడె, వినక్కుఁడే యనురీతి నుండునా? బహువచనముపై ఎవి లనుప్రయుక్తములు గా వని వీరు స్పష్టము చేయలేదు.

చిలుకకు మావికిం బగలు సేయకురే లతకూనలార (కకుత్థ్స1.129) నిలువఁగ నీకురే యనుచు (కాళ.3.26) మీ రిపుడు గో లని చూడకురమ్మ (విజ.3.34) ఇత్యాదిగాఁ గవిప్రయోగములం దుండుటను జూచియె సూరి యిట 'వినకురె' యని యుదాహరించె నని గ్రహింపఁదగును.

కాఁగాఁ గవిప్రయోగానుగుణముగా సూరి డుజ్జునకు రుజీ చెప్పి యుండఁగా వీరు దానిని దిరస్కరించుట సమంజసము గాదు.

సూరి యెదాద్యనుప్రయోగమున ముజ్జునకు వుజీ రుజీ విధించుట యెంతయు నుచితమె. కాన సూరిలక్షణము సూక్తమె.

కాని యొకవిశేష మిట గుర్తింపకతప్పదు. 'వుజీ రుజీ యగు' నన్నసూరి వినవె, వినకురె యనురీతిగ నుదాహరించెను. 'ఈపక్షమున' 'వినుమయ్య- ముజ్జు నిల్వ నేరదు. ఎదాదులలో సూరి అయ్య అమ్మ అను వానిని బఠించెను' (ఉ.373) అనువయులవారివిమర్శలో నౌచిత్యము లేక పోలేదు. 34సూత్రమునొద్ద సూరి ఎదాదులలో అయ్యాదుల నుదాహరింప లేదు. అయ్యుఁ బూర్వసూత్రవివరణమునుబట్టి అయ్యాదు లెదాదులలోఁ జేరినవే. కావుననె వినవయ్య చూడకురమ్మ యనురీతిరూపము లేర్పడు చున్నవి. వినుమయ్య యనురీతివి సాధువులె,కాఁగా ఎదాదులలో ఎవ,ఒటలు పర మయినపుడు మాత్రము వుజీ రుజీ నిత్యమె. కాని యందలియయ్యా దులు పర మైనపుడు వుజీ రుజీ రాకుండుటయుఁ గలదు. నన్నయాదుల ప్రయోగములనుబట్టి వీనికి సాధుత్వము గల్పించుటకు వుజీ రుజీ ప్రాయి కముగా నగు నన్న బా గుండెది దేమో. (ఎవఒటలు- పర మైన నిత్యము

గను నయ్యాదులు పర మైనఁ దఱుచుగను విధించినను బాగుండులేదా కొన్ని యెడల లేకుండుట వివరించినను బా గుండెడిది.

సూరి 'టితివర్ణంబులు పరంబు లగునపు డుత్వంబున కిత్వం బగు' ననియె చెప్పి కొన్నియెడల లేకుండుటను బేర్కొని నెత్తుటిని నని యుదాహరించె. ఇట నట్లే సూత్రమున నగు నన్నను గొన్నియెడల (వగుటతో పాటు) లేకుండుటయుఁ గల దని వివరించి వినుమయ్య చెప్పుఁడయ్య(ఆది. 7.207) యనురీతి నుదాహరించిన బా గుండెడిది గదా యనిపించుచున్నది. కాతపూర్వస్థలమును బట్టి మన మూహించుకొనవచ్చుఁ గవిప్రయోగానుసారముగా.

## చెప్పుఁడయ్య :

వివరణమున నొకవిశేష మిట్లు పేర్కొనిరి. "అయ్యాదు లేకవచనాంతము లయ్యు బహువచనాంతములమీఁద నైతము నిల్చును. చెప్పుఁడయ్య (ఆది.7.207) చూచివత్తమమ్మ సుదతులార (భాగ.)(ఉ.374) ఇది వివరణము గావున స్పష్టతకుఁగా నిట్లు చెప్పినఁ దప్పు లే దనవచ్చును. చెప్పుఁడయ్య యనుచో పీఠిక్రి.40.సూ,చే అయ్య అనుప్రయుక్త మైనది. అనుప్రయుక్తము లర్థవంతములు గా వనియు 'నేది లోపించినను వర్థభంగము కల్గదో యది యనుప్రయుక్త మనఁబడు ననియు' (ఉ.211)పీఠియభిప్రాయము. ఇది యెల్లయెడలఁ గుదుర దను ట ట్లుంచిన నిట ననుప్రయుక్త మగును. ఇది యెల్లయెడలఁ గుదుర దను ట ట్లుంచిన నిట ననుప్రయుక్త మగున నయ్యాదులు (సంప్రార్థనమున) క్రియపై స్వార్థమునందే చేరును.కానియివి స్వీయార్థముతో నుండవు. అదాదు లెట్లో యిట నీఅయ్యాదులు నట్లు చేరునవి. వత్తమమ్మ యనుచోఁ గూడ ననుప్రయుక్తమే.కావున వీనివచనముఁ గూర్చిన విచార మనవసరము. [చూ.త్రి.శే.]

కాని మహదర్థమునసె అయ్య యనునదియు మహత్యర్థమునసె అమ్మ యనునదియుఁ జేరుట గమనార్హము. ఇట నార్యాద్యర్థము లేకున్నను చూచి వత్తమయ్య సుదుతులార, పోవమ్మ కుమార యని యుండదు గదా.

వచ్చుధాతు ప్రార్థనాద్యర్థకసంక్షేపము లగు రా- ర- రారా- రా
[రమ్ము] అనుశబ్దములు యథాప్రయోగముగ నామములపైని క్రియలపై
నిల్చి యర్థవిశేషద్యోతకము లగును' [ఉ.44.సూ.బాల.లోలేదు][వ్యా.స
స.1422] వి.వి. ననుసరించి వీ రిది విశేషముగాఁ జెప్పి రని గ్రహిం
వలెను.

కాని రార- మొదలగునవి నిల్చినట్లు చూపినస్థలములలో ఏమిర క
కాదురోరి, బళిరా, ఏరా తమ్ముఁడ,కానీరా, ఔరా అనుచోట్ల నున్న రా-
అనునవి వచ్చుధాతువునుండి యేర్పడినరూపము లనుట యసమంజసమ్ము
ర-దే. అపదము నీచమిత్రోద్దేశములయందు ఉద్దేశ్యవాచకమునకు ఏకత్వం
న అంతాగమం బగును. కాదురోరి- ఏలర- అవ్య. అనురీతిగా శ.ర.అప
ముగ నవ్యయముగను జెప్పినది. ఇది యవ్యయ మనఁదగు. సంస్కృ
మందలి రే(అవ్య.నీచాదేస్సంబోధనే శబ్దస్తో.]శబ్దమువంటిదిగాఁ దెలుఁగు
'ర'అనున దవ్యయముగా నెన్నఁదగును. 'ర' యనునదే కాకువుతో 'ర
యని యగు ననఁదగును. 'ఏమిర'- ఇత్యాదులలో రవర్ణము నీచత్వాదుల
బోధించునే కాని వచ్చుధాత్వర్థమును (రమ్ము ఇత్యాదిగాఁ) దెల్పదు.

అర్థవిశేషద్యోతకము లగు ననుటలో వీరును "రమ్ము" అనున
ముందు నని తలఁపలే దనవచ్చు. అట్టియెడల నివి వచ్చుధాతునిష్పన
ములుగాఁ జెప్పవలసినయవసరము శబ్దశాస్త్రమున లేదు.

ఇఁక వీరు సూత్రమునఁ జెప్పిన రారా- రార అనువానిలో మొద
'రా'రమ్ముశబ్దమె.దీనికి"ర" అనునవ్యయము పరముగ నుండఁగా రమ్ము-
ర- అనుచో హల్పరకత్వమున మధ్యమమువర్ణకము లోపించి రార అ
యగును. దీనినుండి దీర్ఘముతో "రారా" అని యేర్పడు.ఇటఁ బూర్వశబ్ద
నెడ "రమ్ము" అనునర్థమును సరిపడుట గమనింపఁదగును.

"ఒక్కటిప్రత్యేకముగాఁ బ్రయుక్త మగునపుడు హ్రస్వాకార మ
దదు. ర-రమ్ము- అని వాడరాదు." [వ్యా.సం.స.1421] దీనినిబట్టియు

యనుదానిని కాదు.... ఆ అనురీతి నేర్పడినట్లు చెప్పరాదు. కాని వీరు కాదా-కదా -కా యన్నవి గూడ శబ్దములఁజంటగాఁ జెప్పిరి గదా. కదయ్య కదవె యన్నవి శబ్దత్రికము గలవి. ప్రార్థనార్థమున శబ్దత్రికమె కాననగు. వినఁగదయ్య [వినుము] అనునర్థమున వినఁగాదా, వినఁగదా, వినఁగా అనురీతిని ప్రయుక్తములు గా వనుట స్పష్టము. నేఁడు గదా, నేఁడుగా యనుచోట్లఁ బ్రార్థనార్థక మగునా?

'కాదా' యన్నది కాదు + ఆ యని యేర్పడె ననుట స్పష్టమె. ఇట్లేర్పడిన కాదా యన్నది ప్రశ్నార్థకమై తద్వ్యతిరేకార్థమును (అవును) వ్యక్తము చేయును- కదా. కద, కా- యనువానియం దర్థక్రమ మిట్లు లేకుండుట గమనార్హము. కావున నివి చారిత్రకముగా నె ట్లేర్పడినను, శబ్దశాస్త్రము ననుసరించి కాదు శబ్దమునుండి యేర్పడినవిగాఁ జెప్పకుండుటయె యుచిత మనిపించు. ప్రసిద్ధ్యాదులను బోధించు నివి(కద,కా) ప్రత్యేక మగు నవ్యయము లనుట యొప్పును.

## కదవె-కదరె :

"కదా. కద మున్నగువానిపై వె-రె అనునవి నిల్చుటయుఁ గలదు. చెప్పఁగదవె, జయింపఁగదవయ్య (ఉ.375) ఇందు రెండువిశేషము లున్నవి. కదతోపాటు కదా యనుదానిపైఁ గూడ వె,రె నిల్చు ననిరి. కాని కదావె. కదారె యన్న వుదాహరింపలేదు. అట్టివి భాషలో లే వనవచ్చును. 'మున్నగువానిపై' ననిరి. కాని యవి యేవియో చెప్పలేదు. ఉదాహరింపను లేదు. 'కద'పై నయినందుకు మాత్రమె యుదాహరించిరి, (అఁటవె-అరఁటరె?)

వె, రె అనునవి నిల్చు నన్నవీరు 'కదవయ్య యనునది గూడఁ జూపుట విశేషము. ముమ్మరం బయ్యెఁ గదవమ్మ, కూర్చఁగదరయ్య ఎంతడలెనొ కదరమ్మ(వ్యా.సం.స.1425) అన్నవియు సం.లోఁ బ్రదర్శించిరి.

ఇట వయ్య, రయ్య, వమ్మ, రమ్మ యన్నవి నిల్చు నని చెప్పుదురా? లేక కదవె+అయ్య కదవయ్య, కదరె+అమ్మ కదరమ్మ అని యగు నందురా? శ.ర. కదరె- కద+రె అని విభాగింపఁగా నది సరి గా దని వీరు కద+ర+ఎ- అని ఛేదము చూపుట యుక్త' (వ్యా.సం.స.1425) మనిరి. కాని యయుక్త మన్న శ ర.విభాగమునె యిట వీరును బేర్కొనిరి. కద+ర+ఎ అను వీ రూహించినవిభాగము సైతము యుక్త మని నిర్ణయింపరాకున్నది. పాఠీ యయ్య, మున్నగురీతిగా నిట సంధి లేకున్న కదరయయ్య యని యొకపక్షమున నగు నేమో యనుసందేహమున కవకాశము గల్గు. ఇట్లు పైని జూపినచో కదవె యయ్య మొ॥ (కద+ఎ-కదె) అయ్య నింతకంటె ఎదాడులకు ముందు వురులు లేదా వకారరేఫములు చేరుటయుఁ గల దని చెప్పుట యుక్తము గదా.

వె, రె యనునవి నిల్చు నని వీరు సామాన్యముగాఁ జెప్పిరి గాని వీని భేదము గమనింపవలె. కావఁగదరయ్య రామచంద్ర, రక్షింపఁగదవయ్య దేవతలారా అనుట లేదు. కాఁగా 'వె' యన్నది యేకత్వమునను, రె యన్నది బహుత్వమునను గల దనవలె. (సూరి వృజీ విధాన మచ్చోటనె కాక భాషాలక్షణ మైయితరత్ర గూడఁ దగుచు సూరి యీయంశమును గుర్తించుట ప్రశంసార్హ మగుచున్నది.)

ఈయంశములు కొన్ని ప్రస్తావించిన ప్రౌఢ.క్రి.9,28,29సూత్రములను ఉ.లోఁ గూడ వయులవారు సూచించిన బాగుండెడిది.

పో-లే :

'పొమ్ము-పో నిశ్చయార్థకములు' (ఉ.375) పొమ్ము నిశ్చయార్థంబు నం దగు నని ప్రౌఢ (వాక్య.22)చెప్పె. వీరు పో అనుదానిం గూడఁ జెప్పుట విశేషము. వచ్చెఁ బో యిక్కరణిన్ (సూ.ని.) అని స్వరపరకత్వమున ములోపము గలదు. దానిని వీ రంగీకరించిరి. కాన వీరు 'పొమ్ము' ఒక్కటి

చెప్పినఁ జాలు. పొమ్ము మధ్యమపురుషక్రియ కా దని వీరును జెప్పిరు [వ్యా.సం.స.1428) గదా.

అయెలె- అయలె (అయ్యెను గదా.) (ఉ.372) 'లే' యనుదానికి హ్రస్వము నగుట విశేషము. ఇది కదార్థక మగు నని వివరణమునుబట్టి యూహింపవలె. బౌలె మున్నగుచోట్ల నిది నిశ్చయమును సైతము దెల్పు.

కాని యివి శబ్దములజంటలు గాకుండుట గమనింపవలె. కొన్ని శబ్దము జంటలు ప్రార్థనాద్యర్థకము లగు నని కదా వీరు లక్షణము చేసిరి. ఇట, పో, మొదలగునవి జంటలు గావు. చేయఁబో మొత్తము నుద్దేశింప రాదు గదా.

ప్రార్థనార్థము నుద్దేశించుటవలనఁ గాఁబోలును వీ రీవాని నిటఁ బ్రస్తావించిరి. కాని, పో, ప్రభృతుల కిటఁ బ్రసక్తి గానరాదు.

## టవర్ణకలోపము :

టవర్ణకంబు భావంబునం దగు (35) ననుదాని నట్ల (ఉ.46) గ్రహించిరి. విశేషము-

'చేయుకంటెన్- మున్నగునవి చేయుటకంటెన్ మున్నగువాని రూపాంతరము లని యాధునికవ్యాకర్తలు సూత్రించినను (ప్రౌఢ.క్రి.14) నది ప్రాచీనసమ్మతము గాదు. అది చేయుదానికంటెన్ మున్నగువానిరూపాంతరములు' (ఉ.376) అథర్వణుఁడు 'విభక్తిమాత్రం సర్వత్ర మహితం స్యాట్టవర్ణకా' త్తని చెప్పుట యిందుకు మూలము. (వ్యా.సం.స.1433). కావున టవర్ణకము లోపించినను ప్రౌఢ.ప్రక్రియ సరి గా దనవలె. అథర్వణోక్తికి భిన్నముగా వీరు చెప్పవచ్చును. ప్రాచీనసమ్మతి యెల్లయెడల నుండవలె నంట విచార్యము.

'పాలించుకొఱకు' ఇత్యాదులలోఁ బాలించుదానికొఱకు అనుదాని కంటె పాలించుటకొఱకు నని యర్థము చేయుట సూటిగ నుండు ననక

తప్పదు. అందుకే ప్రౌఢ. 'కన్నకంటె'నిత్యాదిస్థలముల నమహత్తచ్ఛబ్దలోప మును జెప్పియు (క్రి 21) నిట కొఱకుకంటెపొంటెలపరకత్వమున 'ట'లోపమును జెప్పియుండు. అయ్యు నది లక్ష్యసంగ్రాహకముగాఁ దోఁపదు.

సుతులం గనియెడుకొఱకు (వ్యా.సం.స.1434) అనుచో 'ట'లోప మైన దనుట కవకాశ మేది? ఇట్టి వింకను గానవచ్చును.

విశ్వామిత్రుని వాఁ డయ్యెడుకొఱకును (హరి.పూ.2.42) ఊర్వశి గనంగ నరిగెడుకొఱకై (భాగ.9.420) నింద దప్పెడుకొఱకై (భాగ.10.ఉ.70) వ్యవహారలక్షణం బెఱిఁగెడుకొఱకు (భోజ.1.59) ఘోరదురి తంబు నీగెడుకొఱకు (భోజ.7.31) దాన నొకంగము దాచుచేతనో (అము.2.33) ఇది చాగెడుకొఱకై (సిం.11.145) పన్నిద మాడిన కోఁమ (వైజ.3.96) పోయెడికొఱకు (రం.రా.299పుట) మొ॥

ఇట్టి వెల్ల సంగ్రహింపఁబడునట్లుగా నిట 'ట'లోపమును గాక యమహత్తచ్ఛబ్దలోపము చెప్పనగు ననువరులవారియభిప్రాయ ముచితము గనె తోఁచు. కాని యదియు గౌరవమె యనిపించు. (ఇటఁ దచ్ఛబ్దలోప మనుటచే) ఇవి యెల్ల ధా.వి.లుగా గుర్తింపఁదగును. ధా.వి.లకు విభక్తి వివక్షించినపుడు తచ్ఛబ్ద మనుప్రయుక్తముగాఁ జెప్పఁబడినది. అట్టియను ప్రయోగము [అమహదర్థమునఁ] గొన్నియెడల లే దనియు నట ధా.వి. లపై సరాసరిగా కొఱకుప్రభృతివిభక్తులు కొన్ని చేరుట గల దనియుఁ జెప్పిన నివ్వానిప్రక్రియ లాఘవముతో సిద్ధించును. కావున నిటఁ ప్రౌఢ. క్రియా.14,చేఁ గొన్నియెడల టవర్ణకమును, 21చేఁ గొన్నియెడల నమ హత్తచ్ఛబ్దమును లోపించు ననుటకంటె వరులవా రెల్లయెడలఁ దచ్ఛబ్దము లోపించుననుటకంటె నిట ధా.వి.లకుఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తము గాలే దనుటయె యుచిత మని గుర్తింపఁదగును.

## భావార్థము-డువర్ణము :

చేయుట మున్నగువానిరూపాంతరములుగ చేయుడు మున్నగునవి కొన్ని కవిప్రయోగములం దగపడుచున్నవి. -చేయుడు- ఆది.7.16. ఓర్చుడు- కు.1.177 --(ఉ 376) నేc డీడుప్రత్యయము భావార్థమునc గానరాదు. 'చెప్పుడును' ఇత్యాదిగా ద్రుతాంత మగుడువర్ణ మానంతర్యార్థకము. కావునc బ్రాచీనప్రయోగములం దరుదుగc గాననవునీయంశమును విశేషముగా గుర్తింపవచ్చును.వరులవా రైనను బ్రత్యేకముగా భావార్థములు [సూరివలె టవర్ణకమునే కాని] డువర్ణమును విధింపలేదు గదా. వివరణమునc జూపుట యుక్తమె.

కాని ప్రాచీనప్రయోగముల నైనను దత్సమధాతువులపైడువర్ణమిట్లుగానరాదు.ఆకర్షించుడు[ఆకర్షించుట] ఇత్యాదులు గానరావు. అయ్యు ఎక్కుడు క్రుమ్మడు (బాల.కృత్.20) అనుచోటిడువర్ణముతో దీనికి సామ్యము మృగ్యము. [చెప్పుడుమాటలు?] ఇది టవర్ణకమువంటి దన్నను చేయుటలు ఇత్యాదిగా చేయుడులు, చేయుడుకొఱకు అనురీతిగా నీడువర్ణముపై నితరవిభక్తులు గానరాకుంటయు గమనార్హము. ఇట్లివి యెల్ల తెలుగుల విశిష్టములుగాcదోcచు. చూ. భావార్థకము- ఆనంతర్యార్థము.

## భావార్థము-కజి :

'కజివర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు (36) ననుసూరిలక్షణమును వీరు దమగ్రంథమునc దొలcగించిరి.

'సూరి కజివర్ణకంబు --- మునుపు ముందు మున్ను తొల్లి అనురీతి పురార్థకంబులు అని సూత్రించి యుదాహరించెను. ఇది సరి కాదు --వ్యతిరేకక్త్వార్థకము- -(ఉ.377) అనురీతివి పురార్థకంబు' లనుమాటలు సూరిగ్రంథమున లేవు. -వివరణప్రాయముగా వీరు గలిపియుందురు.

ఇcక నీకజి వ్యతిరేకక్త్వార్థకమె యని యిట్లు వివరించిరి.'క్రుంకకయ

మున్న - అనుచో క్రుంకకుండుమున్న అని యుండుధాతురూపాధ్యాహారముచే సమానకర్తృకత సిద్ధించుచున్నది. కొన్నియెడల ని ట్లుండుధాతురూపాధ్యాహారము లేకయె యుండుధాతుప్రయోగమే వెలయుచున్నది. క్రుంకకుండు మున్న [ద్రో.2.281] [ఉ.381] దీనినిబట్టి యిచ్చటికజి వ్యతిరేకక్త్వార్థముగా నన్వయింపవలయు నన్న నుండుధాతురూపము నధ్యాహారము చేసికొనవలె నన్నమాట.

ఉండుధాతుజవిశేషణ [వ్యా.సం.స.1441] రూపము నధ్యాహారము చేసి సాధించున దేమి? సమానకర్తృకత యేమో యని వీరివివరణము వలనఁ దోఁచుచున్నది. సమానకర్తృకత లేదు గావున కజి ప్రాప్తింపక పోవుటచే నిట్లు సూరి సూత్రించెనా? ఆ'కజి' వ్యతిరేకక్త్వార్థమునం దగునది గాఁగా నిట 'భావమునందుఁ' జెప్పఁబడినది. వ్యతిరేకక్త్వార్థకమైన కజి భావార్థకము నగుటయుఁ గాని,లేదా ప్రస్తుతస్థలమున సూరి చెప్పినట్లు భావార్థము గాక వ్యతిరేకక్త్వార్థమే యున్న దని గాని చెప్పుచో నపుడే యీసూరి విధాన మనవసరము గాఁగలదు. కాని వీ ర ట్లాలోచించినట్లు దోఁపకున్నది.

వీరే "వండకమునుపు అనుదానిలోనివండకశబ్దమునకు వండుటకు అనియే యర్థము. పేటికావ్యాఖ్యత 'వంటచేయుటకు ముందు వంట చేయకుండుటయే యుండెడిఁ గాన వ్యతిరేకరూపప్రయోగము తోఁచుట సహజము అని కేవలము పొరపాటుగా వ్రాసెను. వండకమునుపు అనుదానిలోనివండక శబ్దము భావార్థకమె కాని వ్యతిరేకార్థకము గాదు. ఈసూత్రమునందలికజి భావార్థమున విధింపఁబడినదే --(వ్యా.సం.స.1441)అనిఇచ్చటికజివ్యతిరేకార్థకము గా దనియు సూరి సూత్రమునఁ జెప్పినట్లు భావార్థకమె యనియు సముచితముగాఁ జెప్పిరి. పేటికను విమర్శించుటలో సూరిభావార్థమం దనుట సమంజస మనియుఁ జక్కగా నిరూపించిరి. వ్యతిరేకక్త్వార్థమునందు కజి వేరుగా విధింపఁబడినను నిచట భావార్థమె కలదు గావున భావార్థమందలికజిని వేఱుగా సూత్రించుట యసంగత మను టెట్లు?

వీరి వివరణమునకె విరుద్ధముగా నిది వ్యతిరేకార్థక మని (వ్యతిరేక క్త్వార్థకము) దీనిని వేఱ సూత్రింప నవసరము లే దనుట సక్రమమా?

కాఁగా నర్థము ననుసరించిన సూరివిధానము సముచితమె యని వీరివివరణమె స్పష్టము చేయుచున్నది. అయిన వీరే యేల యీసూరివిధానమును దిరస్కరించిరి?

నన్నయాథర్వణులు భావార్థమున కజీని విధింపకపోవుట యొకకారణము గావచ్చును."కజీని వ్యతిరేక క్త్వార్థకకజీగానే యంగీకరించి యయ్యది ఉండు అనునధ్యాహార్యధాతుజవిశేషణముతో నన్వయించునట్లు సమన్వయించుకొని సమర్థించుట యుక్త మనియుఁ దోఁచెడిని. ఇట్టియభిప్రాయము కలవాఁడగుటచేతనెకావలయు నథర్వణాచార్యుఁడు వేఱుగ దీని నుపదేశింపఁడయ్యె. అథర్వణాచార్యుఁడే గాక ప్రాచీను లెవ్వరు నిట్టిసూరిపద్ధతి నుపదేశింపలేదు. (వ్యా.సం.న.1440)

ఇట్టికజీని సాధించులక్షణము నేర్పఱుపఁగా నది వల దని తిరస్కరించి' యెదియో మార్గమున 'సమర్థించుట' యేలకో యర్థము గాదు.

వ్యతిరేక క్త్వార్థమున విధింపఁబడినకజీ యెట్లు సాధింపఁగలమా యనియె కాని యిట నర్థము నది సాధింపఁగలదా యని వీరు ప్రముఖముగాఁ దలఁపలే దనిపించు.

'ఉండు' అధ్యాహార మనుట యొక్కటి సాధారణముగాసాధించులక్షణమును దిరస్కరించి 'యధ్యాహారము' దెచ్చిపెట్టుకొను టేల? పైఁగా నీ పద్ధతియథర్వణుఁడు నుపదేశించియుండు నని యూహించుట యింకను నసంగత మైయున్నది.

అథర్వణుఁడు అధ్యాహారస్య సంయోగ స్త్వత్ర నైవ సుఖావహః అని యధ్యాహార పద్ధతి నామోదింపలేదు. వీరివాఖ్యానపద్ధతి ననుసరించిన ప్రస్తుతవివరణము నన్నయాథర్వణసమ్మతము గాదు సరి గదా విరుద్ధ

మనియుఁ జెప్పవలసియున్నది. కాని పీ రీకారికావివరణమున సుఖావహము గా దనుటచే ననఁగా నిషేధింపఁబడకుండుటచేతఁ గ్వాచిత్కముగా సుఖావహ మగునధ్యాహార ముండిన నుండు ననుసర్థము తోఁచుచున్న' [వ్యా.సం.స.1102] దనిరి. 'నైవ సుఖావహః' అని 'ఏవ'శబ్దముతోఁ జెప్పఁగాఁ గ్వాచిత్కముగా సుఖావహమే యని యర్థము తోఁచుటవింతయే. ప్రౌఢ. చెప్పినయధ్యాహారస్థలము లెల్ల సుఖావహములే యనిరి. అవుఁ గాక. అది యథర్వణసమ్మత మని చెప్పఁబూనుట యుచితమా? కాఁగా నిట నుండుధాతురూప మధ్యాహార్యమె యని యథర్వణుఁడు తలఁచె నను నూహ విశ్వసనీయముగా లే దనక తప్పదు.

అవసర మైనఁ బూర్వులు సమ్మతింపలే దనియే నుపేక్షింపఁ బని లేదు. కాని యిట నధ్యాహార మవసరమా? అన్వయమున ననుపపత్తి యేర్పడిన నధ్యాహారము చేసికొనవలె. క్రుంకకముందు. వండక మునుపు ఇత్యాదులలో నన్వయమున కనుపపత్తి యేర్పడినదా?

క్రుంకకుండుమున్న, పూవకుండఁగా మున్న అనుచో 'నుండు' ప్రయుక్త మైనది. కాని యిది ప్రత్యేకముగా నన్వయించుచున్నదా యని సందేహము.

పూవక ఉండఁగాన్- మున్న- వికసింపక యల్లే యుండఁగా దానికి మును పని యర్థము. దీనికి వికసించుటకు మును పని యర్థమా లేక వికసింపకుండుటకు మును పని యర్థమా? ఇట 'నుండఁగా' నన్నది స్వతంత్రముగా నర్థవంత మై వాక్యమం దన్వయించు నన్నపుడే యన్వయము క్లిష్ట మగుచు నుద్దిష్టార్థము సరిగా సిద్ధించుట లే దనిపించుచున్నది.

క్రుంక కుండుమున్న- ఉండు అనునది ధా.వి.గా [సం.లో] వీరును జెప్పిరి. అపు డీరూప మెట్లు దీనివలనఁ గదా సమానకర్తృకత సిద్ధించు నందురు వీరు. అట్టియెడలఁ గ్రుంకుటకు, నుండుటకు నొక్కటియ కర్త. తోయజమిత్రుఁడు. కావున 'ఉండు అనుధా.వి. కాఁగా విభక్తి

కావలె. తోయజమిత్రుఁడు క్రుంకక యుండువాఁడు. [క్రుంకక] ఉండువానికి మున్ను-ఉండుమున్ను అని సమాసమునమహత్తచ్ఛబ్దము లోపించిన దన్న మాట. [వీరిప్రక్రియలో నిది కష్టమె] అపుడు దీనియర్థ మేమి? క్రుంకక యుండు వాఁ డైనతోయజమిత్రునికి మున్ను అనియా? ఇది యుచితమా? క్రుంకక యుండుటకు మున్ను అని భావార్థము సరిపడును. ఇట 'నుండు' అనుప్రయుక్తముగాఁ జెప్పు టుచితముగాఁ దోఁచు. అపుడే క్రుంకకుండు మున్ను -క్రుంకుటకు మున్ను, పూవకుండఁగా మును- పూచుటకు మును నని యర్థము సులువుగాఁ గుదురు.

ఉండుధాతురూపములు ప్రయోగింపఁబడునపుడే యన్వయించు. లేకుండఁగా, లేనిచోట్ల నధ్యాహారము చేయవలయు నను టుచితమా?ఉండి, ఉంచి అధ్యాహారము చేసినవపక్షులవారిప్రక్రియామార్గములోనియిబ్బందులు కొన్ని యిటను గమనింపవచ్చును. (చూ.కార.) వారు గానక ముందర (విరా.4.64) మున్నుగా వీరు చూపినవానియన్నింట నుండుధాతురూప మును దెచ్చిపెట్టుకొన్న నన్వయము క్లిష్టమే. కానకఉండుటకు ముందర వివక్షలోఁ దచ్ఛబ్ద మనుప్రయుక్త మైె మహదర్థమున 'ఉండువాఁడు' అని అని యుండురూపము నన్వయించుచోఁ 'గనినప్పు' డని యర్థ మగు నేమో యనిపించు. కాక పిదప నెప్పుడు గాన లే దనియు నర్థము గానవచ్చును. ఏ మైన నిట నవ్వయము సహజముగా లేమి స్పష్టము.

'వండక' యన్నది భావార్థకమె యయ్యుఁ బురార్థకముతో నన్వ యించునపుడు వ్యతిరేకార్థము స్ఫూర్తి గల్గినఁ గల్గ నగు నని వీర పేర్కొ నిరి. (వ్యా.సం.స.1441) అన్వయమునకై యుండుశబ్దమును దెచ్చికొన్న నట్టివ్యతిరేకార్థస్ఫూర్తి యుండ దేమో.ఉన్న నర్థమువిపరీత మగును గదా.

వచ్చియుండక మున్ను- వచ్చియుండక యుండుమున్ను- అను

రీతిగా నీయన్వయ మెంతసహజముగా నుండునో చెప్పఁ బని యేమి?

కాఁగా వక్షులవారిసమన్వయమును సముచితముగా లేమింజేసియు బా.సా.పే.ను విమర్శించుచు నిది భావార్థకమె కాని వ్యతిరేకార్థకము గా దని వీరే పేర్కొన్నదాని ననుసరించియు నిట భావార్థమున సూరి కజీని విధించుట సముచితమె యని స్పష్టము.

మహాకవుల(వ్యా.సం.స.1441)(ప్రయోగముల కనుగుణమైయున్న యీసూరిలక్షణమును వీరు దొలఁగించుట సరి కాదు.

## మిజీ :

'వ్యతిరేకభావంబున మిజీ యగు'(37) ననుదాని నట్ల గ్రహించిరి. (ఉ.45)

'మిజీ' జీత్తు గాన బా.క్రియా.20సూత్రముచొప్పున ధాతూకారమున కాదేశముగా అకారము వచ్చును' (వ్యా.సం.స,1448) అని స్పష్టము చేసినవక్షులవా రిట 'వండు + అ + మి-వండమి ఇట్లే పండు+అ+మి-పండమి- అనురీతిగా ధాతూకారమునకుఁ బరముగా నత్తును జూపుట పొరపాటు. పీ రిట్లే 'ధాతువుతుదిఉకారమునకు అకారదేశ మగును. వండు+అ+క- వండుక (1455), వండు+అనివాడు (1487) కొట్టు+అనుపడు (1497) అనురీతిగా స్థలాంతరములందును (బ్రెక్కిటఁ) జూపుట సమంజసముగా లేదు.

## క్త్వార్థకము :

'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దిపర్ణకం బగు' (35) ననుసూత్రలక్షణమున (సంస్కృతానుసారముగా) సమానకర్తృకంబులం బూర్వకాలంబునందు 'ఇ' వర్ణకం బగు (ఉ.49) సని సవరించిరి. సమాన కర్తృకము లనక సమానాశ్రయము లనుట ప్రయోజనము నుద్దేశించియే యని సూరి వివరించెను.

దీనింగూర్చి వఝులవారు- -చైత్రునిచేతఁ గొట్టఁబడి మడిసె-మున్నగుచోటులందు సమానకర్తృకత్వము కుదురపడ దనుచు సూరి 'సమానాశ్రయంబులన్' అని సూత్రించెను. కాని యీసూరిసూత్రము నుజ్యంతాదిస్థలములం దతివ్యాప్త మగుచున్నది. చైత్రునిచేతఁ గొట్టఁబడఁగా మైత్రుండు మడిసె. చైత్రునిచేతఁ గొట్టఁబడియున్నమైత్రుఁడు మడిసె. అని యిట్లు ఉండుధాతురూపాధ్యాహారముచే నేకకర్తృకత్వము గల్గుచునే యున్నది' (ఉ.380) యని సూరిలక్షణమున నతివ్యాప్తిని జూపిరి. దానిని వారించుటకే వీరు 'సమానకర్తృకము లనిరా? అయిన నతివ్యాప్తి వారింపఁబడినదా? ఇప్రత్యయ మయినపుడే యుండుధాతురూపము నధ్యాహారము చేయవలెనా? సూత్రమున సమానకర్తృకము లనుటచే నట్లు సమానకర్తృకత్వము సిద్ధించుటకే యధ్యాహరింపవలె. అట్లు సూత్రింప నేల? అందుకై యధ్యాహారము చేయ నేల? సూరి 'సమానాశ్రయము' లనుట యుక్త మని వీరి యీవివరణముచేతనె తెలియవచ్చును.

అసలు సూరిలక్షణ మతివ్యాప్త మనుటకు కొట్టంబడి మడిసె, కొట్టఁబడఁగామడిసె' సమానస్థలములా? 'కొట్టంబడిమడిసె' ననుచో ముందు కొట్టఁబడుటయుఁ బిదప మడియుటయు నర్థము. కొట్టుట, మడియుట యనురెండుక్రియలలోఁ బూర్వకాలిక మైన 'కొట్టఁబడు'అనుదానికి ఇప్రత్యయమె రావలె. అట్ల వచ్చినది. 'కొట్టంబడఁగా మడిసె' ననుచో కొట్టుటఁ బూర్వకాలికమె యయ్యును, కొట్టఁబడుటచే మడిసె నని యర్థము. 'వసుదేవుఁ డుండగ వృద్ధని పూజించితే' అనుస్థలములందువలె భావలక్షణార్థము విశేషము. కావున నాయర్థమున నుజియే యగును. నుజి యగుచోట్ల 'ఇ'ప్రత్యయ మందువలననే కలుగదు. కాన నిట నతివ్యాప్తిదోష మున్న దనుట సరి కాదు. కొట్టఁబడిమడిసె, కొట్టఁబడఁగా మడిసె. ననుచోట్లు సమానార్థకములు గాకుంటయె యీయంశమును స్పష్టము చేయఁజాలుచున్నవి.

అడు లస్పష్టములు గాఁగా -చైత్రుండు వండన్ బోయెను. అనుచో

దుమర్థమున దీనికిఁ బ్రసక్తియే లేదు. (వ్యా.సం.స.1457) చైత్రు
వందు నతిథి వచ్చెను అనుచో సమానాశ్రయత్వము లేదు. ఇవ త్త్వ వీ
జిస్థలముల నతివ్యాప్తి మగుప్రశ్నయే లేదు. ఉండుధాతురూపాధ్యాహ
మును సంస్కృతానుసారముగనె వఝలవారు చెప్పిరి. (వ్యా.సం.స.144
అట్టియధ్యాహారమునవసరము లేకయె సూరి యిప్రత్యయము సాధిం
చుండఁగా నది తిరస్కరించి యధ్యాహారముపద్ధతి నాశ్రయింప నేల? స
ఉక్తార్థమందుఁ దెలుఁగునఁ బ్రత్యేకముగాఁ బ్రథమ విధించినస్థలము
స్మరింపఁదగును.

అయినను 'వ్యాకరణముతో విరోధ మేర్పడినపుడు దానిని దొ
గించుటకై సంస్కృతపండితు లట సధ్యాహారమార్గ మవలంచిం
(వ్యా.సం.స.1418) గదా. ఇట వ్యాకరణమే యవిరుద్ధముగాఁ జెప్పుచుఁ
దానిని దిరస్కరించి విరోధమును దెచ్చిపెట్టుకొని దానిని వారించుట
యధ్యాహారమార్గము నాశ్రయింప నేల? ఉండుధాతురూపము నధ్యాహార
చేయకయు నన్వయమునం దనుపపత్తి లేకుండఁగా నర్థము సిద్ధించుచున్న
గదా.

తెలుఁగున నేవి 'రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడిఁ
నిత్యాదులం దవసర మైన నిట్టియధ్యాహారము చేయుదురు గాక- (అదియ
బరిశీలింపవలె)సూరి యుదాహరించిన 'కొట్టంబడి మడిసె' ననుచో టట్టిద
ఇటఁ గూడ నధ్యాహారము చేయుచోఁ దెలుఁగున గర్మార్థకవాక్యము
నిట్టిచో నెల్లెడల నియతముగా నధ్యాహారము చేయవలె. ఇది తెలుఁ
నందలిప్రత్యేకస్థితి కావుననె సూరి సమానాశ్రయము లనుటకుఁ బ్రయోజ
ముగా నీవాక్యము నుదాహరించియుండవచ్చును.

దీనిని గుర్తించి గు.ప్ర. 'సంస్కృతంబులో నీవాక్యంబు(కొట్టంబ
మడిసె) తెలుఁగునందువలె వచింప వలనుపడదు'అనుటను దిరస్కరించు
వఝలవారు"బాలవ్యాకర్త గాని తద్వ్యాఖ్యాతలు గాని--సంస్కృతమందు

ట్టియెడల క్త్వాప్రత్యయముతోడిప్రయోగముసమ్మతమెయని గ్రహింపరై '
ని (వ్యా.సం.స.1452) విమర్శించిరి. ఇట్టిసంస్కృతవాక్యములు తాము
హపితి మనిరి గాని యది సరి కాదు. ఇట బాలవ్యాకర్తయుఁ దద్వ్యాఖ్యాతలు
ు జూపినది కర్మార్థకవాక్యము. వీ రట్టి దొక్కటియుఁ జూపలేదు. (వ్యా.
ం.స.1449) బహుశః ఉండు(స్థిత)శబ్దాధ్యాహారము సంస్కృతమునను
ల దని యుదాహరించుటయే యిది యని తలఁచి రేమో. వీ రిటఁ బ్రధాన
ుగాఁ జూచినది ఉండురూపాధ్యాహారము, సమానకర్తృకతాసాధనము
మాత్రమె. కావుననె సూరిప్రభృతులయుదాహరణములకును తా మిచ్చిన
సంస్కృతప్రయోగములకును గలప్రధానమైనభేదమును వీరు పట్టించుకొనలే
రనవచ్చును.

సంస్కృతమున నిట్టికర్మణివాక్యముల క్త్వాప్రత్యయము గలుగుటయే
ాసఁగదు. చైత్రేణ తాడితో మైత్రో మమార' అనురీతినే యుండును
అన్న గు.ప్ర.(407) వచనములు గమనార్హములు. వరులవారైన నెట
ుండి యుదాహరింతురు? కావున నిది తెలుఁగువాక్యములో సంస్కృతవిల
క్షణ మగుప్రత్యేకతయె. సంస్కృతమున నిట్టిచోట్ల క్త్వాప్రత్యయమెలేకుండ
నట్టిచోట్ల నిట్టియధ్యాహారము సంస్కృతమునఁ గల దనుట యెట్లు? తెలుఁ
గులోనియీప్రత్యేకతను దృష్టియం దుంచుకొని యిట్టియెడల నియతముగా
నధ్యాహారము చేసికొనవలసినయవసరము దప్పించినసూరిలక్షణము సూక్త
మై యుండ నది తిరస్కరించుట యసమంజసము. సూరిమార్గమువలన "సమా
నకర్తృకత్వపునిర్వాహమునకయి పెక్కుచోటులందు ఉండుధాతురూపము
లధ్యాహార్యములు (ఉ.379) గావలసినయవసరము తప్పుట ప్రశంసార్హ
మైయున్నది.

'అధ్యాహారసంయోగస్త్వత్ర నైవ సుఖావహః' అని యథర్వణుఁడు
పేర్కొన్న వీరు విశేషముగాఁ గ్వాచిత్కముగా సుఖావహ మని వ్యాఖ్యా

నించి యిటఁ బెక్కుచోట్ల నది కల్పించుటలో నన్నయాథర్వణసమ్మతి పై విచారింపకుంట విశేషమే.

రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడియె ననుస్థలమునందును 'తెగియున్న దేహము ధరణిఁ బడియె అనురీతిని ఉన్న శబ్దాధ్యాహారముచే సమర్థిత మగుచున్నది' (వ్యా.సం.స.1452) అనుట యుక్తముగాఁ దోఁపదు. (పుత్రం దృష్ట్వా సుఖం భవతి- యనురీతిదానికంటె నిది భిన్నము.)

కంఠము తెగియున్న దేహము ధరణిఁ బడె ననుచో నస లాదేహము మొదలే కంఠము తెగియున్నదనియునట్టికంఠము లేనిదేహముక్రిందఁ బడిన దనియునర్థమగుచున్నది. 'అమరారిమర్దనుఁడు చక్రముగ్రక్కననేయ రాహు కంఠము దెగిదేహము ధరణిఁబడియెఁ దన్ముఖమమృతస్పర్శముననక్షయంబై నిలిచెన్' అనుచో (నాతనిముఖ మక్షయముగా నిల్చియే యున్నది.) విష్ణు చక్రమువలన ముందుగా కంఠము తెగి పిదప దేహము ధరణిని బడిన దనియే యర్థము. ఉన్నశబ్దము నధ్యాహారము చేసిన నంతకుముందే కంఠము తెగియున్న దేహము విష్ణునిచక్రముచే నేలపైఁ బడిన దనురీతిగా నర్థము తోఁచుచున్నది. ఇది యుచితము గాదు గదా. ఇట సూరిలక్షణమున సమానాశ్రయత్వముచే 'ఇ'ప్రత్యయ మైనట్లు చెప్పఁదగు.

భీము గదాహతిఁ గూలి యాతనిచేత సర్వాంగంబులందును గ్రొన్నె త్తురు కాంతిఁ ద్రావఁబడి మతి తెగటారి పడియున్నవాఁడు దుశ్శాసనుఁడు (స్త్రీ.255) అనునది 'కొట్టంబడి మడిసె' ననుసూరియుదాహృతివంటిదె.

ఎనయంగ నార్నూఱు నేఁబది యేండ్లు సనియె నీ విట వచ్చి సంయమి వర్య (బసవ.3.1154) ఇట ఉండు నధ్యాహారము చేసి యన్వయించిన వచ్చియుండి 650 ఏండ్లయ్యె ననఁగా 650 ఏండ్లనుండి యిటనే యున్న ట్లర్థ మగును. 650 ఏండ్లకుఁ బిదప వచ్చినయర్థము గలుగదు. ఇట సమా

నాశ్రయత్వమును గుదురకున్నది. ఏతేర దొరకని యెన్నియో నాళ్లయ్యె' -నిత్యాదిస్థలములఁబట్టి'ని' ప్రత్యయ మర్థవిశేషములందు నగుట గుర్తింపఁ దగును.

అరు దగునిట్టివిశేషస్థలములు ప్రత్యేకముగా గుర్తింపఁదగియుండఁగా ఇప్రత్యయమును భాషాసామాన్యలక్షణము ననుసరించి'సమానాశ్రయంబులం బూర్వకాలమునందు' విధించినసూరిలక్షణము సూత్తమై యట్లు గ్రహింపఁ దగియున్నది.

## కొని-క్త-:

'ఆత్మనేపదార్థకకొనుధాతుక్త్వార్థకరూప మగు (పట్టు)కొని మున్నగు వానికిఁ బర్యాయములుగ పట్టుక, పట్టుకొ, పట్టుకొన్ అనురీతిని నిల్పుట గలదు. మెడఁబట్టు కొయ్యఁదిరుగన్ --శకు.80 ఇట్టిప్రయోగములు సాధు వు లని విశ్వసింపఁదగదు.(ఉ.380)ఇట్టిరూపములు బాల.సిద్ధములునుగావు. అయ్యు నుపేక్ష్యములా?" ఈప్రయోగములలోఁ గొన్నిప్రామాణికకవిప్రయో గము లున్నవి. వీనిని సూరి కాకున్నను ప్రౌఢవ్యాకర్త యేని సంగ్రహింప కుండుటకుఁ గారణము తోఁపకున్నది (వ్యా.సం.స.1516) యన్న పీ రిటఁ గారణ మేమియుఁ బేర్కొనకయె సాధువులు గా వని నిశ్చయించుట యుచి తమా?

పైఁగా 'ప్రాచీనప్రామాణికగ్రంథములం దిట్టిప్రయోగము లున్నచో నవి ముద్రణసంస్కర్తలచేఁ బ్రక్షిప్తము లనఁదగును -- కాన నట్టియెడల చుప్రత్యయము కవిప్రయుక్త మని విశ్వసింపఁదగును'- (ఉ.380) అని పేర్కొనుట చూడఁగాఁ గవిప్రయోగములను దిద్దివేయవలె నని చెప్పుచుండి రనవలె. సం.లోఁ ప్రామాణికకవిప్రయోగములు గల వన్నపీ రిట నవి ముద్రణసంస్కర్తలు ప్రక్షిప్తములు చేసి రనుట వింత. ఇంకను కొట్టుకు- కొట్టుచు- అని చువర్ణము కవిప్రయుక్త మని విశ్వసింపఁదగు నన్నపీ రిం తకు ముందు సం.లో. చువర్ణముగా ననుమానించియు నమ్మార్గమును దిర

స్కరించి"అనేకస్థలములందు విస్తరించి యున్నయీప్రయోగము కవిప్రయుక్తమే యనుట విశ్వసనీయ మైయున్నది' (వ్యా.సం.స.1517) అని 'కుక' ఇత్యాదిగనె కవిప్రయుక్త మని విశ్వసింపు మనిరి. ఇట నింకొకవిధముగా విశ్వసింపఁదగు ననిరి. వఝులవారిబుద్ధి ననుసరించి కవిప్రయోగములను గూర్చినవిశ్వాసమును మాఱిపోవలయునా?

దీనికి సాధుత్వమును గల్పించు టొప్పును. విశేషముగా నీప్రయోగములను గుర్తించు టే నొప్పును. కూఁతురిని అనురీతివాని నంగీకరించినవీరివి సాధువులు గా వనుటకు సూరి యివి యసాధువులనకుండుట కారణము గాదు గదా.

## మిక్కిలి :

'మిక్కిలుధాతుక్త్వార్థక మగుమిక్కిలిశబ్దము విశేషణముగ నైతము వాడఁబడు నందురు [శ.ర.] వానిమిక్కిలిచేతులు మిక్కిలికన్నుల్ [సభా· 2.57]మిక్కిలు అనుతద్ధర్మవిశేషణమునె నిల్పుట లెస్స' [ఉ.381]

అన నేమి? నన్నయ మిక్కిలి యనియే ప్రయోగించినను దానిని దీసి యట 'మిక్కిలు' అనుతద్ధర్మార్థకవిశేషణమును నిల్పవలె ననియా? వఝులవా రీమార్గమును దఱచుగా ననుసరించినను నది యంగీకార్యము గాదు. ఇట నన్నయ 'మిక్కిలిచేతులును వానిమిక్కిలికన్నున్'అని ప్రయోగించె శ.ర.కూడ నట్లె చూపె.

వఝులవారిపై వివరణమునుబట్టి వారికి'మిక్కిలి' యనునది విశేషణముగా సమ్మతము గా దని యర్థము తోఁచును. దాటించినమిక్కిలున్ [ఉ. హరి.6] అనుదానింబట్టి మిక్కిలుధాతు వంగీకరింపవచ్చును. కాని వీ రట "మిక్కిలి- అధిక మైనది. అనురీతిని విశేషణమును గలదు '-అని చెప్పి యీనన్నయప్రయోగమె చూపిరి. [వ్యా.సం.స.1424] కాఁగా సం.లో నిది విశేషణముగా నంగీకరించియు నిట 'మిక్కిలు' అని యేల నన్నయప్రయో

గమును దిద్దఁబూనిరో. తమయభిప్రాయమును మార్చుకొనిరా? కాని యింకను సం.లో 'పాండవులవిభవ మది యాఖండలువిభవంబుకంటెఁ గడు మిక్కిలి యై' (సభా.2.104) ధేనువు మిక్కిలి మానవులకు (అశ్వ.2.161) (కర మర్థి మిక్కిలి కన్నిచ్చుట (బసవ.వ్యా.సం.స.1454) –అనియుఁ జూపిరి. ఇటఁగూడ దిద్దవలెనా? 'మిక్కిలు' అని నిల్పుట కీస్థలముల్, గుదురదే. నన్నయప్రయోగమునందె పైని 'మిక్కిలు' అనుతద్ధర్మార్థకవిశేషణరూపము నిల్పుద మన్న మిక్కిలున దై యని యుండవలె. పద్య మే మగును. అవ కాశ మున్నమేర దిద్దవలెనా? అవకాశము లేనిచోట మిక్కిలి యనువిశేషణ రూప మంగీకరింపకతప్పదే. అసలు కవిప్రయోగములను దిద్దు టేమి? ఇష్ట మైన సాధింపఁదగును. ఉపేక్షింప కున్న నసాధువు లనుకొందురు గాక స్వేచ్ఛగా దిద్దఁదలఁచుట యొప్పునా?

'మిక్కిలి' విశేషణ మనుట సమంజసమే.

ఇంక నిది మిక్కిలుధాతువు క్త్వార్థకరూప మనువఝులవారియభిప్రాయము నుచితముగాఁ దోఁపదు. శ.ర. మిక్కిలి విశేషణ మన్నను నిట్లు క్త్వార్థకరూప మన్నట్లు గానరాదు. మిక్కిలికంటివేల్పు ఇత్యాదుల నిది సమాసగత మయియు నున్నది.

మిక్కిలు– అతిశయించు, (అధికమగు) మిక్కిలి– అతిశయించి (అధికమయి) అధికము అనునర్థ మెట్లు? 'మిక్కిలు'ధాతురూపము లరుదు. 'మిక్కిలి'శబ్దము ప్రచురప్రయుక్తము–చారిత్రకముగా నిది యె ట్లేర్పడినను 'మిక్కిలి' ప్రత్యేకశబ్దముగాఁ జెప్పుటయే యుచిత మనఁదగు.

కాక చేయు– చేయి, వ్రాయు–వ్రాయి– యనుతీరుగా మిక్కిలు– మిక్కిలి. 'ఇ' అనుకృత్ప్రత్యయ మైన దందమా? (చేయి యనుచోఁ గర్త్రర్థకము వ్రాయి–యనుచోఁ గర్మార్థకము మిక్కిలి అనుచో భావార్థకము) ఇది

యాయావిభక్తులతో మిక్కిలిని, మిక్కిలిచేత ననురీతిగాఁ బ్రయుక్త మయి గానరాదు.

## వ్యతిరేకక్త్వార్థము :

'కజి వ్యతిరేక క్త్వార్థంబునం దగు' (39)ననుదాని నట్ల గ్రహించిరి. (ఉ.50)

ఇటఁ గూడఁ బూర్వసూత్రానుసారిముగాసమానాశ్రయంబులం బూర్వ కాలంబునం దని సూరియభిప్రాయము గాఁగా సమానకర్తృకంబులం బూర్వ కాలంబుం దని వరుులవారియభిప్రాయము. వీరిమతమున నుండుధాతురూపా ధ్యాహారము తప్పదు. అది యనవసర మగుటయు సూరిలక్షణము సూక్త మగుటయుఁ బూర్వము (క్రి.36.సూత్రమునొద్దను) స్పష్టము.

చదువకయును నాకు సర్వవేదంబులు సంభవిల్లవలయు(అర.3.25) చదువక- అనుదానికిఁ గర్త నేనుశబ్దము. సంభవిల్లుట అనుదానికిఁ గర్త సర్వవేదంబులు. ఇట సమానకర్తృకతకయి 'చదువకయున్నను సర్వవేదం బులు సంభవిల్లవలయు నని యుండుధాతురూపాధ్యాహారము చేయుటచే 'ఉన్నన్' అనుదానితో సమానకర్తృకత్వము సిద్ధించినది' (ఉ.381) సూరి మతమున ని ట్లధ్యాహారము చేయఁ బని లేదు. వేదములు చదువకుండుట, వేదములు సంభవిల్లుట అనునవి రెండును 'నేను'అనునొక్కదానినే యాశ్ర యించియుండుటచే సమానాశ్రయము లగువీనిలోఁ బూర్వకాలిక మగుచదువు ధాతువునకు వ్యతిరేకార్థమున కజిప్రత్యయము సూరిలక్షణముచే సామాన్యము గనె సిద్ధించును.

వీ రధ్యాహారము చేయుటయు 'సమానకర్తృకతాసంపాదనమునకే' యని వారివివరణమే నిరూపించుచున్నది. సమానకర్తృకముల నని చెప్పి యది కుదురనిచోట నందుకయి వేఱొకశబ్దము నధ్యాహారము చేసికొనుట కంటె నట్టియవసరము లేకుండఁ జెప్పినసూరిలక్షణ ముచితము. అధ్యాహ

రించుకొన్నను ఉండుధాతురూపములు సరిగా నన్వయింపక 'యనుప్రయుక్త ముల'వలె మాత్రమె గన్పట్టుట గుర్తించియుంటిమి. కాఁగా సూరిమతమే యుచితము.

## చాల-చాలా :

తుమర్థభావలక్షణంబులందు నుజె యగు(40)ననుదాని నట్లు గ్రహించిరి. (ఉ.51)

చాలన్ అనునది చాలుధాతునుజ్యంతరూపమె యయ్యు విశేషణముగా సైతము వాడఁబడుచున్నది. చాల, చాలా శబ్దములు విశేషణత్వమునఁ గళలుగా నగపడును. చాలకాలము (పాండు)-- చాలా [చాలన్]గౌరవమంద [హరి.నూ.6.147] లక్ష్మీనారాయణకోశమున చాల, చాలా విశేషణములుగాఁ జూపఁబడెను [ఉ.382] వీనిని గళలుగాఁ జెప్పవలెనా యని సందేహము. శ.ర,సూ.ని.లు ఇట్లు పేర్కొనలేదు.అందుకే వీరు లక్ష్మీనారాయణకోశము నుద్ధరించియుందురు. చాల నబల- ఆది.6.220 [వ్యా.సం.స.1460] అని యిది ద్రుతాంతమె. చాలకాల మిత్యాదుల సమాసమున ద్రుతము లోపింపఁగా [ఎల్లకలుషము లిత్యాదిగా] నేర్పడినరూపములుగా గుర్తింపఁదగియున్నవి.

ఇంక నిది చాలుధాతునుజ్యంతమా? ప్రత్యేక మగు[ప్రతిపదోక్తమగు]నవ్యయముగాఁ జెప్పఁదగు నని సూ.ని.వలన నూహింపఁదగియున్నది. అర్థమునందుఁ గలభేదమువలన నిది 'చాలు'ధాతునిష్పన్నముగాఁ జెప్పకుంటయె శబ్దశాస్త్రమునఁ దగు నని తోఁచుచున్నది.

'చాలా' అన్నది [లోకవ్యవహారమునఁ గలదు.] కావ్యవ్యవహారమున నున్నదా?చాలా [చాలన్] గౌరవ మంద అనునది వీరు చూపిరి.కాని యిటనే కుండలీకరణమున 'చాలన్' అని చూపుటనుబట్టి యిటఁ జాలా యని యెన్నదని వరులవారును నిశ్చయించినట్లు గానరాదు. సం.లో నీప్రయోగ

'చాలన్ గౌరవమంద' అని చూపిరి. (వ్యా.సం.స.1460) ముద్రితప్రతియం దిది చాల, గౌతుక మంద- నని యున్నది. సూ.ని. అట్లే యుద్ధరించినది. (వఝులవారు 'గౌరవ' మని రది యెక్కడిపాఠమో.] కాఁగా నిది 'చాలా' యనుదానికి నిర్వాహకము గాదు. అందుకే' చాలన్ అన్నది పేర్కొన్న సూ.ని. 'చాలా' పేర్కొనలేదు.

కాఁగాఁ గావ్యవ్యవహారమున నాధారము దొరుకునందనుక చాలా శబ్దము నిట నంగీకరింపఁ బని లేదు. ఇంక లోకవ్యవహారమున సముచ్చయాద్యర్థవిశేషములలో నీదీర్ఘము పెక్కెడలఁ గలదు. ఏమియును- ఏమీ- అన్నయును, దమ్ముఁడును- అన్నాతమ్ముడూ- అట్లే యిట 'చాలా' అని విన్పించు. [దానిని లక్షణబద్ధము చేసి కావ్యప్రయోగార్హత కల్పింపఁదలఁచుచోఁ బెక్కింటి కవకాశము గల్పింపవలె.]

'చాలా' యన్నది కావ్యప్రయుక్తము గాదు గాన దానిప్రసక్తి యనవసరము. చాల నన్నది కళ కాదు. ద్రుతప్రకృతికమె. ఇది చాలు ధాతునుజ్యంతరూపము గాక ప్రత్యేక మగునవ్యయ మను టొప్పు నని గ్రహింపఁదగును.

## చేదర్థము:-అప్యర్థము :

'చేదర్థంబునందు వృత్తం బగుభావలక్షణంబునందు నవర్ణకంబు ద్రుతాంతం బగు'[41] ననుసూరిలక్షణమును వీరు 'చేదర్థంబునందును, నప్యర్థమందును, భూతార్థమందలిభావలక్షణార్థమందును ద్రుతాంతం బగు నవర్ణకం బగు' ననిరి. [ఉ.52సూ] సూరిసూత్రమందలిపదము లటు నిట నగుట యుపేక్షింపఁదగు. ఇంక 'వృత్తంబగుభావలక్షణంబునందున్- భూతార్థక మగుభావలక్షణార్థమందును' [వ్యా.సం.స.1469] అనుచో సూరిసూత్రమందలి 'వృత్తం బగు' అనుదానివివరణమే వీరిలక్షణమందలి 'భూతార్థమందలి- అనునది. కాఁగా నిట సూరిలక్షణమున దురుక్తి లేమి

స్పష్టమే. ఇఁక వీరు దమసూత్రమున నధికముగాఁ జెప్పినది. 'అప్యర్థము' [వ్యా.సం.స.1464]

వినినఁ బఠించిన వ్రాసినఁ గొనియాడిన దురితపీడకుం దొలఁగి(శాంతి.3. 382) అనునది చేదర్థమునకును, అడిచినఁ దిట్టినన్ మఱి మహాపరుషం బులు వల్కి యల్కతోఁ బొడిచినను త్తమద్విజులుపూజ్యులు(ఆది.1.139) అనునది యప్యర్థమునకును నుదాహరించిరి. వినినఁ బఠించినన్ అనుచో వినినచోను,బఠించినచోను అని చెప్పినట్లుగనే, అడచినఁ దిట్టినన్ అనుచోను అడిచినచో, దిట్టినచోను, అని యర్థము చేయవచ్చును. కాని విననిచో దురితపీడదొలఁగదు. అడఁపనిచోఁ దిట్టనిచో ను త్తమద్విజుఁడు పూజ్యుఁడు కాడా? భేదము గల దనిపించు.

చేదర్థమునవలె నప్యర్థమునను నీవిధాన మవసరమే యనిపించు. సూరిసమన్వయమార్గ మేమో యింకను బరిశోధింపవలె.

'న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబు లగు' నని ప్రౌఢ. (వాక్య.13) పేర్కొన్నది. అడిచినఁ దిట్టిన ననునీరీతిస్థలములందు 'నేని' నధ్యాహార్య మన్న అడిచిన నేని- అడచినచో నై నప్పటికిని నను రీతిగా నర్థము గుదురు నేమో.

చాద్యర్థకనుశబ్దముతోడిసమన్వయ ముచితమా? శ్రుత్వాపి- వినినను. శృణోతిచేత్ వినినన్ అనుచోఁ జేదర్థమునఁ జివరిద్రుతముపై లేవియూనిక అప్యర్థమున నియతముగా స్ఫురించుట గమనార్హము. అందుకే వరుల వారు పేర్కొన్నట్లు అప్యర్థములో వ్యవహారమున ఎంతచెప్పినా వినడు, ఎంతచెప్పిననూ వినడు' అని దీర్ఘము (వ్యా.సం.స.1472) విస్పించును. ఇది చేదర్థమున లేదు. 'వ స్తే పోతావు సరే రాకపోతే నూ (రాకపోయినా) పోతావా' అనుతీరుగా నున్నవ్యవహారమునుబట్టి చేదర్థకముపై నుశబ్ద

ప్రయోగముచే సప్తమ్యర్థము గలుగుచున్న దనిపించు. పరిశీలింపవలె.

## భావార్థకము—ఆనంతర్యార్థము :

'ఆనంతర్యంబున దువర్ణకంబు ద్రుతాంతం బగు' (42) ననుసూరి సూత్ర మనవసర మని తొలఁగించిరి వీరు.

భావార్థకము సముచ్చయనుశబ్దముతోఁ గూడి యానంతర్యార్థమును బోధించుట సంప్రదాయము.చెప్పుటయు- ఆది.1.134-(ఉ.377)అని ప్రౌఢ. (క్రి.12) ననుసరించి భావార్థకమువలననే యానంతర్యార్థము గల్గు నని చెప్పిరి. ఆప్రౌఢ.సూత్రము నట్లు యిచ్చి వివరించిన దా గుండెడిది. (చూ. త్రి.శే.)

కాని 'ఇట్టిస్థలములం దీభావార్థకదుప్రత్యయము.' ధారాళముగ వాడఁబడును.ఆముని యల్గి చూచుడును- (ఉ.377) అనుటయె విచార్యము. భావార్థమునందు దుప్రత్యయము ప్రాచీనప్రయోగములం గొన్నియెడలనె యరుదుగా నున్నది. అట్టియెడల నువర్ణముతోఁ గూడి యానంతర్యార్థము నిచ్చుట మాత్రము ధారాళ మగుట యేమి? తిక్కనాదిప్రయోగములలోనె భావార్థమున లేనిదుప్రత్యయ మానంతర్యార్థమున మాత్ర మెల్లరప్రయోగముల ధారాళముగా నుండుటనుబట్టియే యిది ప్రత్యేక మని గుర్తింపవలయును గదా!

వీరు సూచించినప్రౌఢ.క్రియా.12సూత్రమున భావార్థకము(నుశబ్దముతోఁ గూడి) ఆనంతర్యార్థక మగుట 'కొన్నియెడల' నని చెప్పఁబడినది. దువర్ణము భావార్థమందే యగుట యరుదు. అది నుశబ్దముతోఁ గూడియానంతర్యార్థక మగుట యింకను నరుదుగా నుండవలె.ఇంక దువర్ణమునుభావార్థమునఁ బ్రయోగించినవారిప్రయోగములందే యది యిట్లానంతర్యార్థక మగుట కొన్నియెడల నే నొప్పును. కాని వీరివివరణ మేతద్విరుద్ధముగా నున్నది గదా.

భావార్థమున టవర్ణము కవిప్రయోగప్రసిద్ధము. లక్షణగ్రంథములం దును నట్లే. అది నుశబ్దముతోఁ గూడి యానంతర్యార్థక మగుట యరుదు. భావార్థమున డువర్ణము కొందఱప్రయోగములం దదియుఁ గ్వాచిత్కము. కాఁగా నది నుశబ్దముతోఁ గూడి యానంతర్యార్థక మగుట యెల్లప్రయోగ ములందుఁ గలదు. అదియు ధారాళము. డువర్ణము టవర్ణకమువంటి దను టకుఁ దగినసామ్య మేది?

నుశబ్దముతోఁ గూడిన నానంతర్యార్థక మగుట 'సంప్రదాయ' మనుట లో వీ రిట్టిస్థితి నియత మని తలఁచియుండకపోవచ్చును. 'చదువుటయు వ్రాయుటయు సమమే' యనుచో నానంతర్యార్థ మున్నదా? సముచ్చయార్థము నుండును. అందుకే ప్రౌఢ. 'కొన్నియెడల' నన్నది. ఇట్లు టవర్ణకము పైని నుశబ్దము చార్థక మగుట ప్రసిద్ధమె యైయుండఁగా డువర్ణముపై నుశబ్దము చార్థమునం దున్నతా వేది? ఇట మాత్రము కేవల మానంతర్యార్థమె యుం డుటయు విశేషము గదా.

ఇట్టియెడల వీరు భావార్థకడువర్ణమునుండి యానంతర్యార్థమును నియ తముగా సాధించుట సరి కా దనక తప్పదు. కాఁగా దీనివలన 'సూరి పయి విషయములు గ్రహింపక 'అనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు జాబిల్లితోతెంచుడుం గువలయంబులు వికసిల్లె' అని సూత్రించి యుదాహ రించుట సరి కాదు (ఉ.377) (వ్యా.సం.స.1463) అనువరుసలవారివివరణ మసమంజసము. సూరి 'పయివిషయమును' గ్రహించుటచేతనె యానంత ర్యార్థమున డువర్ణమును బ్రత్యేకముగా విధించె నదియ యుచితము.

సం.లో వీరె వరుసగా నానంతర్యార్థకడువర్ణాంతరూపముల నుదాహ రించి "ఇట్లు నుశబ్దముతోఁ గూడియే భావార్థకడుప్రత్యయము తఱుచుగఁ బ్రయుక్త మవుచుండును కేవలభావార్థకడువర్ణకప్రయోగము పయి నుదాహ రించినరీతి నరుదుగ నుండును' (వ్యా.సం.స.1435) అనిరి. తఱుచుగాఁ బ్రయుక్త మగునపు డెల్ల నుశబ్దము తప్పదు. ఆనంతర్యార్థమును నియతము.

దీనినిబట్టియె డువర్ణకము ద్రుతము (సువర్ణము) చివరఁ గలిగి యానంర్యార్థక మగుట నియత మని నిశ్చయింపఁబడినట్లే. అసలైన భావార్థము (ద్రుతము లేక) డువర్ణముప్రయోగము లొండు రెండే. దీనినిబట్టి యొక రెండుప్రయోగములఁ గన్పించు డువర్ణభావార్థమును విశేషస్థలముగా నెన్న దగును.ఇంకఁ దలఁ చగుద్రుతాంతడువర్ణముయొక్క యానంతర్యార్థకస్థితి ప్రత్యేకముగా గుర్తించి సూత్రించు టుచితమ.

ఇంతకును వఝలవారు దమవ్యాకరణమున నానంతార్యార్థమున డువర్ణకమును జెప్పుసూత్రమునె (బాల.క్రి.42) తొలఁగించుటచే నీయర్థమిందువారి వివరణములచేఁ దెలియవలసినదే. భావార్థమున డువర్ణమును వీరున సూత్రింపమింజేసి యది నుశబ్దముతోఁ గూడుట యానంతర్యార్థక మగుట యన్నవి వీరియీవివరణము నాశ్రయించియె తెలిసికొనవలె.ఇదే యంశమ సూత్రించిన బా గుండెడిది. కాని యీవివరణ ముచితము గాదు. సూత్రింప కుంటయె యుచితము.

సూరిలక్షణము సూక్తము.

## శత్రర్థము :

'చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు (43) ననుసూరిలక్షణమును '--వర్తమానార్థంబునం దగు'(54) నని చివర సవరించిరి.

దీనిని శత్రర్థ మనరా దని వీరియిచ్చటియభిప్రాయము. "సంస్కృత మందలి 'వసన్' అనుశతృప్రత్యయాంతమునకుఁ దెల్గున వసించుచున్న వాఁడు అనువర్తమానార్థకవిధేయవిశేషణము పర్యాయము. కాఁగా సంస్కృతమునఁ దెల్గు 'చున్' ప్రత్యయముఁ బోలు వర్తమానార్థకలాక్షణికావ్యయ మువంటిప్రత్యయము లే దని చెప్పనగును. దీనిని శత్రర్థక మనుట సరి గాదు. వర్తమానార్థకలాక్షణికావ్యయ మనఁదగును.' (ఉ.385)

ఇట్లన్నవీరే యీవ్యాకరణముననే ఉ.సంధి.3సూత్రమున "శత్రర్థక చువర్ణకము" అని దీనిని శత్రర్థకముగా వ్యవహరించిరి. ఇంకను 'వచ్చుచున్నాఁడు మున్నగుసమాపకక్రియాసమానపదములందలిచువర్ణము శత్రర్థకచుప్రత్యయము గాదు' (ఉ.35) అని వివరించిరి గూడ. ఇట్లె ద్రుతప్రకృతికనిరూపణమున శత్రంతముగా దీనిం బేర్కొనిరి. సూరిలక్షణమును సవరించి తిరస్కరించినవీ రట్లే చెప్పుట విరుద్ధము గదా.

చిం. చురితిక్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్తనియు చోర్వాస్యాద్వర్తమానవిహితస్య యనియు వర్తమానార్థకముగా వ్యవహరించుటనుబట్టి వీ రిట్లు శత్రర్థక మనరా దని రని తలఁప వీలు లేదు. చిం. 'శత్రర్థేతూతశ్చానోః అనుచో దీనిని శత్రర్థకముగాఁ బేర్కొన్నది. 'అంచున్' ఇత్యాదులు దానికి లక్ష్యములే.

వఝులవారును నొకచో నిట్లు పేర్కొనిరి.

ఇట్టి (సంస్కృతశత్రంతప్రయోగస్థలముల)విధేయవిశేషణస్థలములందు సాధారణముగ శత్రర్థకచువర్ణ ప్రయోగమె తెల్గునఁ బ్రచుర మై యున్నది. --లతాకుంజం గుంజన్- లతాకుంజములందు ధ్వనించు- (వా.సం.స.1476) దీనిని ననుసరించియె తెలుఁగునందలియీచువర్ణకమును శత్రర్థకముగాఁ జెప్పుట యొప్పును గదా.

కాఁగా సూరి శత్రర్థక మనుటలో దురుక్తి లేదు. అది సూక్తమె.

ఇచ్చటిలక్ష్యములం దొకదోషము నిట్లు ప్రస్తావించిరి. 'చూచుచుం బోయెను. మున్నగుచోటులందలిచువర్ణకము వర్తమానార్థకము గాదు. ప్రధానక్రియ యనఁగా సమాపక్రియ భూతార్థక మగునపు డావాక్యములోనిగౌణక్రియ యనఁగా దానితో నన్వయించుననమాపకక్రియయు భూతార్థకమె యగు ననుట సంప్రదాయము --- '(వ్యా.సం.స.) అయిన నీయర్థ

ప్రాయమును విడిచిపుచ్చుకొని వీరే ఉ.లో 'భూతభావులందును చూచుచున్ అనునప్పటి (పఠన?)దర్శన-వర్తమానక్రియ విరుద్ధము గాదు' (ఉ.384) అని సూరిలక్ష్యములం దౌచిత్యమును గుర్తించు టుచితముగా నున్నది. అట్లే వీరు నిట 'క్రియాన్వయంబున వర్తమానార్థంబునం దగు' నని, సూరి వలెనె యుదాహరించుట సమంజసముగా నున్నది.

సూరిలక్ష్యలక్షణములు సూక్తములు.

### ఎడి-ఎడు :

'తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియ లగు' వానికి లోపంబు బహుళంబుగా నగు (45)(44) అనువానిని వీరు తద్ధర్మాద్యర్థకవిశేషణత్వమున ఎడు-ఎడి-ఉ-వర్ణకంబులు పర్యాయంబున నగు' (55) అని సవరించిరి,

సూరి 'తృవర్ణకార్థంబున' ననఁగా వీరు 'తద్ధర్మాద్యర్థకవిశేషణత్వమున' ననుట మొదటిమార్పు. కాని 'తచ్ఛీలతద్ధర్మార్థములందును తృన్ ప్రత్యయము వైయాకరణసమ్మతము'- [ఉ.385] అనుట ననుసరించి 'తృవర్ణకార్థమున' అనుసూరిసూత్రదళమునకు వ్యాఖ్యానమే వీరి సూత్రము నందలి మొదటిపద మని గుర్తింపవచ్చును. ఇఁక సూత్రమునఁ జెప్పినదాని కనుగుణముగాఁ దద్ధర్మతచ్ఛీలాదు లని [తచ్ఛీలముకంటెను] మొదటఁ ధద్ధర్మమును వీరు వివరణమునఁ బేర్కొన్న సక్రమముగా నుండెడి దని పించు.

తద్ధర్మాదులలోనియాశీరాద్యర్థము లిట నుండవు గావున సూరి తృవర్ణకార్థమునం దని యుండ నవు.

ఇట నొకసందేహము. 'ఉదంత మగుతద్ధర్మార్థకవిశేషణమున కని [సంధి.35] సూరి నుగాగమవిధానస్థలమునఁ బేర్కొనె- ఇట్లె సంధి.45 సూత్రవివరణమునందును. ఇట ఎడ్యాదులను 'దద్ధర్మాద్యర్థములందుఁ'

జెప్పినవఝులవారును బైచోట్లఁ దద్ధర్మార్థమును' మాత్రమె ప్రస్తావించిరి. ఇట నాదిశబ్దముచే గ్రహింపఁబడునర్థములం దేర్పడినయీవిశేషణములపై నాకార్యము లుండవా? సూరియభిప్రాయమును విచారింపవలసియున్నది.

ఇఁకఁ బిదప -సూరి ఎడిఎడుప్రత్యయములకు లోపమును జెప్పి ప్రహరించువాఁ డనురీతిస్థితిని సాధించెను. వఝులవా రట 'ఉ'అనుప్రత్యయమును విధించిరి. పిదప నిది మఱచిన ట్లున్నది.

కలాదేశముమీఁద ఎడ్యేడులు నిల్వ (ఉ.421] వనిరి. కలాదేశముపై నిలువనివి ఎడిఎడులు రెండే. కావున నిట వీరు విధించిన'ఉ'నిలుచుట కవరోధము లేదు. ఇఁక నీమూఁడింటిలో రెండు నిషేధించిరి గావున మిగిలినమూఁడవదె యెప్పుడు ననఁగా నిత్యముగా నిల్వవలెను. కావున కల + ఉ-కలు- కలువాఁ డనియే కావలె. కలవాఁడని యె ట్లుదాహరించిరి?

తాము ఉప్రత్యయమును విధించినట్లు గుర్తున్నచో వీరు ఎడి,ఎడుల తోపాటు ఉప్రత్యయమును నిల్వ దనియె చెప్పియుండెడివా రనవచ్చును. ఏమైన వీరిలక్షణముచే కలవాఁ డనుసాధురూపము లక్షణవిరుద్ధమై యెచ్చటను గనరాని వినరాని కలువాఁ డనునది లక్షణబద్ధ మగుచున్నది.

సూరి ఎడియెడులకు లోపము (బహుళముగా) విధించుటచే (బాహుళకముచే నిట నిత్యలోప మయి యెడియెడులు నిల్వకుండుట సూత్రముచే సాధింపఁబడుచున్నది. వీ రట్లు లోపమును జెప్పియుండమింజేసి యెడియెడులు నిల్వనేర వనువివరణము నాశ్రయించి లోపము చేసికొనవలసియున్నది. ఇందు సూరిమార్గ ముచితము గాదా?

ఎడియెడులలోపముచేతనె (వచ్చువాఁ డనురీతివి సూరిమతమున సిద్ధించుచు) ప్రత్యయలక్షణన్యాయము ననుసరించి యివియు తృవర్ణకార్థవిశిష్టములే యగుచున్నవి. కాఁగా వఝులవారు ఉప్రత్యయమును బ్రత్యేకముగా విధించుటవలనఁ బ్రయోజన మేమి? ఉత్వము ధాతువుతుదినిసహజముగనె యుండును. 'కల' యనురీతిగ నొక్కచో నుత్వము లేనపుడు (ఉ

ప్రత్యయమును లేమి) విశేషణరూపమునందును నుత్వములేదు.'ఉప్రత్యయ విధానము గౌరవమె కాని ప్రయోజనము లే దనుట స్పష్టమే.

సూరిలక్షణము లెంతయు సమంజసములు.

## వండుచున్నవాఁడు :

బాల.క్రి.46.సూత్రము నట్లు గ్రహించిరి.(ఉ.56) సం.లో నన్నయాధర్వణులమార్గమువిడిచి "సూరి యీసందర్భమున మార్గాంతరము ద్రొక్కుటచేత బా.క్రి.40,50,13,14,15 సూత్రములలోనివిధులచొప్పునఁ బ్రక్రియ నడుపవలసినవాఁడయ్యె' నను(వ్యా.సం.స.1477)వరుులవారితిరస్కారము సరి కా దని, సూరిమార్గముననే వీరు నీగ్రంథమునఁ గ్రమముగా 56,66, 21,22,23సూత్రములతో నడిపినప్రక్రియ నిరూపించుచున్నది. ఇంక నన్నయాధర్వణులమార్గముగా వీరు నిర్ణయించినప్రక్రియలో నెంతసహజత యున్నదో తద్గ్రంథపరామర్శనమున గుర్తింతము.

## నిజీ :

'వ్యతిరేకత్ర్వర్ణకార్థంబున నిజీ యగు' (47)ననుదానిని వీరు'వ్యతిరేకతద్ధర్మాద్యర్థములందు నిజీ యగు' (57)అని చూపిరి. ఇంతకు ముందు ఎడియెడు(ఉ)లు తద్ధర్మాద్యర్థములం దని చెప్పిరి గానఁ దదనుగుణముగ వీ రిట నిట్లు పేర్కొనిరి. అది యనవసర మని సూరిసూత్రమునకు వ్యాఖ్య వంటిదే యనియు గుర్తించియున్నారము. ఇటను నంతె.

ఇట 'వ్యతిరేకతద్ధర్మాద్యర్థములందు' అనుటనుబట్టి యితఃపూర్వము వీరు 'తద్ధర్మాద్యర్థవిశేషణత్వమున'(55) నని విశేషణత్వమును బేర్కొనుటయు వివరణాత్మకమె యని గుర్తింపవచ్చును. పూర్వ(56)సూత్రమును సూరి ననుసరించియె చెప్పిరి గదా.

## క్రియాజన్యవిశేషణాపదములు :

ఇవి ధాతుజవిశేషణములు, క్రియాజన్యవిశేషణములు నామాకాంక్షా సమాపకములు ననఁబడును' (ఉ.387) 'క్రియాధాతుః' అనుచిం.లక్షణమును (క్రియాజవిశేషణ మ్మనువి.వి.వ్యవహారమును) అనుసరించి ప్రౌఢవ్యాకర్త వలె వీరును వీనిని గ్రియాజన్యవిశేషణము లనియుందురు. సూరి 'క్రియ' యనుదానిని ధాతు వనునర్థమున వ్యవహరించుట గానరాదు. అట్లే సూరి వీనిని గ్రియాజన్యవిశేషణము లనియుఁ జేర్కొ-లేదు. వీరు 'నామాకాంక్ష సమాపకము లని (ఉ.386) వ్యవహరించుట విశేషము.

## లకారాదులు :

'లకారాదులు సకర్మంబునకుం గర్తృకర్మంబులందును లాఁతికిం గర్తయందు నగు' [48] ననుసూరిసూత్రమును వీరు- '-కర్తృకర్మార్థంబు లందును - కర్త్రర్థమాత్రమందును-' [58] అని చూపుట సూత్రమున నిం చుక వివరించి చెప్పుటయె. సూరిసూత్రము సూక్త మనుట స్పష్టమె.

## కర్మార్థము :

'పడుజ్యనుబంధంబు కర్మంబునం దగు' [49] ననుదాని నట్ల గ్రహించిరి. [ఉ.59]

పడుజ్యనుబంధపరకత్వమందును కాన్-కన్ [క్రియా.119] శబ్దము లనుప్రయుక్తము లవును. ఉదా. చేకొనంగఁబడునేని (సభా.2.142) దహింపఁగాఁబడి (అర.1.198)(ఉ.288) ఈవిశేష ముచితమె. 'పడు' పూర్వ మందలిరూపము నుజ్యంతమును గామి క్రియా.119సూత్రముచే నుజ్యంత మగునగుధాతు వనుప్రయుక్తము కాదు.

ఆత్మనేపదార్థమున కొనుధాతువువలెఁ గర్మార్థమునఁ బడుధాతువు ననుప్రయుక్తము చేసి తత్పరకత్వమున ధాతువునకు నుజి చెప్పిన నిబ్బంది యే మేని గల దేమో పరిశీలింపవలె.

రెండుమూఁడింటి కొక్కటి పడుజ్యనుబంధము నిల్పుటయుఁ గలదు. వినఁ జూడఁ బడు నం దెల్లను (శాంతి.6.285)అని వఝలవారు ప్రస్తావించినవేరొక విశేషమును గ్రాహ్య మైయున్నది. విను, చూచు అనురెండింటి పైఁ బడుజి యొక్కటి (రెండవధాతువుపై) చేరినది. కాని పడుజికి ముందటిచూచుధాతువునందే కాక దానికిముందటి వినుధాతువునందును జీ త్త్వఫలమగునత్వము వచ్చినది. పడుజిపరకత్వముసఁ జెప్పిననుగాగమమును రెండు ధాతువుల కయినది.

## నగియించు :

గురువిరహితంబు లయి యయాంతంబులయినయేకస్వరద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు' (50)ననుసూరిసూత్రమును సవరించి యిట్లు పేర్కొనిరి. "గురువిరహితంబు లయి యయాంతంబులగునేకస్వరద్విస్వరసంస్కృతధాతువుల కించుక్కు పరం బగునపుడును-ద్విత్రిస్వరాచ్ఛికధాతువులకు ఎకారాదిప్రత్యయము పర మగునపుడును ఇయుడాగమము వికల్పముగా నగును' (ఉ.60)

వీరిసూత్రమునఁ బ్రథమార్థమున సంస్కృతధాతువులకు వక్రపరకస్థితి (ఇయుడాగమము) వారించుట స్పష్టము. "ఇంచుగ్వ్యవధానంబునంజేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లే' వని సూరి యీయంశమును వివరణమున స్పష్టము చేసియే యుండెను. సూరి లాఘవముతో సూత్రమునఁ జెప్పె నందపార్థము లేమి స్పష్టము.

ఇట వీరు 'సంస్కృతధాతువున' కనుట యొకవిశేషము. ధాతువున కనిసామాన్యముగాఁ జెప్పినసూరిమతమున నాచ్ఛికధాతువులమీఁదియించుక్కునకునియుడాగమము వచ్చు. 'నగియించు'అని సూరి యుదాహరించెను గూడ. కాని యట్టిరూపమును నిర్వహించుమహాకవిప్రయోగము లే [ఉ.389] దని వీ రాచ్ఛికధాతువుల కియుడాగమ మించుక్పరకతలో లేకుండఁ జేసిరి. [వ్యా. సం.స.1510]

సూ.ని. నగి[యి]ంచు-నగియించు శబ్దమును జూపినది కాని ప్రయోగము లీలేదు. -వీరు 'నగుపించె నచటియబలాజనమున్- [విరా.4.39] అనుపద్యము టిప్పణమున నగియించె అనుపాఠాంతరము చూపఁబడెను. తాళపత్రమాతృకలందుగు నగుపించె అనుపాఠమె చూపట్టుచున్నది. సూ.ని. కూడ -- తెగియించినవారు ---[శు.క.4.28] అనునర్వాచీనసామాన్యకవిప్రయోగము- [వ్యా.సం.స.1502]అందుకె వీరిట మహాకవిప్రయోగములందు లేదని యుందురు.ఏచ్చోటినుంచి- అన్నది కుమారంధూర్జటిప్రయోగమర్వాచీనమయ్యు గ్రాహ్య మైనది. కాని వీరి కిది యట్లు గాలేదు. మొత్తముపై 'నగియించు' అనునవి లేవనియు నట 'నగుపించు' అని యుండు ననియు వీరినిశ్చయము.

నగు + ఇంచు- నగుపించు అని యనుట యెట్లు? ఇంచుక్క పరమగునపుడు అన్వాదులకు పుగాగమ మగును. కాన అనిపించు తినిపించు అనువానివలెనె నగుపించు' అని యగును. [విరా.4.39.తాళమాతృక] ఇచట టిప్పణిలోనినగియించెడినడి పాఠా తరము ప్రక్షిప్తము [ఉ.389] కవిప్రయోగమును 'దాళపత్రమాతృక' నుండి యుద్ధరించుట యెక్కవిశేషము. అనిపించు, తినిపించు అనువానిని బోలుచు నగిపించు అని కాక నగుపించు అని యగుట యిం కొకవిశేషము

అయినను అనిపించు అనుదానివలె నగుపించు అని యగునా? అన్వాదులలో [క్రియ.78] సూరి నగుధాతువును జూపలేదు. "అను కను తిను విను అనునాల్గిటికే పుగాగమము నిత్యము మాను అనునది అన్వాదులలోనిది గాదు. దానికి విభాష యని వేఱుగ వచింపఁబడెను" [ఉ.406] అని వీరును జెప్పిరి. అయ్యు నగిపించెన్ [క.శా.5.54,65.] నగుపింపఁగా [శాంతి.6.217]- పయిప్రయోగములచొప్పున నన్వాదులలో నగుధాతువును జేర్పవలె ననిరి. [ఉ.406] వివరణమున నన్వాదులలో 'నగు' చూపవలసినది. అపుఁ గాక. అన్వాదులకుఁ బుక్కు నిత్యము గదా.

నగిపించు అనియె కావలె. అనించు, వినించు అని యుండనట్లే నగించు అని యుండుటకు వీలు లేదు. నగింపఁగ (హరి.పూ.8.134) మొద లగు ప్రయోగము లసాధువులా? సూరివలెనె వీరును 'మానునకు మాత్రమె విభాషగాఁ జెప్పిరి. (ఉ.క్రి.81) వీరు' నగుధాతువు నన్వాదులలోఁ జేర్చ అన్వాదులలోనిది గాదని వీరును గుర్తించిన 'మాను'తోఁ గూర్చి పుగా మమును విభాషగా చెప్పుకొనవలసియున్నది.

అట్లు చెప్పనిసూరి యిట 'నగియించె' ననుపాఠమును బ్రమాణ కరించె నని ప్రస్తుతస్థలోదాహృతియు నిరూపించుచున్నది. 'నగుపించు అనునదియు గుర్తింపవలసిన సూరిమతమున క్రియా.77సూత్ర ముపయో గించు నని తోఁచుచున్నది.

నగియించు తెగియించు అనువానింబట్టి యాచ్ఛికధాతువులయింక్కునకును నియుడాగమము క్వాచిత్కముగ నంగీకరింపఁదగియున్నది క్వాచిత్కస్థితిని సూరిలక్షణమందలివిభాషాపదముచే గుర్తింపవచ్చును కాఁగా నిట సూరిమతమున దురుక్తి యేమియు లేదు.

## క్రుమ్మరియెద

పిదప వీరు 'ద్విత్రిస్వరాచ్ఛికధాతువులకు ఎకారాదిప్రత్యయము ప మగునపు డియుట్టు చెప్పిరి.

సూరి (సంస్కృతధాతువులకువలెనె) యాచ్ఛికధాతువులకును 'నే స్వరద్విస్వరముల మాత్రమె యియుట్టు చెప్పఁగా వీరు త్రిస్వరములు నధికముగాఁ జెప్పిరి. దీనిప్రయోజన మిట్లు పేర్కొనిరి.' క్రుమ్మరియెదను క్రుమ్మరెదను త్రిమ్మరియెదు త్రిమ్మరెదు- -క్రుమ్మరియెదు- -కా యీప్రయోజనము నం దొక యిబ్బందిని వారే సం.లో గుర్తించి యిట్ల పరిష్కరించిరి. "క్రుమ్మరు త్రిమ్మరు అనునవి లఘువంతములు కావు ద్విస్వరములును గావు. ఇట్టివానిని వాశబ్దవ్యవస్థావాచిత్వమున సంగ్రహింపవలయును.

(వ్యా.సం.స.1507) లఘ్వేకాక్షరపూర్వ- అనుచిం.లక్షణమున వీని నిట్లు సమర్థించిరి. అట్లై (సూరిలక్షణమును విభాషాపదము నేయపసిద్ధాంత మున్న దని వీరు వైకల్పికముగా మార్చిరో) సూరిలక్షణమునను నేల సమన్వయింపరాదు?

స్పష్టముగా సూత్రింపఁదగును గదా యని యిట్లు సూత్రమునఁ బేర్కొనిరా? అయిన సం.లోనివీరివివరణము ననుసరించియె యిందుఁ బెక్కర్థములు గల్గుటను గుర్తింపవచ్చును.

క్రుమ్మరు ఇత్యాదు లగునివి త్రిస్వరములే కాని యట్లగుటతోపాటు గురుమంతములు నైనవి. మఱి యియుడాగమ మగుట యెట్లు? సూత్రమున నాచ్ఛికధాతువులవిషయము విభాగించి చెప్పుటచే సంస్కృతధాతువులంగూర్చి చెప్పిన 'గురువిరహితంబు లయి' యనునియమ మాచ్ఛికధాతువులయెడ వర్తింప దనవలెనా? అట్లగుచో చొచ్చియెను, వండియెడు వా, డనురీతిగా నెన్నో యపరూపము లేర్పడును.

'గురువిరహితంబు లయి' యనునది వర్తింపనపు 'డయాంతంబులగు' అనునదియు నాచ్ఛికధాతువులకు వర్తింపదు. కావున [అయియెను, పోయియెడివాఁడు] వ్రేసియెను, ఏసియెను అనురీతిగా నవును. వీరు త్రిస్వరముల యెడను జెప్పిరి గావున ఎగసియెను, సొగసియెను ఇత్యాదు లగురూపము లెన్నియు నేర్పడు.

'నగియించు' అన్నది యసాధు వని తిరస్కరించినవీరు పైరీతి నెన్నియపరూపములను లక్షణబద్ధము చేయుచుండిరో. వీని నివారింపవలె నన్న గురువిరహితత్వము[అయాంతత్వము]అనునియమ మాచ్ఛికధాతువులయెడను వర్తింపఁజేయవలె, అట్టియపుడు 'క్రుమ్మరియెడు' ననురీతిత్రిస్వరములు గురుమంతము లగుటచే నట ఇయుట్టు రాదు.

జలము లోలుకఁ బెగ్గిలియెన్ (భాగ.10.పూ.1443) సంక్రందనసూతి దగ్గఱియె (విరా.4.184)-క్రమ్మఱియెదుమము (కవిక.పీ.60) అనురీతిగాఁ ద్రిస్వరము లగునిట్టిస్థలము లెల్ల గురుమంతము లగుట నియతముగాఁ గానవచ్చుటచే గురుమత్త్వమునుబట్టి యియుడాగమము రాదు గావునఁ ద్రిస్వరము లని వీరు సూరికంటె విశేషముగాఁ జెప్పినదళము వా రుద్దేశించినకవిప్రయోగములను సాధింపఁజాలదు. ఇంక కొలిచియెను, నిలిచియెదువాఁ డనురీతిగా గానరానిరూపములనే సాధించుచు ననర్థక మగు.

కాఁగా వీరు సూరికంటె నధికముగాఁ జేర్చిన 'త్రిస్వర'ముల కన్నది కేవల మనర్థకమె.

చిం.లో వాశబ్దముచేఁ (గాని బాల.లో విభాషాపదముచేఁ గాని) ఇట్టివి గుర్తింపఁదగు ననువరులవారియభిప్రాయ మెంతవఱ కామోద యోగ్యమో నిర్ణయింపరాకున్నది. విభాషకు ప్రవృత్త్యప్రవృత్తులను వ్యవస్థ చేయుట ప్రసిద్ధమె. ఇట క్రుమ్మరు ఇత్యాదుల కియుట్టు సాధింపవలె నన్న నది యన్యకార్య మగును. విభాష కన్యకార్యమును నియమించుట సంప్రదాయముగాఁ గానరాదు. సంస్కృతమునం దెట నే నిట్టిస్థితి (విభాష కన్యకార్యమును వ్యవస్థ చేయుట) గల దేమో వెదుకవలె.

ఇంకను స్పష్టముగా నీయియుట్టు క్రుమ్మరుప్రభృతులపై వక్రము (ఎ)నకును గానవచ్చుటను బ్రత్యేకముగా సూత్రింప (లేక యాసూత్ర నొద్ద వివరించినను) బా గుండెడి దని తోఁచుచున్నది.

### కనియెడును :

ఇంక వీ రీయాచ్ఛికధాతువులకు మీఁది 'ఎకారాదిప్రత్యయమున' ియు ట్టగు ననిరి. సూరి సూత్రమందలి'వక్రము' అనుదాని కిది వివరణముగా నెంచి రేమో. ఎఏ,ఒఓలు వక్రము లయినను నవి పర మగుట

సంభవింపదు. కావున పీ 'రెకారాది' యని యుందురు. వక్రము లన్న సూరిలక్షణమున నపరూపప్రసక్తి లేదు గాన నందు దురుక్తి లేదు.

ఇఁక పీరే యిట ఎకారాది'ప్రత్యయ' మనుటచే నిష్టరూపసిద్ధి కవరోధము గల్గుచున్నది. ప్రత్యయ మనుటచేఁ బ్రత్యయేతర మగు'ఎ'కారము పరమయినపు డీకార్యము రా పీలు లేదు. కొనియెదను అనుచో 'ఎడ', అనియెదిని, వినియెదును ఇత్యాదులలోని ఎడియెదులును సూరివలెనె పీరు నాగమములుగా విధించిరి. [ఉ.క్రి.31] ఆగమములను బ్రత్యయము నరాదు గదా. అట్టియెడలఁ బ్రత్యయమునకుఁ జెప్పిన కార్య మాగమముల గుట యెట్లు? ఇఁక పీరిలక్షణమందలిప్రత్యయ మన్నది యాగమములకు పలక్షణ మనుకొనవలయును. ప్రత్యయప్రత్యయేతరవివక్ష సేయక సూరి వక్ర' మని సామాన్యముగాఁ జెప్పుటవలన నట నీయుపలక్షణమార్గ మనవ రము. కానిచో కొనియెద నిత్యాదు లసాధువు లనవలసివచ్చును గదా.

గురువిరహితంబులు, నయాంతంబులు నగుట యనులక్షణ మాచ్ఛిక తువులయెడను బ్రవర్తించుచు లాఘవముతో నున్నసూరిలక్షణము సూక్త ు.దానిని వరులవారు సవరించుటవలన ననర్థములే యెక్కువ.సవరణము ో పీరు ప్రధానముగా నుద్దేశించినక్రుమ్మరియెడు ననురీతివి పీరిలక్షణము త నసాధ్యము లయి కొలిచియెడు ననురీతివానిని గల్పించుచు నది యన క మైనది. ఆచ్ఛికములయిఁచుక్కన కియుట్టు వారింపఁదలఁచుటయె సరి దు. అవి క్వాచిత్కముగఁ గలవు. క్వాచిత్క మగుటయు సహజము. ఏ న నాచ్ఛికధాతువులకు స్వార్థమునం దించుక్క వచ్చుటయే యరుదు. పేరణమున చుగాదులు గలవు గావున నటఁ గూడ నించుకప్రరకత యరుదు. టను అన్వాదుల పుగాగమాదివిధులు గలవు. కాఁగా బై లక్షణములు గల ఆచ్ఛికధాతువుపై నించు క్కుండుటయె యరుదు గావున నియుట్టు గన్ప ట యరు దగుటలో వింత లేదు.ఎటనేఁ గొన్నియెడల లే కున్న విభాషా నము దానికి సాధకము. మొత్తముపై పీరిసవరణము సరి కాదు.

## చనె‌న్ :

"చనెన్ వినెన్ కనెన్ అనురీతిరూపములు నన్నయాధర్వణసమ్మత ములు గా వని యప్పకవి వచింపఁగా (వ్యా.సం.స.1505) అప్పకవి వి.విః నెఱిఁగి యధర్వణుఁడును సంగీకరింపలే దని గు ర్తించి యట్లు స్పష్టము చేసె నన్నమాట. (ఇది తెలియనియహోబలుఁ డప్పకవి కధర్వణగ్రంథము దొరు కలే దనెను.) నన్నయభారతభాగమునం దెచ్చటను లేవు. తరువాతికవు లట్టి రూపములను ప్రయోగించిరి. కాని సూరి యట్టిరూపముల నేల సంగ్రహిం పఁడయ్యెనో తెలియకున్నది. ప్రౌఢవ్యాకర్త యైన నేల సంగ్రహింపలేదో తెలియకున్నది'- (వ్యా.సం.స.1504)అనువరులవారివచనముల కాధారము గానరాదు. చిం. చనెన్ అనురీతిరూపములు సంగ్రహించుచున్నదో లేదో గ్రంథాంతరమున గమనింపఁగలము. సూరి సాధింపలేదా? 'చనియెన్' అనున వైన సాధించె నని యంగీకరింతురు గదా. చని + ఎను అని యుండఁగా క్రియా50సూత్రముచే నియుడాగమము వచ్చి చనియెన్ అని యగును.ఇయు ట్టు విభాష గదా. అది రానిచో నగెను, తెగెను- అనురీతిగాఁ జనెను అని కాదా? చనియెను అన్నది కూడ సూరి సంగ్రహింపలే దనవలెనా? వరుల వా ర ట్లనలేదు. కాఁగాఁ జనియెను సాధించె నన్నఁ జనెను (చనెన్) అని పక్షాంతరమున సూరి సాధించినట్లు ఇయు ట్టిట నిత్య మని సూరి చెప్పలేదు గదా. ఇ ట్టిరూపములు బాల. సంగ్రహించియుండుటచేతనె ప్రౌఢవ్యాకర్త పునరుక్తముగాఁ దిరిగి ప్రస్తావింపలే దని గుర్తింపఁదగును.

## పద్వాదులు :

'పద్వాదులసవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబు నగు' (51) ననుసూరిలక్షణమును ఇద్వాదుల-- (ఉ.61) అని సవరించిరి.

'సంధి43సూత్రపుపద్వాదులు వేఱు. ఇందలిపద్వాదులు వేఱు.కావున నిట పద్వాదు లనక ఇద్వాదు లనుట లెస్స.' (ఉ.391)(వ్యా.సం.స.1482, 1483)

ఇందలిపద్వాదు లేయవియో యిట సూరి ప్రదర్శించుచుండఁగా సంధి43సూత్రమునందలిపద్వాదు లనుకొన నవకాశ మేది?

స్పష్టత కైన నిట్లు నియమించుకొన్నవీరే తమనియమము నెల్లెడల ననుసరించినట్లు లేదు. ఉ.క్రియా.81సూత్రమును బాల.నుండి (క్రి.78) యథాతథముగా అన్వాదు లని- గ్రహించిరి. ఉ.క్రియా.65సూత్రమునందును 'నన్వాదు' లనియె చెప్పిరి. (బాల.క్రి.54) అందలికొనుమనుధాతువులు 81సూత్రస్థలమున లేవు. వీరే "అన్వాదులు క్రియా65సూత్రమునఁ బేర్కొనఁ బడెను. వానిలో కొనుమనుధాతువు లిందు విడువఁబడె" (ఉ.406) నవిరి. ఇట్లు భేదము గలిగినపు డిట కన్వాదు లనకపోయిరా? అట నట్లు చెప్పుటలో దోషము లేనపుడు ప్రస్తుతస్థలమున మాత్రము పద్వాదు లనుటలో దోష మేమి? ఇద్వాదు లన నవసర మేమి? ఇది లెస్స యగుట యేమి?

గణములందలిశబ్దములు కొన్ని వేరైనపుడు, సమానముగా నున్న యొకశబ్దమును రెండుగణములకు మొదట నిలుపరా దని నియమ మే మేని గలదా? సంస్కృతమున నిట్టిస్థితి గమనింపఁదగు. వుఞ్ ఛణ్--- అరీహణ- కుముదకాశతృణ--కుముదాదిభ్యః (4-2-80) అనుచో నాకే సూత్రమున భిన్నప్రత్యయములకై కుముదాదిగణములు రెండు పేర్కొనఁ బడినవి. మొదటికుముదాదులలో- కుముదశర్కరాన్యగ్రోధ-- ఆదులుగలవు. రెండవస్థలమున కుముదగోమథరథకార-- ఇత్యాదులు గలవు. ఇట్లు భేద మున్నను రెండింట గణాదిని గుముదశబ్దమె పేర్కొనఁబడినది గదా. అట్లే నడాదిభ్యః ఫక్ అనుచో ఫక్స్థలమునందలినడాదులలో నున్నచర,ఇతిక, ఇతిశాదులు- నడాదీనాం కుక్చ అనుచోటినడాదులలో లేవు. కుక్స్థలమందలి నడాదులలోని బిల్వవేణుప్రభృతులు ఫక్స్థలమునందలినడాదులలో లేవు.

కాఁగా సంధిపరిచ్ఛేదమందలిపద్వాదులలోనిశబ్దములును, నిచ్చటి

పద్వాదులును వే అయినను గణాదిని బహుళబ్దమునే గ్రహించి సూరి చెప్పుట సంప్రదాయవిరుద్ధ మనరాదు.

'దీర్ఘపూర్వకనువర్ణాంతముల కిట్టిస్థితి లేదు. మానిన- మానినన్' (ఉ.392) ఇది స్పష్టత కైనం జెప్పుట యనవసరమే యనందగు. ఏల యన సూరివలెనె వీరును 'ఇవి ఇద్వాదులు' అని పద్వాదులను నియత గణముగనె పేర్కొనిరి. అట్టియెడల వీనిలోం జేరనిశబ్దముల కీకార్యము ప్రాప్తించుటయే లేదు గదా.

పయింగా దీర్ఘపూర్వకనువర్ణాంతములకు రా దందు రేమి? దీర్ఘపూర్వక మగునువర్ణేతరమునకు నగునా?

సం.లో "ప్రకృతసూత్రమందలివిభాష వ్యవస్థితవిభాష యగుట చేతను దీనికి మూల మగు క్వచిన్న స్యేచ్ఛలోపవాన్ అనువికృతివివేకకారి కలోనిక్వచిచ్ఛబ్దమహిమచేతను దీర్ఘపూర్వకస్థలములం దీఅత్వద్విత్వములు కల్గ నేర వని గ్రహింపనగును. ఉ.పాడినన్-మానినన్- -(వ్యా.సం.స. 1482)' పాడినన్ అనుచోం బై ఉ.వివరణము ననుసరించి నువర్ణాంతము గాదు గావున దీర్ఘపూర్వక మైనను నత్వద్విత్వము లగు ననవచ్చునా? ఇంకంబద్వాదిభిన్నస్థలములలో నీకార్యము వారించుటకు దీర్ఘపూర్వకనువర్ణాం తములకు రా దని వి.వి.లో క్వచిచ్ఛబ్దమహిమచే గుర్తింతురు గాక. నియతగణముగాం జెప్పినయీలక్షణమున ననవసరము. కాంగా నీసూత్రము నందలివిభాషకు వ్యవస్థ చేసి దీర్ఘపూర్వకములపై నీకార్యము రా దని యర్థము చేయవలయు ననుట ప్రమాదము.

దీర్ఘపూర్వకములే యేమి? ఇచ్చటిపద్వాదులలోం జేరనిధాతువు హ్రస్వపూర్వక మగునెట్టివర్ణ మంతమందుం గలది యైనను నీకార్య మగునా? నగినవాండు- తెగిన ఇత్యాదులలోను నగ్గ తెగ్గ అనురీతిరూప ములు గలవా? వరుసలవారియీవివరణమువలన ననర్థస్ఫూర్తియే ప్రయోజనము.

సూరి పద్వాదులలోఁ జూపినతగుధాతువును వీరు తమ ఇద్వాదులలోఁ దొలఁగించిరి. (ఉ.391) 'మూలమున లేనితగుధాతువును గవిజనమండ నమునుండి సూరి పద్వాదులలోఁ జేర్చెను గాని తగ్గపని, చంపఁదగ్గవాఁడు మున్నగువ్యవహారములలో నిట్టిరూపము లగపడుచున్నవే కాని మహాకవి ప్రయోగములం దిట్టివి కన్పట్టలేదు. తగినన్ అనుచేదర్థమునందు తగ్గన్ అనురూపాంతరము వ్యవహారమునందు సైతము వినఁబడలేదు. (వ్యా.సం. స.1482,ఉ.391)

(వి.వి.)మూలమునం దిది లే దనుట కస లేది యున్నదో యందు స్పష్టముగాఁ జెప్పఁబడినదా? 'కవిప్రయోగముల నాశ్రయించి చెప్పకొనవల సినదే. చేదర్థమునందు వ్యవహారమునను 'తగ్గన్' లే దనిరి. తగినన్ ఉన్నదా? అసలు వ్యవహారమునఁ జేదర్థమునందు 'న'ప్రత్యయ మేధాతువు మీఁదను దఱుచుగా వినఁబడదు.కురిస్తే పండుతాయి (రమ్మంటే పోయినా) అనువిధముగా 'తే' అన్నదే కన్పించును. తేచేతి అనిసా.త్రి.శ.దీనిని బేర్కొన్నది. (క్రి.) ఇంక వరులవారు విశేషముగాఁ బ్రస్తావించినయప్య ర్థమునందె వ్యవహారములో వ్యతిరేకార్థముపై నప్రత్యయము విన వచ్చును. వద్దన్నాపోయినా. కురవకపోయినా ఫరవాలేదు.కాఁబట్టి 'తగ్గన్' అన్నది వ్యవహారమున లేకుండుటలో వింత లేదు. (అప్యర్థములోఁ గూడ వ్యతిరేకార్థముపైనె 'న'వర్ణము విన్పించును గావున నటను తగ్గా అను రూప ముండునవకాశము లేదు.

## ఆత్మనేపదార్థము :

బాల.క్రి.52,53సూత్రము లట్లగ్రహించిరి (ఉ.62,63)వీరు వేసుకొని మున్నగునర్వాచీనప్రయోగములను గుర్తించుటయు 'వ్రాసుట' అనురీతి వానిని నిరాకరించుటయు నుచితమె. (చూ.బాల.క్రి.38)

## యాకు సకారము :

'ఇకారవక్రంబు లుక్తంబులందలివి పరంబు లగుచో యాకు సకారం బగు' (54)ననుసూరిలక్షణము నిట్లు సవరించిరి. 'ఇంచుక్కృత్ప్రత్యయములు తప్పఁ దక్కినప్రత్యయములమొదట నున్న ఇ-ఎ-ఏ-లు నిల్చునపుడు ధాతువుతుదియకారము సకార మగును. (ఉ.64)

వీరిలక్షణమును బరామర్శింతము. సూరిసూత్రమందలిఉక్తంబులంద లివి అనుదానికి- 'ఇంచుక్ కృత్ప్రత్యయములు తప్ప తక్కినప్రత్యయములమొదట'ననువీరిసూత్రభాగము వివరణాత్మకముగా వీ రెంచియుందురు. కాని యిం దవర్థములు పెక్కు.

'తక్కినప్రత్యయములమొదట' నని చెప్పునప్పు డా ఇంచుక్కు నిటఁ బ్రస్తావింప నక్కర లేదు. ఇంచుక్కు ఆగమమె కాని ప్రత్యయము గాదు గదా. కాఁగాఁ బ్రత్యయము పర మగునపుడు చెప్పినకార్య మాగమము పరమగునపు డెట్లును రాదు. కావున నాగమ మైనఇంచుక్కు పర మైన నీకార్యము ప్రాప్తియే లేదు. ఇఁక దానిని మఱలఁ జెప్ప నేల? 'కృద్భిన్న ప్రత్యయముల' -అన్న నిఁచుక్కు పర మైనపుడు సకార మగునా? సూత్ర మున ననవసర మైనగౌరవము గల్గినది.

ప్రత్యయముల అనుటయె సరి కాదు. ఆగమములు ప్రత్యయములు గావు. కావునఁ బ్రత్యయపరకత్వమునఁ జెప్పినయాకార్య మాగమపరకత్వమునఁ బ్రాప్తింపదు. ఇట్టియెడల ఉ.క్రి. 60సూత్రమునొద్ద వలెనె ఎదు, ఎడి, ఎద మొద లగునాగమములు పర మైన సకారము రావీలు లేమి చేసెదును, చేసెడిని, చేసెదను, చేసిరి మున్నగుచోట్ల సకారము వచ్చుటవారిసూత్రముచే లక్షణవిరుద్ధ మయి యట్టి వెల్ల గ్రామ్యము లగు. ఇఁక నిటఁ గూడఁ 'బ్రత్యయ' మాగమమున కుపలక్షణ మనుకోవలె. అపు డించుక్కును బేర్కొనుట యొప్పు. ఇంచుక్కను బేర్కొన్నసామర్థ్యముచేఁ బ్రత్యయ మాగమమునకు నుపలక్షణ మనవచ్చు. ఇట్టియవసరమును గల్పింపనిసూరిలక్షణము సూక్తము గదా.

'ప్రత్యయములమొదట నున్న ఇఎఏ' అనిరి.క్త్వార్థమునందు వచ్చు 'ఇ' అనునదే ప్రత్యయము. ఇది 'ఇ'మొదటఁ గలప్రత్యయ మనవలెనా? చేసిరి ఇత్యాదులం దగు 'ఇ'ఆగమము సిద్ధె.

ఇఁక నిట వీరు 'ఇ-ఎ-ఏ- యనుచో 'ఏ'కారమును గూడఁ జేర్చి- నిరి. ఇది యచ్చుపొరపా టేమో యనుకొనుట కవకాశము లేదు. సం.లో 'ఇద్వక్రంబులు- ఇకారమును ఏలును (ఇకారసాహచర్యమునఁ దాలవ్య ములు గానిఒఓలకు గ్రహణము లే దని యెన్నునది.) (వా.సం.స. 1522) అనుటనుబట్టియు 'ఏ' వీ రుద్దేశ్యపూర్వకముగనె) యుంచి రనవలె. కాని 'ఏ'కార మాదియందుఁ గలప్రత్యయము గాని యాగమము గాని యీవ్యాకరణమునఁ జెప్పఁబడలేదు.వీరు నెచ్చట నుదాహరింపలేదు. ప్రత్య యాగమము లయిన ఎను-ఇ-ఎడు-ఎడి-ఎద అనునవి మాత్రమె యిట నుక్తపూర్వములు. (ముజ్జున కనుప్రయుక్తము చేసినఎదాదులలో ఏకార మున్న నది ప్రత్యయము గాకున్నను నది ధాతువునకుఁ బరమై యుండదు.) కాఁగా వీ రిట 'ఏ' (దీర్ఘము) చూపుట యనవసరము. 60 సూ.లోవలె 'ఎ'(హ్రస్వము)మాత్రమె చూపఁజాలును.

సం.లో ఇకారసాహచర్యముచేఁ దాలవ్యవక్రములే కాని ఒఓలు గ్రహింపఁబడ వని తాము చేసినవ్యాఖ్యను దృష్టియం దుంచుకొని స్పష్టత కయ్యు వీనిని వివరించియుందురు. కాని పై రీతిని వ్యాఖ్యానింప నవసరము గానరాదు. వక్రశబ్దముచే ఎఏ,ఒఓ లెల్ల గ్రహింపఁబడినను ఒఓ అనువక్ర ములు పర మగుట సంభవింపదు గావున నట సకారప్రసక్తి లేమి నపరూప ప్రసక్తియు లేదు గదా. సంస్కృతధాతువుల కించుగవ్యవధానంబుసంజేసి యట వక్రపరకత్వము లేమి నట వక్రమున కియుట్టు లేనట్లే యిటను ఒఓలు వక్రము లైనను నవి పరముగా నుండమి సకారము ప్రసక్తి లే దని సూరియభిప్రాయము స్పష్టము.

60]

ఇకారసాహచర్యముచే వక్రములు తాలవ్యములే గ్రహింపఁబడు ననిరి. అట్లు 'ఏ' గూడ గ్రహింపఁబడినను నట సకారము లే దని గుర్తించితిమి గదా. ఏకారమువలె ఒఓలును బర మగుట లేమి సకారము లేమి గుర్తింపఁ దగియున్నది. కావున వీరు తాలవ్యవక్రములే గ్రహింపఁబడు ననురీతిని జేసినవ్యాఖ్యయె యవసరము గా దని నిశ్చయింపఁదగును. ఏకారమును విడుచుటకు వీరివ్యాఖ్య ననుసరించియే యవకాశము లేదు. వీరు గ్రహించినను ప్రయోజనము లేదు. ఒఓలు నట్లే. వీరివ్యాఖ్య సరి కాదు.

'ఇకారవక్రంబు లుక్తంబులందలివి' యనుటచే ఎఏఒఓలు నాలుగును వక్రములే యైనను నుక్తములందలివక్రము హ్రస్వ మగు'ఎ'కారము మాత్రమె. కావున నది యొక్కటియె గ్రహింపఁబడు నని వ్యాఖ్యానించిన సూరిమతానుగుణ మైయుండును.

'ధాతువునకు' అనునధికారసూత్రము గలిమి వీరు దమసూత్రమున 'ధాతువుతుదియకారము' అనుట స్పష్టతకె. కావున నది లేనిసూరిలక్షణమున చురుక్తియు లేదు.

మొత్తముపై సూరిలక్షణమే సూక్తము. అం దేయపసిద్ధాంతమును వారింప నిట్లు వీరు సవరింపఁబూనిరో కాని వీరిసవరణమువలననే యనర్థము లేర్పడుచు నిది యగ్రాహ్య మైనది.

## ఉండుచున్నను :

బాల. క్రి.55,56సూత్రములు దాదా పట్లె గ్రహించిరి. (ఉ.66,67) ఉండుచుండినను, ఉండుచున్నను -అనునవి అపశబ్దములు' (ఉ.395) ఎచటనే నిట్టిప్రయోగములు గానవచ్చినచో ఉండుచున్ + ఉండినను (ఉన్నను) అనురీతిగా గుర్తించుటలో బాధ యేమో విచారింపవలెను.

## ఉన్నానం:

బాల. క్రి.56,57సూత్రములను దాదా పట్ల గ్రహించిరి. (ఉ.66,67)

'ఉండు+లట్-ఉండు+చు+ఉన్న+సు ఇటఁ బ్రకృతసూత్రముచే ఉండుధాతువు లోపించుటచే దానితుదిని నిల్వవలసినచువర్ణము లోపించినది' (వ్యా.సం.స.1479) చువర్ణము లోపించిన దనుట సరి కాదు. చువర్ణకము చేసినపిదప దానివలన ఉన్నశబ్దముతో నుండుధాతువునకు వ్యవధానము గల్గుటయు గమనార్హము. ఉండు + లట్, ఉండు + ను ఉండు + ఉన్న + ను, అని యున్నశబ్దము చేరినవెంటనె ప్రస్తుతసూత్రముచే నుండుధాతువు లోపింపఁగా ధాతువునకు రావలసినచువర్ణము ధాతువు లోపించుటచేఁ బ్రాప్తింప నవకాశమె లేదు. కావున వీరు 'చు' లోపించు ననుట యసంగతము. దీని వలననే 'ఏతత్సమానన్యాయమున ఉన్న యనెడియనుబంధము సైతము లోపింపవలసియే యున్నను నేతత్సూత్రవిధానసామర్థ్యమున నట్టిలోపము గలుగ దని సూరియాశయ' (వ్యా.సం.స.1479) మని నిరాధారముగాఁ గల్పించుకొనవలసివచ్చినది. పై ప్రక్రియప్రకారము 'చు' లోపించుటయే లేదు గాన ఉన్న లోపించు ననుప్రశ్నయె లేదు. సూరి 'చు'లోపము నుద్దేశించిన ఉండుతోపాటు చువర్ణమునకును లోపము చెప్పెడివాఁడే. ఉదంతము న కున్నానుబంధము చెప్పఁగా నుదంతమె (ఉండుధాతువు) లోపించును గాన దానికి వచ్చిన'ఉన్న' లోపించు నని తలఁపరాదు. కనుఁగవ కన్నవ. ముత్తియము. ముత్తెము. మొ॥

సూరిగారిఉండుధాతులోపవిధానము వచుులవారికి సం.లో నచ్చలేదు'

'సహజ మగుచింతామణిమార్గము ననుసరించి లడర్థము వివక్షిత మగునపు డుండుధాతురూపము లితరధాతువుల కనుబంధము లగు నని --

చిం. 'వసతిరనుబన్ధకః' అనఁగా నుండుధాతురూపములె యనుబంధము లగునా? వండుధాతువున లడర్థమును వివక్షింపఁగా నుండుధాతురూపమెట్టి దనుబంధ మగును? లడంతమా? అయిన లడంత మగునుండుధాతు వనుబంధ మగు నని స్పష్టముగాఁ జెప్పవలదా? అట్లుఁ గాక. చిం. ప్రధాన మైన ఈయుండుధాతులడంతరూపప్రక్రియ నేని జెప్పెనా? ఉండుఁడు, ఉండు

రు అనునంతవఱకె చిం.లక్షణము నడచినది.ఇది సహజ మగుప్రక్రియయా? శబ్దచరిత్ర కగు నేమో. కాని శబ్దశాస్త్రమున మాత్రము గా దనక తప్పదు.

-ఉండినఅనుదానిలోని డివర్ణలోపమున ఉన్నశబ్దమేర్పడె ననియు--

'ఉండిన' అని యిట నవర్ణ మైన దన్నమాట. దీనిని భూతార్థానాం తు నః క్రియాణాం స్యా త్తని చిం. భూతార్థమునఁ గదా చెప్పినది. లదర్థమున నందును సూత్రమున స్పష్టముగాఁ జెప్పకుండఁగా 'ఉండిన' అను భూతార్థకరూప మనుబంధ మగుట యెట్లు?

'-అట్టివికృతిచే దానిభూతార్థము పోయి వర్తమానార్థము గల్గె ననియు'——

ఎట్టివికృతి? డివర్ణలోపము. వసతిరనుబన్ద అని చెప్పిన చిం. ఉండిన, ఉన్న అని యగు నని డివర్ణలోపమును (బిందువునకు నకారమును) చెప్పినదా? భూతార్థమున నవర్ణము చేసి, అది వర్తమానార్థమున ననుబంధము చేయుచు నట్టిది భూతార్థము పోయి వర్తమానార్థక మగుటకు డివర్ణము లోపించువర్ణవికృతియె మూల మయినపుడు అట్లని చిం. ఉద్దేశించినపుడు దానిని విధింపకుండు టేమి? 'క్వచిన్నవర్ణే డేర్లోపః' అని డిలోపమును జెప్పినయధర్వణుఁ డేని నట భూతార్థము పోయి వర్తమానార్థము గల్గుటను బ్రస్తావింపలే దేల?

ఇట్టివికృతివలన నట్టియర్థభేదము సహజ మనుకొనియెనా? అస లిట్టివికృతివలన నర్థభేదము గల్గునా? 'క్వచిడ్డోశ్చ తథా భవే త్తనె నిక్కడనే వి.వి. ఉండునేని- ఉన్నేని (వ్యా.సం.స.1465) ఇట నర్థభేదము

ఉన్నవాఁడు వర్తమానార్థకవిశేషణము. ఇది భూతార్థకమె కావలసి యున్ననువర్ణలోపాదివికార మందినది గాన నన్నయాదిమహాకవులు దీనిని వర్తమానార్థకముగ వాడిరి. (వ్యా.సం.స.1465) ఇటనే యేల? ఉండినన్-

ఉన్నన్ (ఉన్నచో) అనుచో నిట్టివికారమె కలదు. అర్థభేద మేర్పడినదా? వర్ణవికృతివలన నర్థభేదము సహజముగా భావింప వీలు లేదు. కావున నర్థభేదమును ప్రత్యేకముగా సూత్రింపవలసినదే.

ఇట్లిట వఝులవారు చేసినయూహ లన్నియు నిరాధారముగా సాగినవే. ఆధారము చెప్పవలె నన్న నన్నయాథర్వణులు క్రియాపదములప్రక్రియ సమగ్రముగాఁ జెప్పలే దని పునరాగమః క్రియాణా మిత్యాదుల దేనినో యాశ్రయింపవలె. అవ్వఁగాక. అది నన్నయాథర్వణులయాశయముగాఁ జెప్పుట విశ్వసించు టెట్లు? ఇందు సహజత్వము నన్నయాథర్వణులపేరివలనఁ గలిగిన దనుట తప్పు కాదు.

వర్తమానక్రియాపదములందు నన్నయ (వండుచు) ఉన్నవాఁడు అనురీతినె ప్రయోగించు నన్న 'వ్యతిరేకార్థే లృటి లటి డుగ్ స్యాత్' అని లట్టునకు డుజ్విధాన మేల? దీనినిబట్టియె వఝులవారు చేసిన'సహజ'ప్రక్రియ చిం. (వి.వి.)కర్త యుద్దేశించినది గా దని నిశ్చయింపవచ్చును.

ఇఁక సూరి దాని ననుసరింపలే దనువిచార మేల?

కావున'సూరి ఉన్న అనునది యేదో శబ్దవిశేష మయినట్లు సమాపకక్రియారూపములలో ననుబంధముగాను వర్తమానార్థకవిశేషణప్రత్యయముగాను వచ్చు ననియు'- చెప్పుట యసహజ మను టొప్పదు. చదువుచున్నవాఁడు చదువుచున్నాఁ డనుచో చదువుచుండినవాఁడు చదువుచుండినాఁ డను రీతి వ్యవహారము గలదా?

చదువుచున్నాఁ డనుచో ఉన్నాఁడు, అనుబంధ మని వఝులవారి మతము. ఇట ఉన్నాఁ డనుచో ఉండుధాత్వర్థము (ఉన్నాఁడు అనుప్రత్యేకక్రియాపదముయొక్క యర్థము) నకుఁ బ్రాధాన్యము లేదు గదా. అట్టియెడ ఉండుధాతువుపై భూతార్థమున నేర్పడిన 'ఉన్న' యన్నది వర్తమానా

ర్థక మగు నని దానిని దగిలించుటకంటె. ఏ త్లేర్పడిన దను ప్రశ్న లేక 'ఉన్న' అనుశబ్ద మగు ననుట శబ్దశాస్త్రోచితము గాదా?

-అది పర మగునపు డుండుధాతువే లోపించు ననియు ని ట్లసహజ ముగాఁ బ్రక్రియాకల్పనము చేసికొనవలసివచ్చెను -(వ్యా.సం.స.1480)

పయి రెండుపద్ధతులలో నేదిశబ్దశాస్త్రోచితమో గుర్తించుట సులువే.

వర్తమానార్థకక్రియాపదప్రక్రియలో 'ఎక్కువసంఖ్య గలసూత్ర ముల నుపదేశింపవలసివచ్చెను' (1480) చిం.లో 'వ్యతిరేకార్థే లృటి లటి డుజ్ స్యా' త్తనుచో వీరు "వండుచుండు + ఁడు- వండుచున్నవాఁడు వర్ణాగమో విశేషః ఇత్యాదిసూత్రముచేతనె రూపసాధనము చేసికొనవలెను" (వ్యా.సం.స.1341) నిజమె. ఇట్టికల్పతరువువంటిలక్షణ మున్న నింతటి ప్రణాళిక యనవసర మనుకొన్న నిట సూరిప్రక్రియలో సూత్రసంఖ్య యెక్కువ యైన ట్లొప్పికొనవలసినదే.

కాని పైని వీరు చూపినచిం.ప్రక్రియలో వండుచుండు + ఁడు అనుచో వర్ణాగమో విశేషః అనుదానిచే బిందుపూర్వకడువర్ణమునకు (ండు) 'న్న' ఆదేశ మైన దనవలె. ఇట భూతార్థానాం తు అని 'న' వచ్చుటయు డిలోపించుటయుఁ దన్మూలమున నర్థము మాఱుటయు ననువీ రూహించిన నన్నయాధర్వణులప్రక్రియలోనిసహజత్యము కొంత నష్ట మగుట గమ నింపవలసియున్నది.

అట్లె ఉండివన్ అనుచేదాద్యర్థమునకు ఉన్నన్ అనునది పాక్షి కముగా నాదేశ మగు నని వే ఱొకసూత్రము నుపదేశింపవలసెను. -(వ్యా.సం.స.1481)

ఇది మఱియు వింత. చిం,వి.వి.లలో నిట్లు ప్రత్యేకసూత్రము లేకయె ఉండినన్- ఉన్నన్ అని యైనదా? చిం. చెప్పలే దన్న నం కీరూపమె కాదు. వి.వి. క్వచిన్న వర్ణే ర్డేర్లోపః- అని డిలోపమును విధించి

నది. 'నకారపరకానుస్వారము నకారముగఁ బరిణమించె' (ఇట్లె మకారపర కానుస్వారముమకారముగఁ బరిణమించిన చేసెంమహానది చేసెమ్మహానది యగు. కాని వచ్చెంగొడు కిత్యాదులఁ బరహల్లుగా ననుస్వారము మాఱదే. ఇట విశేష మన్నమాట.) నని (వ్యా.సం.స.1465) యూహింపవలసిన యవసరమును లేకుండ సూరి 'ఉండినన్' అనుదానికి 'ఉన్న' ఆదేశము చేసి రూపము సాధించుట ప్రశంసార్హము కాఁగా నీతిరస్కార మేల?

అనుబంధప్రత్యయస్థలములందును 'ఉన్న' యన్నది 'ఉండిన'అను దానినుండి సాధించుటచే వీరి కదియు నీచేదాద్యర్థకస్థలమును సమానముగాఁ దోఁచియుండు. అట 'ఉండిన' అనుదానితో రూపాంతరము లేమి గుర్తించితిమి. ఆభేదము సూరిలక్షణముననె స్పష్టము.

'భూతార్థానాం తు' అనుచో క్త్వదర్థకనవర్ణమును జేదాద్యర్థకనవర్ణమును గలిపి వివరించిరి. (వ్యా.సం.స.1463) సూరి స్పష్టముగా వేఱుగా సూత్రించుట యుచితము గదా.కావున నాయంశముననుగౌరవముగా నెంచఁ బని లేదు.

కాఁగా నిట సూరిప్రక్రియ యెంతయు శాస్త్రోచిత మైయున్నది.

పిదప నైన నిది గుర్తించి వరులవారు ప్రస్తుతవ్యాకరణమున నిట్టి యెడల సూరిప్రక్రియామార్గమును యథాతథముగా గ్రహించి సం.లో వీరు చేసిన తిరస్కార మనుచిత మని సూచించుట ముదావహము.

**అఁటు :**

"తిదుటలు పరంబు లగునపు డన్వాదులనుస్థానంబున నున్నయు నుండుడులోపంబును విభాష నగు (58)ననుసూరిసూత్రమున "నున్నయు" ననుచో "నెఱనున్నయు" నని మిగిలిన దట్లు గ్రహించిరి. (ఉ.68) వీరు చేర్చిన "నెఱ"యనువిశేషణము స్పష్టతకే, అది లేనిసూరిలక్షణముచొప్పున నఱనున్న యగునిబ్బంది లేదు.

ఇట నన్వాదు లనఁగా బా.క్రి.54సూత్రమునందుఁ బేర్కొనఁబడిన యన్వాదులే కదా. వీని యన్నింటను "ను"వర్ణము నుడితొలిహ్రస్వముపై నె యున్నది.కావున "అఁటయిఁక-అనుసూత్రము ననుసరించి నుడితొలిహ్రస్వ ముపై నున్నయన్వాదులలోనినువర్ణమునకు ఖండానుస్వారము రా వీలు లేదు. కావున నెఱబిందువు మాత్రమే వచ్చును. వీరును క్రియా62సూత్ర ములో నూరివలెనె బిందు వని సామాన్యముగనే చెప్పిరి. మఱి యట ఖం డము రాకుండుట 'కఁటయిఁక-లక్షణమే కదా మూలము. అదే విధముగా నీసూత్రమునను. కాఁగా వీరు నెఱ' యనుట స్పష్టతకే.

వీరు అనుట-అంట- అఁట అని యైన దందురు. ఇట "నెఱ" యన కున్న అనుట అనుచో నిండుసున్నతోపాటు (అఁటయిఁకచుఁడుసూత్రముచే నిట ఖండ ముండుటలో బాధ లేదు గావున)ఖండబిందువు నయి అఁట అను రూపము నిచ్చుటనే సాధింపఁబడియెడిది. "నెఱ" యనుటవలనఁ బూర్ణబిం దువు మాత్రమె వచ్చుటచే మఱల వీరు దమసంజ్ఞా.14.సూ.చేఁ బూర్ణము నకు ఖండము చేసికొనవలసియుండును.

ఇంక సూరిమతమున నన్న నిట ఖండము రాదనియె యెంచఁదగును. అఁట యన్నది "అనుట" యనుదానినుండి యేర్పడె నని సూరి తలఁచె ననుట కాధారము లేదు. అంట అఁట యన్నవి సమానార్థకములుగా నిశ్చ యముగాఁ జెప్ప వలనుపడదు. అంటవలన, అంటకు ననురీతిగా నాయావిభ క్తులు "అఁట"శబ్దముపై లేవు. నీయంటకు మెచ్చి యనుచో నీయఁటకు మెచ్చి యని యుండదు గదా. కావున అఁట యన్న దవ్యయముగాఁ గోశ ములు పేర్కొను టుచితమె. [దీనినుండి ఖండమునకుఁ బూర్ణమైె అంట యనియు నేర్పడు నదియు నవ్యయమె.] అఁటయిఁకసూత్రమునందలి దీయ వ్యయశబ్దము] అనుటనుండి యేర్పడిన "అంట" కృదంత మయి యాయా విభక్తులను బొందువేఱొకశబ్దము. కావున నీసూత్రముచే నట ఖండ ముం డుట కవకాశము లేదు. కాన సూరిమతమున అనుట- అంట యనుచోఁ

గూడ నీయఁటయిఁకసూత్రము ననుసరించి తింట యిత్యాదులవలెనె ఖండ బిందు వుండదు. సూరిసూత్రము సూక్తము.

## తెమ్ము :

బాల.క్రి.59నుండి62సూత్రములను దాదా పట్ల గ్రహించిరి. (ఉ.69 నుండి72)

61సూ.స్థలమున "కొనుధాతుస్థలమందే కాక స్థలాంతరములందును నీవిధి వర్తిల్లును (తే.రా,కా,మొ॥) తెమ్ము-తెండు(ఉ.398) సూరి యిటఁ గొమ్ము, కొండు అని చూపె నని యాకార్య మీస్థలమందు మాత్రమె యని భ్రమింపకుండుకై పీ రిట్లు వివరించియుందురు. తెమ్ము తెండు మొ॥రూపములు సూరియు స్థలాంతరమున నుదాహరించెఁ గదా.

## కోకుము :

వ్యతిరేకప్రార్థనమునందు కొనునకు కో కన్పట్టదు. కొనకుము కొనకుఁడు చేకొనకుము (ఉ.398)కుజీతో వ్యవధానమువలన బాల.క్రి.60సూత్రముచే నిట 'కో' అనునాదేశము రాదు.'కోకుము'అనురీతివి గానఁబడుటయు లేదు. ఒకవేళఁ గైకోకు మనురీతిప్రయోగము గాననయిన నా(60)సూత్రమందలిబహుళపదము నాశ్రయింపవచ్చును. (పీడ్కో లాభమే [పాండు. 3.42] మున్నగున వట్లే కదా.)

## అంద్రుము :

బాల.క్రి.62.సూత్రము నట్ల గ్రహించిరి. [ఉ.72]

సం.లో "బా.ప్రకీ.17,18సూత్రములు విభక్తిప్రత్యయపరకత్వము నందలిస్వరలోపమును విధించునవి కామింజేసి సూరి యిట నీసూత్రమును

దేశించినవాఁ డయ్యె" [వ్యా.సం.స.1532] ననిరి. అందుచేతనె 'విన్మ్ర' ఇత్యాదులు బాల.చే నసాధ్యము లనిరి వీరు.

ప్రస్తుతసూత్ర ముల్లోపమును జెప్పుచున్నది. ప్రకీ.18సూత్రము లాఁతియచ్చున కని యుచ్చిన్నస్వరలోపము చెప్పుచున్నది. కాన వరుసలవారిట ప్రకీ18సూత్రమును బ్రస్తావింప నవసరము గానరాదు.

ప్రకీ.17సూ.చే వినుము- విన్మ్ర అని యగు నన్న నీసూత్రము వ్యర్థ మగునా? ఆసూత్రము 'నలడర' లయుత్తునకు లోపము చెప్పుచున్నది. ఈసూత్రమున 'తదడ'లయుత్తునకు లోపము విహితము. ఇందలితద లందు లేవు. ఋవర్ణకము పర మగునపుడు గొన్నియెడలఁ గలయీలోపమునకై తదల నాసూత్రమునఁ జేర్చి సానూస్యముగ నెల్లెడలఁజెప్పు టుచితముగాదు. ఇంక బహుళపదము నాశ్రయించి సాధించుకొనవలె. ఎక్కడెక్కడ లోప మగునో స్పష్టముగాఁ జెప్పుచున్నయీసూత్రార్థమునే యచ్చటిబహుళశబ్దము చే గ్రహింపవలె. దానికంటె నిట్లు సూత్రించు టుచితము గాదా?

తదడలయుత్తునకు బిందువు మీఁదనె లోపము అనుదురు- అన్మ్రు అని కాదు గదా. పోషింతురు- పోషింత్రు అని యగును. పోషింపుదురు- పోషింపుద్రు అని కాదు.ఋవర్ణము పర మగునపుడే కాన పోషింత్వు,అంద్మ్ర ఇత్యాదులు నుండవు.

వినుము-విన్మ్ర అనురీతి నరు దగుస్థలములకంటె, పోషింత్రు, అంద్రు, కొంద్రు అనురీతిస్థితియొక్క ప్రాచుర్యము ననుసరించి యీలోప ము వైభాషికముగఁ బ్రత్యేకముగఁ జెప్పుటయె యుచితము. ఉ.లో వీరు నట్లు చెప్పు టుచితముగా నున్నది.

ఇటఁ గలయితరకార్యముల నెట్లును వేఱుగ సూత్రించుచుండెను. కావున వానితోపాటుగ నీయంశమును గూడ స్పష్టము చేయు టుచితమె.

ఇంకను ఉ.లోఁ దత్సమములందును నీవిధి వర్తిల్లవలయును గాన

అచ్చి.29[ప్రకీ.17]సూత్రముచే నిది పునరుక్తము గాదు [ఉ.399] అని చక్కగా బ్రయోజనము నిరూపించిరి,

ప్రత్యయపరకతయందు బ్రత్యేకముగా నిట్టిస్వరలోపము జేర్కొన్నవీరే [అచ్చి.29] యిచ్చటియుత్వలోపము ప్రత్యేకముగా పఠింపవలసి యుండుటను సముచితముగా గుర్తించిరి. కావున బ్రస్తుతసూరిలక్షణము [క్రి.62]ప్రకీ.17[18]సూత్రము ప్రత్యయపరకస్వరలోపము చెప్పమింజేసి చెప్పఁబడిన దనుట యసంగత మని గుర్తింపవచ్చు.

ప్రకీ.17,18సూత్రము ప్రత్యయాగమాదిపరకత్వమున బ్రవర్తించునది కా'[వ్యా,సం.స.1579]దనువీరియభిప్రాయము నిర్మూలము. మఱుచ్చు కుదుర్చు తేల్చు ఇత్యాదులు దానికి లక్ష్యము లగుటలో బాధ లేదు. [చూ. ప్రకీ 17,18,సూ.]

## నామములు-ఇంచుక్కు :

బాల.క్రి.63సూత్రము నట్ల గ్రహించిరి. [ఉ.2] ఈసూత్రమును ముందునకు దెచ్చుటలో సూరిసూత్రమున నపసిద్ధాంతము గల దవి వీరి యుద్దేశ్యము గాకపోవచ్చును. కాని యర్థమున భేదము గలదు. సూరి సంస్కృతధాతువులకు అని ధాతువులకు మాత్రమె యీసూత్రముచే నించుక్కు నని స్పష్టము చేసెను. కాని వీరు సంస్కృతధాతువులకును గొన్ని సంస్కృతనామంబులకును నంగలాదు లగుకొన్ని యాచ్ఛిక[ధాతువులకును] శబ్దంబులకును స్వార్థమునందు ఇంచుగాగమ మగును." [ఉ.354] అని వివరించిరి.

సూరివలెనె వీరును మొట్టమొదట "ధాతువునకు" నను నధికారసూత్రమును జెప్పి ఇంక నుపక్రమింపఁబడునది ధాతువున కగుటను వివరించిరి. అట్టియెడల, బిదప నీసూత్రమున "సంస్కృతంబునకంగలాదుల" కనఁగా- సంస్కృతధాతువునకు నంగలాద్యాచ్ఛికధాతువులకు నని మాత్రమె యర్థము

చెప్పవలసియున్నది. అట్టియెడల 'నామముల' కనునర్థము వీరి కెటనుండి లభ్య మైనదో స్పష్టము గాకున్నది.

అట్లే 'కొన్ని నామముల'కనిరి. కొన్నింటి కనునర్థమున కీసూత్రమున నాధార మేది? ధాతువున కనునధికారసూత్రమును విడిచిపెట్టిన సంస్కృతంబునకనఁగా సంస్కృతశబ్దంబుల కెల్లనని యర్థ మై రామించు, కృష్ణించు ననురీతిగాఁ జెప్పుట త ప్పగునా? అందుకే వీరు కొన్ని అని యుందురు. దానికి సూత్రమున నాధారము లేమి స్పష్టము. అగతికము లగుభ్వాదులకుఁ బ్రయోగము వారింపఁబడుటచేఁ దద్విధానమువలనఁ గొన్నిసంస్కృతధాతువుల కించుక్కు ప్రసక్తి లేదు. నామముల కట్టివిధాన మున్నదా?

ఇంక నాచ్ఛికములయెడల (నంగలాదిధాతువులకె యించు క్కు వు నని వివరణమునఁ జెప్పినను) ఎలుగించు అడకించు అనురీతి నాచ్ఛికనామములపై నించుక్కు చూపిరి. దీనికిని లక్షణమున నాధారము లేదు.

సూరి 'నిర్దిష్టనామంబుల కయుగాగమంబు గలుగ'దనుచో నామంబుల కయుగాగమనిషేధసామర్థ్యముచేఁ గొన్ని (సంస్కృతాచ్ఛిక)నామముల కించు క్కగుటను సాధించెను. వీ రాయర్థమును బ్రత్యేకముగా సాధింపఁ దలఁచినచో నామంబులకుఁ గొన్నింటికి ధాతుత్వవివక్షయం దించు క్కు వు టను బ్రత్యేకముగా సూత్రించుట యొప్పును.

'గాల తిలక అసువాని నంగలాదులలోఁ జేర్పరా దని సం.లో భావించినను (వ్యా.సం.స.1553) నిట నట్లు వీరును జేర్చుట (సూరిమతానుగుణ మై) సముచితముగ నున్నది. (చూ.తద్ధి.11సూ.)కాని 'తిలక'ధాతువును జేర్పలేదు. 'తిలక'(ము) అనునామమునకు 'తిలకించు'అనుధాత్వర్థము లేమి కోశాదుల స్పష్టము. 'తిలక' ధాతువుగా గుర్తించుట యుక్తము.

## ఉపకృతులు-నామధాతువులు :

ఉపకృతిపరిణతిసంవృతు లని (సంస్కృత)ధాతువును త్రివిధముగాఁ జిం. చెప్పియుండ సూరి దాని ననువదింపక స్వతంత్రప్రణాళిక యేర్పఱచు కొనుట వఝులవారికి సం.లో నచ్చలేదు. సూరిమార్గమున విట్బుందులు పెక్కు ప్రస్తావించిరి.

'నుతించు స్తుతించు ఇత్యాదులను సూరి నామధాతువులుగాఁ జెప్పి వాని కించుక్కను బా.క్రియా.65సూత్రముచే జ్ఞాపకము చేసెను. ఉపకృతు ల నంగీకరింపకపోవుటచే - అని వివరించుకొనునవస్థ సూరికి సంభవించె ననిరి. (వ్యా.సం.స.1552) మంచిదే. వ్యాఖ్యాతల కట్టియవస్థ తొలఁగినది. ఇట వఝులవారు ప్రస్తుతసూత్రమునకుఁ జేసినవ్యాఖ్య యెట్టిది? సూరి పడిన యవస్థలు తాము దప్పించుకొనుటకై వీరు ఉ.లో ఉపకృతిధాతువులను బేర్కొన్నట్లు గానరాదు.

'ఏవో యలంతిధాతువులు జ్ఞాపకసిద్ధము లనుట యుక్తము. పరిశ్ర తము లగుధాతువుల నట్లు సంగ్రహించుట యుక్తమా.' (వ్యా.సం.స. 1552)

అనఁగా నుతించు స్తుతించు అనురీతివి పెక్కులు గలవు గావున జ్ఞాపకసిద్ధములు చేయుటకంటె నించుగాగమమును విధించుట యుచిత మని వీరియభిప్రాయ మెన్నఁదగు. పరిశ్రతములుగ నున్నట్లు గుర్తించిన వీరు ఉ.లో నామములకుఁ గొన్నింటికి యని యేల చెప్పిరి? కొన్నియనఁ బరిశ్ర తములా? జ్ఞాపకసిద్ధము లను టొప్పుఁ గదా.కాక వీనివి చిం.వలె ధాతువులు గనె చెప్పఁదగును గాని నామములుగా భావింపరా దని చెప్పఁదలఁచిరా?చిం. 'ఉపకృతిః కృదన్తా' యనె.ఉపకృతి యను పేరె దానిస్వరూపమును సూచిం చుచున్నది.వఝులవారు 'కృదన్తాభా'యని నన్నయసూత్రమును సరి చేసిరి. సూరికి ముందు చిం.సూత్రమున కీపాఠము పుట్టలేదు కావున నిట్టియర్థము

సూరికిఁ దెలియదు కావుననే కృదంతములను ధాతువులుగాఁ దెలుఁగున నైన ను బరిగణించుట సమంజసము గాదని యవి నామములుగ సంస్కృతాను సారముగా నిరూపించెను. సంస్కృతమున ధాతుసంజ్ఞ గలిగినదానినిమాత్రమె తెలుఁగునను (సంస్కృత) ధాతువుగా గుర్తించి పేర్కొన్న సూరిమతముచి తము గాదా? నుతి, స్తుతి ఇత్యాదులు సంస్కృతమున ధాతువులు గావు గదా. తెలుఁగున నట్లే యుపకృతులను బేర్కొన్నచిం. అన్యస్మాచ్చాధాతోః- అని యు నామములకు ధాతుత్వవివక్షలో నించుక్కు చెప్పినది. 'నుతి' మొద లగున విట్టివి యనరాదా?

'మఱియు నిట్లు ప్రాతిపదికముల నెల్ల సంగ్రహించుకొనుసపు డింక ద్వేషించు మున్నగువానికై బా. క్రి. 66సూత్రము నుపదేశించుట సిద్ధ సాధనమె. (వ్యా.సం.స. 1522)

నామధాతువులను బేర్కొనెఁ గావున నెల్లవియు ప్రాతిపదికల నుండియె సంగ్రహింపవలెనా? 66సూత్రముకడఁ జూపిన వెల్ల (సంస్కృత) ధాతువులె యగుట గమనార్హము. సంస్కృతమున ధాతుసంజ్ఞ గలవాని నెల్ల నటనుండి తెలుఁగునకుఁ దెచ్చికొనినపుడు తెలుఁగునను సంస్కృతాను సారముగా ధాతువులుగా గ్రహించి యాపై వికారము లుపదేశించుట సక్ర మము గాదా? అట్లు సంస్కృతాచ్ఛికములు ధాతువులనుండి నిరూపింప నవ కాశము గుదురునపుడే నామములను ధాతువులుగా వివక్షించుట యొప్పును గాన నట నామములనుండి ధాతురూపమును సాధించుకొను టుచితము. సిద్ధసాధనము చేయుటకుఁ దప్ప సముచిత మైనసూరిప్రణాళికను భంగపఱు చుట యనవసరము.

మఱియు నీతఁ డిట్లు నామధాతువులను సృజించుట కారంభించుటం జేసి కరుణాదికృదంతములనుండి కరుణించు మున్నగుధాతువులను, పల్లవాది నమాసములనుండి పల్లవించు మున్నగుధాతువులను కృత్తద్ధితసమాసాశ్చ అనుచొప్పున నామత్వము ననఁగాఁ ప్రాతిపదికత్వమును సంగ్రహించుకొను

నవస్థయు దుర్వార మగుచున్నది' (వ్యా.సం.స.1551)ఇది మఱియు వింతగా నున్నది. కరుణపల్లవాదులను ప్రాతిపదికలుగా గుర్తించుట దుర వస్థయా? కరుణించు అనురీతిధాతువుల నెట్లో సాధించిన కరుణాదిశబ్దముల ప్రాతిపదికత్వము గుర్తింప నక్కఱ లేదా? కృత్తద్ధితాంతములు సంస్కృ తానుసారముగాఁ దెలుఁగునఁ బ్రాతిపదిక లగుట యటనే విశేషముగా గుర్తింపవలెనా? ప్రాతిపదికత్వము సహజమె. వానిని ధాతువులుగా వివక్షిం చుటయె విశేషము. చిం.లో కరుణించు, పల్లవించు అనువాని సిద్ధి నామము ధాతుత్వవివక్షచేతనె తాము సిద్ధింపఁజేసినసంగతి (వ్యా.సం.స.1547) మఱచి రేమో. అక్కడ వీనికిఁ బ్రాతిపదికత్వ మెట్లు సిద్ధమో సూరిమతము నను నట్లు కావున నిటఁ బ్రత్యేక మగునవస్థ యే మున్నది? ఈవాక్యము లచే వీ రేమి చెప్పఁదలఁచిరో కాని దీనియర్థము మాత్రము వారిసిద్ధాంతము నకుఁ దోడుపడునది కాదు.

ఇంకను వీరు 'కరుణాశబ్దము కృదంతమె యగుటచే దీని నుపకృతిగా నేల యంగీకరింపరా దని శంకింపఁజనదు. ధాత్వర్థస్ఫురణవిదూరము లగు కృదంతములనుబట్టి యుపకృతిత్వ మంగీకరించుట సంప్రదాయము గాదు. (ఈసంప్రదాయ మెక్కడినుండి వచ్చినదో యని విచారింప నక్కఱ లేదు. 'భట్టారకునినామధాతూపదేశమె పయిరీతి గలసంప్రదాయమునకు స్ఫోరక మగుచున్నది' వ్యా.సం.స.1547 అనిరి.) కరుణించు అనుధాతువునందుఁ గృధాత్వర్థభావము లేదు గదా' (వ్యా.సం.స.1547) నన్నయను బ్రక్క నుంచి వచులవారియభిప్రాయమును గమనించిన నుపకృతులను జెప్పుట వ్యర్థ మని స్పష్టము గాఁగలదు. నుతి-కృదంతమె. కరుణ-కృదంతమె. లక్షణము పేర్కొనని 'సంప్రదాయముతో' వీనికి భేదకల్పన మేల? నామ ధాతూపదేశముచేఁ గరుణ కృదంత మయ్యు నామధాతు వైనది. ఉపకృతు లను జెప్ప 'నుతి' యుపకృతి యైనది.ఉపకృతులను జెప్పకున్న నిది నామ ధాతువు గాదా? ఉపకృతి యగుకరుణనామధాతు వైనపు డట్టి 'నుతి' నామ

ధాతు వని చెప్పఁ దప్పేమి? 'ఉపకృతిః కృదన్తా' యన్నది కాని చిం. ధాత్వర్థస్ఫూర్తి సంప్రదాయమును జెప్పినదా? కావుననే కొన్నికృదంతములు నామధాతువులు నొకకొన్ని యుపకృతులు ననుటకంటెఁ గృదంతత్వముచేఁ బ్రాతిపదికసంజ్ఞను బొందినవీనిని నామములగనె గ్రహించి ధాతుత్వవివక్షచే ధాతువులుగా (నామధాతువులుగా) సంగ్రహించినసూరిమతము సమ్మతింపఁదగినది.

## అంగలాదులు :

'అంగలాదులలో గాల మున్నగువానితోపాటుగ పయన మున్నగువానిని జేర్చుకొనుటచే -- నట్టివానివి సైతము జ్ఞాపకసిద్ధము లనుచు సంగ్రహించుచిక్కు నేల పడెనో తెలియకున్నది (వ్యా.సం.స) ఇచ్చటి "గాల" యనునది నామము గా దనియు నాచ్ఛికధాతువె యనియు స్పష్టము. ఉ.లో వీరును 'గాల' ధాతువుగాఁ జూపిరి. [ఉ.355] కావున గాలశబ్దముచేర్చెఁగాన పయనాదినామములు చేర్పవచ్చు ననరాదు. అంగలాదు లెల్ల [నాచ్ఛిక]ధాతువులే యగుట సూరిమత మది స్పష్టమె. సంస్కృతమెయైన నాచ్ఛికమె యైన నామముల కీసూత్రమునొద్ద సూరిమతమునఁ దావు లేదు.

సంస్కృతమునెడలవలెఁ దెలుఁగుశబ్దములయెడలను నామవిభక్త్యంతముగాఁ బ్రయుక్త మగుశబ్దము [ఇంచుగాదులతో] క్రియావిభక్త్యంతముగాఁ గూడఁ బ్రయుక్త మగుచో నట నామములే ధాతుత్వవివక్షయందు ధాతువులై యవి నామధాతువు లవును. ధాతుత్వవివక్షచే నామము ధాతు వగుట కలదు గాని నామత్వవివక్షచే ధాతువు నామముగాఁ గావ్యప్రయుక్త మగుట లేదు గదా.

పయనము అనుదానిని సైతము అంగలాదులలోఁ జేర్చి సాధించుకొనుట యుక్తము. అనన్యగతికస్థలములందు మాత్రమె నామములకు ధాతుత్వవివక్షచే ధాతుత్వమును జ్ఞాపకసిద్ధముగా నంగీకరించుట యుక్తము.[వ్యా.

సం.స.1560] అయిన పయనించు అనునది నామమునకు ధాతుత్వవివక్షచే ధాతు వగుటచే నేర్పడినది కాదా? పై వాక్యములవలన 'పయనము' అన్నదియు ధాతువే యని యర్థ మగుచున్నది. ఇది వారియుద్దేశ్యమును గాదు. అంగ లాదులు ధాతువులే యని గుర్తించినపుడు (వ్యా.సం,స.1547] అందు నామ ములు చేరుట యెట్లు?

ధాతువునకు అనునధికారసూత్రము ననుసరించి యిట సూరి సముచిత ముగా సంస్కృతాచ్ఛికము లెల్ల ధాతువులేచూపియుండఁగా వీరు ఉ లో నిరా ధారముగా 'కొన్నినామములు' చేర్చుట యసమంజస మైయుండ సూరి యట్లు చేయలేదని విమర్శించుట యుక్తమా?

కాఁగా సూరి ప్రస్తుతసూత్రమునొద్ద నామములను బ్రస్తావింపకుండు టయుఁ బ్రయోజనము లేని 'ఉపకృతి' విభాగము ననుసరింపకుండుటయు,నుచి తములు. అవి కొన్నియు నామముల ధాతుత్వవివక్షచే ధాతువు లై ప్రయో గింపఁబడుటను జ్ఞాపకసిద్ధము చేయుటయు సంప్రదాయానుగుణమె. దీనిని దిరస్కరించుటకు సరియైనయాధారము చూపలేదు వీరు. సూరిమతము సము చితము. నామములకుం గొన్నింటికి ధాతుత్వవివక్షలో నించుగాదు లగుటను బ్రత్యేకముగా సూత్రించుట తప్పు గాదు. కాని యట్లు గాక సూరి జ్ఞాపక సిద్ధము చేయుటయుఁ దప్పు గాదు. వరుఘలవా రెట్లును లక్షణబద్ధము చేయ లేదు.

ఇల్లు ఇలు అనునాగమములను జేర్చుటచేత సైతము కొన్నితత్సమ ధాతువు లేర్పడును.' (చూ.క్రియా.74) (ఉ.355) క్రియా74సూ.చే వీరు ఇంచుక్చకారంబునకు సబిందుకంబునకు ద్విరుక్తలకారము విధించిరి. కావున నట ఇల్లు, ఇలు అనునవి ప్రత్యేకము లగునాగమములుగాఁ జేరుప్రసక్తియే లేదు. కావున ఇల్లు ఇలు అనువానిని బేర్కొనుట యనవసరము స్పష్టతక

యయ్యెను. ఇంచునుండి యేర్పడుట ప్రస్తావింపఁదగు (ఇలు అనునదియు వేఱుగాఁ జెప్పుట యింకను విశేషము.)

## అయుఙాదులు :

'ఇఉఋల కించుక్కు పరం బగునపు దయుగవుగరుక్కు లగు' (64) అనుసూరిసూత్రమును వీరు "సంస్కృతధాతువులతుది నున్న ఇ-ఉ-ఋ- అనువర్ణంబుల కించుక్కు పరం బగునపుడు వరుసగా (అయ్-అవ్-అర్) నయుగవుగరుక్కు లగును [ఉ.3] అని చూపిరి. వఝులవారి యీలక్షణము సూరిసూత్రమునకు సంగ్రహవ్యాఖ్యవంటిదే. సూరిలక్షణమున దురుక్తి లేదు. ఇంక వీరియీసూత్రమువ్యాఖ్యానప్రాయ మగుటచే నిందు దళ సార్థక్య మెన్నుట యనవసరము.

బాల.క్రియా.70.సూత్రమునందలి'సర్వంబునకు' ననుదళ మిచ్చోట్ల విధులు సంస్కృతములకె యని నిరూపించును. వఝులవారు స్పష్టముగా 'సంస్కృతధాతువుల' కనుట యుచితమె.

## నవించు :

యథాప్రసిద్ధి ధాతూనాం ప్రయోగస్స్వమ్మతోభవే త్తనురీతిని సూరి వచింపమింజేసి ప్రకృతసూత్రముచొప్పున 'ను' మున్నగుధాతువులనుండి నవించు మున్నగుధాతువు లగునపసిద్ధాంత మేర్పడుచున్నది. (వ్యా.సం.స. 1559) ప్రాదులతోఁ గూడినను గూడకున్నను అద్ మొద లగుసంస్కృత ధాతువులు దెలుఁగున బ్రయోగింపఁబడమింజేసి యిట్లు సూత్రింపవలసినదే యని తోఁచుచున్నది. (వ్యా.సం.స.1567) కాని వఝులవారైన నాలోటు పూడున ట్లిట నట్టిసూత్రమును జెప్పలే దేలకో.

కాని 'యథాప్రసిద్ధి- యనునది చెప్పకుండుటచే 'నిర్జినామంబుల కయుగాగమంబు గలగదు మున్నగుసూత్రముల నుపదేశించుకొనుప్రక్రియా గౌరవమును గల్గుచున్న (వ్యా.సం.స.1559)దనుట సరి కాదు.'జి'యన్నది

పరిణతిధాతు వనియు 'నిర్జి' సంవృతిధాతు వనియు 'యథాప్రసిద్ధి' అను కారిక చెప్పుచున్నదా? (వ్యా.సం.స.1541) ప్రయోగానుసారముగాఁ బరిణతియో సంవృతియో తెలిసికొనవలె. అట్టియవసరము లేక (సూరి) లక్షణమె స్పష్టము చేయుచుండ దానిం దిరస్కరింప నేల? ప్రయోగముల నాశ్రయించి తెలిసికొ మ్మన నేల? ఇట్లై 67,68,69 మొ॥సూత్రములు. సూరి చిం. వలె ఉపకృతిపరిణతిసంవృతిభేదకల్పనము చేయలేదు. అది యనవసర మని గుర్తించి వరుులవారును సూరివలె ఉ.లో నట్టివిభాగము చేయకుండు టుచితముగా నున్నది. ఇంతకును సూరివలెనె యిట వరుులవారును నిర్జి కయుగాగమమును వారించుచు లక్షణము చేసి పైని సూరిలక్షణమునఁ బేర్కొన్న యనౌచిత్యము సత్యము గా దని తామే నిరూపించిరి.

## అయుగభావము :

'నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు' (65)అనుసూరిసూత్రమును పీరు "నిర్‌పూర్వకజిధాతువునకు అయుక్కు లేదు' (4) అని చూపిరి. 'నిర్జికి' అనుసూరిసూత్రదళమునకు వివరణమె నిర్‌పూర్వకజిధాతువునకనుపీరివచనము. సూరిసూత్రమున నపసిద్ధాంత మేది?

నామంబుల కనుదళమును పీరు దమసూత్రమునఁ దొలఁగించిరి. తమపూర్వసూత్రమున "సంస్కృతధాతువులతుదిని" అని పేర్కొనుటచే నామముల కయుగాగమము ప్రాప్తించుట లే దని పీరు తలఁచి రేమో. కాని యివి సహజములుగా నామము లయ్యు ధాతుత్వవివక్షచే ధాతువు లగును. కావుననే యించుక్కు రాఁగా మీఁద లకారాదు లగుచున్నవి, నామధాతువులును ధాతువులే యగుటచేతను, వీరు ప్రపూర్వసూత్రముచే వానిపై నించుగాగమమె శ్లేని జేసియేయుండుటచేతనె స్తుతి + ఇంచు ఇత్యాదినామధాతువులకుఁ బూర్వసూత్రముచే నయుగాగమము రాకతప్పదు. కావుననె ప్రస్తుతసూరిలక్షణమున "నామంబుల" కనుదళము స్వాంశమునఁ జరితార్థ మయినది, మఱి పీరిమతమున స్తుతయించు నుతయించు అని యగుట నివారింపఁబడునది

యెట్లు? కాఁగా వీరు నామధాతువులకు సూరివలె జ్ఞాపకసిద్ధముగాఁ గాక ప్రత్యేకముగనె యించుక్కను సాధించితి మని తలఁచినను వాని కయుగాగమము ను నిషేధింపకుండుట సమంజసము గానేరదు. అపరూపము లేర్పడక తప్పదు.

అసలు వీరు నామముల కించుక్క లక్షణముచే సాధించినజాడయే లేదు. ఈసూత్రమున నామంబుల కయుగాగమనిషేధసామర్థ్యముచే నైననుసూరిమతమున ధాతుత్వవివక్షయందునామములకుఁగొన్నింటికించుగాగమము లక్షణబద్ధము చేసెను. వీరు తమవ్యాఖ్యలో వివరించిరి. సంస్కృతంబున కంగలాదుల కనుయుత్రము సాధింపఁజాల దని గుర్తించితిమి గదా. ఇఁక వివరణమున విశేషలక్షణము చెప్పవచ్చుఁ గాన వీరిమతమున నట్లు గ్రహింపరాదా? అన్న వివరణముచేఁ జెప్పువీరిమార్గముకంటె సూత్రమున జ్ఞాపకసిద్ధము చేయుపద్ధతి సంప్రదాయానుగుణముగా సమంజసము గాదా? (తెలుఁగు నందలిమిశ్రసాధ్యసమాసము లత్యల్పము లనియె వీరు సామాన్యశాస్త్రసిద్ధములు గాకుండఁజేసిరా. నామధాతువులప్రత్యేకత సూత్రమున గుర్తించిన సూరిలక్షణము దానిప్రాచుర్యమును ప్రస్తావించియు నెట్లేని సూత్రబద్ధము చేయఁజాలనివరులవారిలక్షణమార్గముకంటె సమంజస మనుటలో సందేహము లేదు.

ఇఁక సూరి నామముల కయుగాగమము మాత్రమె నిషేధించెను. తెలుఁగున ఋదంతము లగు(సవితృవిథాతృమాంధాతృ)నట్టినామధాతువులు లేవు. ఉదంతములు గల వేమో చూడవలె.వాని కవుగాగమ మగుటలో బాధ లేదు సూరిలక్షణముచే.

## గుణము :

"సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్క పరం బగునపుడుగుణం బగు" [66] ననుసూరిసూత్రమును వీరు "సంస్కృతధాతువులయుపధ లగు

ఇఉఋవర్ణంబుల కించుక్కు పరం బగునపుడు గుణాదేశం బగు" [ఉ.5] నని చూపిరి.

'ధాతువునకు' అనునధికారసూత్రమునుబట్టి ధాతుపదమును సూత్రమున( జెప్ప నక్కఱ లేదు. సూరివివరణము 'సంస్కృతధాతూపధలకు' అని వివరించుట నీయధికారము ననుసరించియే. సూరివివరణమందలిదీనిని వీరు సూత్రమున( జేర్చిరి.

సూరి 'లఘూపధంబులకు' అన(గా వీరు 'ఉపధ లగు ఇఉఋ అను వర్ణంబులకు' అని సూత్రమునందు వివరణము చేసిరి. అయినను విందు( గొంతవిరోధము గమనింపవచ్చును.

"పీడ్ ఘూష్ మున్నగునవి లఘూపధంబులు కామింజేసి పీడించు-ఘూషించు మొ॥ (వ్యా.సం.స.1561) కా(గా వీ రిట లఘువు లని చెప్పి కుంటచే పేడించు (పీడించు) ఘోషించు (ఘూషించు) వంటియపరూపము లను సాధించిరి. ఇంతకు ముందు (క్రియా.3) ఇ-ఉ-ఋ అనువర్ణంబులకు అని సూత్రించి- నీ-నయించు- లూ-లవించు- తౄ-తరించు (ఉ.356)అని చూపిరి. అట్లు యిట( గూడ సూత్రమున ఇఉఋ అనువర్ణంబులు అనుచోటి యనుకరణముచే( దత్పూర్వమం దున్నవి(హ్రస్వములు)మాత్రమె గ్రహిం ప(బడు నన వీలులేదు.కా(గా సం.లోనివీరివివరణము ననుసరించియె లఘూపధంబున కనుసూరిలక్షణము సూక్త మని గుర్తింపవచ్చును.

సూరి "గుణం బగు" నన(గా వీరు"గుణాదేశం" బగు నని.ఇది యు వివరణమె. లఘూపధంబునకు (ఇఉఋవర్ణంబులకు) అనుచోటిషష్ఠివలన తత్"స్థానమున" నవుట సంప్రదాయసిద్ధము.వీ "రాదేశ" మనుట స్పష్టతకె.

సూరిసూత్రమె సూక్తము.

## సంకోచించు

బాల.క్రియా.67,68,69 సూరిసూత్రము లట్లు గ్రహించిరి (ఉ.6,7,8.)

నడుమ(68) సూత్రమునొద్ద కుచధాతువునకు గుణము లే దనుటన దిరస్కరించువివరణమును వీరు దొలఁగించిరి. గుణము లేనిలిఖభుజాదులలో వీరు కుచధాతువును బరిగణింపలేదు గావున దీనికి గుణ మగు ననియే వీఁ ను దలఁచి రనవచ్చు. సం.లో [సంపూర్వకకుచధాతువునకుఁ గూడ ముణి గిపోవు అనునర్థమున గుణము రా దనియు, వెనుదీయు అనునర్థము గుణంబు వచ్చు ననియుఁ జెప్పుట యుక్త మని తోఁచెడిని [వ్యా.సం.ప 1562] అనిరి. కావున నేయర్థమున నైన గుణము వచ్చు నని వీ రిట నేః యు వివరింపకపోవుటనుబట్టి గ్రహింపఁదగునా? "సంకోచించు- కుచరోధే సంకుచించుచున్నాఁడు ఇతి రూపం సంవృతేరపి" [కవిశి.672] అనునహో బలోక్తిని సూరి పై నట్లు నిరసించె.

## ప్రేరణించుకు

క్రి.70. సూరిసూత్రము నట్లు గ్రహించిరి. [ఉ.73]వివరణము "వచించు అవులించు మున్నగుస్వార్థేంచుగంతములమీఁద నైతము ప్రేరణా మున ఇంచుక్కు నిల్చు ననుటకయి సూత్రమున "సర్వమునకు" అనుద ము నిల్పఁబడె"[ఉ.399] ననిరి.వీరిసూత్రమున నట్లు గావచ్చును.కాని సూ సూత్రమున నిట్లు గాదు.

"వచింపించు, అవులింపించు, వదడించు" అని సూరి చూపినలక్ష క్రమము ననుసరించి, సంస్కృతాచ్ఛికధాతువుల కెల్ల వచ్చు ననుటయెసూ యుద్దేశ్యము. "ఇడుబులకు" అనునది మొదలుకొని యింతకుఁ బూర్వవ వఱకు నాయాకార్యములు సంస్కృతధాతువులకు మాత్రమె విధింపబడిన కావున నిటఁ గూడ నట్లు గాక యాచ్ఛికధాతువులకు నైతము వచ్చుననుట "సర్వంబునకు" వనుదళ ముంచఁబడిన దనఁదగు. వచించు [సంస్కృతము

అవులింపించు [అంగలాదులు] వండించు- (ఇతరము) అనుక్రమ మిదే సూచించు.

## ప్రేరణము-చేయు :

ధాతువునుజ్యంతముపైని చేయుధాతువును నిల్పినచో నది ప్రేరణార్థము నిచ్చును. కొలుచు- కొల్వఁజేయు- కొల్పించు (ఉ.400) ఇది సూరి బాల.లో చెప్పనియంశము. కాని ప్రౌఢ. పేర్కొనె. (క్రియా.18) దాని నుద్ధరించిన బా గుండెడిది. రి గ్రంథాంతరమున నీవిషయమును పేర్కొనెను. ప్రౌఢ.కంటెనువిశేషముగాఁజనుధాతువునకీకార్యమునిత్యమగుటయు (ప్రేరణమున)సూరి స్పష్టము చేసె. (చూ.త్రి.శే.)

## పాటిలు :

క్రి.71.సూరిసూత్రమును దాదా పట్లు గ్రహించిరి. (ఉ.74)

వివరణమున సూరి పాటిలు ము న్నగునేకలకారఘటితరూపముల నేల యుదాహరింపలేదో తెలియదు. -అధర్వణుఁడు సద్దానివి సూత్రించి యున్నాఁడు. బా.ప్రకీ.7.చే లకారలోపము రాకపోదు' (ఉ.401) అనిరి. ప్రకీ.7.సూ.చే నగు నను నుద్దేశ్యముతోనె వీ రొకలకారము లోపించుటను సూత్రింపలే దేమో. ఈకార్యము(సూరి) విధింపవలసిన దనుట తప్పదు. కాని వరుఖలవారు'అకారంబుక్రింది- యనుప్రకీ.7,సూ.చే లకారలోపము రాఁ గల దనుట విచార్యము ఇట్లే పీని నక్కటాదులలోఁ జేర్పఁదగు ననుటయు (వ్యా.సం.స.1576) సరి గాదు. ఆసూత్రములచేఁ దత్సమములయందు లోపము చేయుట యుక్తమా? అచ్చటియాయావిధు లెల్ల నాచ్ఛికములకు సంబంధించినవే. వీరును ఉ.లో నాచ్ఛికపరిచ్ఛేదమునన చేర్చిచూపి యవి యాచ్ఛికవిధు లని (ఉ.168) స్పష్టము చేసిరి.అట్టియెడల రంజిలు,సంధిలు అనురీతిని దత్సమములందు లకారము లోపము దానిచేఁ జేయ నగునా? అచ్ఛికముల కొకటియుఁ దత్సమముల కొకటియుఁ గాక సామాన్యముగానిట్టి

లకారమును జెప్పుప్రత్యేకవిధి యుండుటయె యుచిత మని తోఁచు.

ఇల్లుత్కు-న నొక్క-లకారంబునకు లోపంబు (57) అని సూరి ఆం. శ.శా.లోఁ జెప్పెను. ఇటఁ గూడఁ జెప్పవలసినది.

## ఇంచుగ్లోపము:

'ఇంచుక్కు- పరం బగునపుడు రంజాదులయిఁచుక్కు-నకు లోపం బగు' (72) ననుసూరిసూత్రమును 'ప్రేరణేంచుక్కు-- -(75) అని యట్ల గ్రహించిరి. ప్రేరణార్థమున నైనది తప్ప రంజాదులయించుక్కు-మీఁద నిం కొకయర్థమున నైనయించు క్కు-ండదు. కావున వీరు 'ప్రేరణ' విశేషణ మును జేర్చుట స్పష్టతకె. అది లేని సూరిసూత్ర మసందిగ్ధమై సూక్తమై యున్నది.

## చుగాగమము:

బాల.క్రియా.73,74లక్షణముల నట్ల గ్రహించిరి. (ఉ.76,77)

ఆచ్ఛికములపయిని చువర్ణకమును నిల్పినచో నవి కొన్నియెడల ధాతువు లగును. (చువర్ణము నిల్పినచో నెల్లయెడల ధాతువె యగును. చువర్ణము నిల్చుటయె కొన్నియెడల నని వీరియభిప్రాయము గుర్తింపఁ దగు.)ఎదురు-ఎదురుచు- ఎదిరించు చెమరు- చెమరుచు, చిగురు- చిగురుచు (చిగురించు) కొన్నిధాతువులకు స్వార్థమందును చువర్ణకము చేరును. ఉదా తనరు-తనరుచు, మొ॥' [ఉ.402] వీ రిట 'చు'వర్ణక మనిరి. ఈసూత్ర మున [ప్రేరణమున నైనను) 'చుక్' ఆగమముగా విహితము. స్వార్థము నందలిచువర్ణము ప్రత్యయమా? సం.లో 'ఆచ్ఛికనామములకు ధాతుత్వవివ క్షయందు చుగాగమము చేరు నని -- [వ్యా.సం.స.1582] ప్రకృతసూత్ర ములోనిటహాళపదమహిమచేఁ గొన్నియాచ్ఛికధాతువులకు స్వార్థమందును చుగాగమము వచ్చుట కన్పట్టుచున్నది [వ్యా.సం.స.1594] అని యాగమ ముగనేగుర్తించిరి.ఆగమాన్యచకారముల కనుసూత్రముచే వీనికిఁ బత్వమును

నట [1582]వ్యాఖ్యానించుటనుబట్టి ఉ.లో దీనిని వీరు వర్ణక మనుట సరి గా దని గు_ర్తింపఁదగును.

ఎదురు అనుధాతువును గలదు. తనరుచు అనుచోవలె ఎడురుచు అనుచో స్వార్థమునందుఁ జు క్కు_యిన దనఁదగు.'ఎద్రుచు లోనిది స్వార్థిక చుగాగమము.' [ఉ.403]

'ఎదురు అనునామము నంగలాదులలోఁ జేర్చినచో ఎదిరించు అను రూపము సిద్ధించును.' [వ్యా.సం.స.1582] అందుకే వీరు సంస్కృతంబున కంగలాదుల కనుదానిచేతనే నామములకు నించుక్కు_ వివరించి రేమో. [ఉ.354,355] అట్టియెడల సంస్కృతశబ్దముచే ధాతువులు నామములు రెండు నాసూత్రమున గ్రహింపవలె నేమో. అందలియిబ్బంది లట గు_ర్తించి తిమి. కాని యిట్లు తలఁచినవీరు నుతి, స్తుతి మొద లగువాని కయుగాగమ మును నిషేషేధింపకుండుట యెట్లు సరిపడు నని తలఁచిరో స్పష్టము గాకున్నది.

అచ్ఛికనామములకు ధాతుత్వవివక్షయందుఁ జుక్కు_నకు సూరిమత మున నీసూత్రమందలిబహుళపదము నాశ్రయింపవలయును. వయ్యాలవారు నీయంశమును బ్రత్యేకముగా సూత్రింపకుండుట విశేషమె.

## ఇత్వము :

చుక్పువర్ణంబులు పరంబు లగునపు డిత్వంబున కుత్వం బగు [75] ననుసూరిలక్షణమును చుక్పుగ్వర్ణకంబులు -- [78] అని యించుక మార్చి చూపిరి. వర్ణకము లనుచు చుక్, పుక్. అని కిత్తులుగాఁ జెప్పుట విశేషము. చుగాగమంబు. [76] పుగాగమంబు [77] అని వీరును సూరివలెనె వీనిని కిత్తు లగునాగమములుగనె చెప్పిరి. కావున నిట వీరు 'వర్ణకంబులు' అనుట ప్రమాదము. వర్ణకం బనుచో వీరిసూత్రమున 'క'వర్ణ మచ్చుపొరపాటున

నధికమునఁ బడిన దేమో. సం.లోను నిటఁ ప్రేరణార్థకప్రత్యయము (వ్యా. సం.స.1587) లనిరి.

మరి 'చుక్కువర్ణంబు' లన వీరు చుక్పుక్కు లని పువర్ణమును గూడఁ గిత్తుగాఁ జేర్కొనుట విశేషము. (వ్యా.సం.స.1587) సూరి పువర్ణమును కిత్తుగాఁ బేర్కొనమింజేసి కిత్తుగానిపువర్ణము పర మయినను నీసూత్రముచే నిత్యమున కుత్వ మగును. తనియు-తనుపు పులియు-పులుపుఇత్యాదులలోఁ గృత్తయినపువర్ణకము పర మగుచుండఁగా నిత్యమున కుత్వ మగు. (సూరి యిటఁ జూపిన కలుపు తడుపు అనునవి కృదంతములు నగుననిపించు) 'పుక్' అని కిత్తుగా నిర్దేశించినవరుులవారిలక్షణముచొప్పున నిట సుత్వమున కవకాశ మాసూత్రముచే లేదు.

సూరిలక్షణము సూక్తము.

## పెక్కుదెఱఁగులు:

బాల.క్రియా.76.సూత్ర మట్లు గ్రహించిరి. 'బిగియు' మాయ్యాదులలోఁ గాక యడంగ్వాదులలోఁ జేరు ననుట [వ్యా.సం.స.1557] యుచితమె. [79] 'ఇంచుక్కుక్కుగాగమంబులు పరంబు లగునపు డాగమాదేశ లోపంబులు పెక్కుదెఱంగులం గానంబడియెడి'[77]ననుదాని నట్ల గ్రహించుచునే పెక్కుదెఱంగు లనుదానిని 'పెక్కుతెఱంగుల' నని చూపిరి. ఇటఁ గర్మధారయమున [గసడ]ద[వ]ఆదేశము విరుద్ధ మని యేమో.కానిబందుగడ ఇత్యాదిగా నీయాదేశము కవిప్రయోగప్రసిద్ధమె. (చూ.సంధి.13) దీనిని బట్టియుఁ గర్మధారయమున నీయాదేశము సూరిసమ్మత మనవచ్చు. (అసలిది వ్యస్త మన్నను బాధ గానరాదు.)

పిన్నచుము మోఁకాలు అనురీతిగా సూరి యిటఁ జూపిననామములను వీ రంగలాదులలోనివిగాఁ జెప్పుట సూరిసమ్మతము గాదు. అంగలాదులు [అచ్చిక]ధాతువులు.

పెరుఁగు తునుఁగు అనువానిలో సూరి పేర నున్న యాంధ్రధాతుమాల లోను ఖండానుస్వారము గానరాదు. ఇది యెక్కడి ప్రమాదమో. వజ్ఝలవారు చూపు టుచితము.

## పసఁచు :

'పసుచు- పంచు- పసుపు- పంపు వీనియాద్యక్షరలోపమున నేర్పడిన వనఁదగిన అనుచు- అంచు అనుపు అంపు (నీలుగుప్రభృతులలోఁ జేర్చి రేమో, కాని యవసరము గాదు.) అనునవియు- పోవుధాతుప్రేరణరూప ములె యనియు వీనికి ఆజ్ఞాపించు అనునర్థము గౌణముగఁ గల్గు నవియు సూరియాశయము. (ఉ.405) అందువలననే కాఁబోలు వీరు 'పుచ్చు' ఒక్క టె చూపిరి.

పోవునకు పసుచుప్రభృతులకును 'నాకారసామ్యము' లే దని దాని నిట్లు కుదిర్చిరి. 'పనిశబ్దమునుండి చువర్ణకయోగమున(క్రియా.76) పనుచు మున్నగునవియు వానియాద్యక్షరలోపమున అనుచు మున్నగునవియు నేర్ప డియుండు' (ఉ.496) ననుటలో నాకారసామ్యము గుదిరినది. కాని ప్రధాన మగునర్థమునందే సామ్యము లేదు. 'అర్థము సరిపడినను' (వ్యా.సం.స.15 95) అనుట సరి కాదు.

పనిశబ్దముపై 76.2.వివరణముచే చువర్ణకము చేయు మనిరి. 76 సూత్రము చుగాగమమునే విధించిన వీరు సం.లో చుగాగమమే యన్నను నిట చువర్ణక మనిరి. ప్రత్యయాగమము లభిన్నములుగా వీరు తలఁచుగా వ్యవహరింతురు. పనుచు, పంచు అనురీతివర్ణవికారమునకె ప్రస్తుతసూత్రము నాశ్రయింపవలెఁ గాన దీని ననుసరించి 'చు' ఆగమ మైననె కుదురును. ఎట్లయిన చువర్ణము చేయవలె. (76.2.వివరణమున వీరు "అచ్చికశబ్ద ములపయిని చువర్ణకమును నిల్పినచో నవి కొన్నియెడల ధాతువు లగు' ననిరి. ఉ.402) ఇవి స్వార్థమునంద యుండుఁ గాని ప్రేరణార్థకములు

గావు గదా. (వ్యా.సం.స.1584) కాఁగా 'పనుచు' అనఁగా 'పనిచేయు' అను రీతిని స్వార్థమె. కాని యీపనుచుప్రభృతు లన్నియుఁ బ్రేరణార్థకములు గదా. కొన్ని యాచ్ఛికనామములపై చువర్ణకము ప్రేరణార్థమునం దగు నని చెప్పుకొనవలె. వీ రట్లు చెప్పలేదు. ధాతుత్వము లేకయె ప్రేరణార్థకరూప మేర్పడుట భాషలో నింక నెట నేని గల దేమో వెదుకవలె. ఇంక నిది యంతర్భావితప్రేరణమా? (వ్యా.సం.స.1595)స్వార్థమునం దస లుండదా? వింతయే.

ఎ ట్లే నాజ్ఞాపించు అనునర్థమును వీరు దీనికి నియమింతురు గాక. దీనికిఁ బోవుధాతుప్రేరణరూపార్థము లేదా? పోవునకుఁ బ్రేరణరూపము 'పుచ్చు' అను నదొక్కటి వీరు చూపిరి. పనుచు ఇత్యాదులకుఁ బుచ్చు అను నర్థ మెట్లు? పనుచు-పంపు- అరుగఁజేయు- వృద్ధాంగునలం దోడుగఁ బనిచి, (అనుచు అరుగఁజేయు- నిజపురంబున కనిచె [సూ.ని.] అనురీతిని వీనికిఁ బోవుధాతుప్రేరణార్థము ప్రసిద్ధమె. పని యనునామమునుండి ధాతువుగా నేర్పడినపనును అనుదాని కీయర్థ మెట్లు సంభవించును? అందుకై పోవుధాతు ప్రేరణరూపములుగా వీని నంగీకరింపక తప్పదు.

కావున నాకారసామ్యముకంటె ముఖ్య మైనయర్థసామ్యము ననుసరించియె సూరి 'పుచ్చు' అనునర్థమున వీనిని సాధించుట సమంజసము.

'ఆజ్ఞాపించు' అనునర్థమున సైతము వీరినిరూపణము సరిగా లేమి గ్రాహ్యము గాదు. ఇట్టియర్థము లౌపచారికముగా పోవుధాతుప్రేరణరూపము లైనపనుచుప్రభృతులకుఁ గల వని శ.ర. పేర్కొన్న మార్గము సమంజసము. సూరిసమ్మతము.

పనుచుప్రభృతులవలె ననుచుప్రభృతులను గూడ నిటనే సంగ్రహించుటలో సూరిమతమున లాఘవము స్పష్టమె.

లేమి నించుక్కను లేదు. కాఁగా దీనికిఁ బ్రేరణరూపమె యుండ దనవలె. అది యొప్పునా?

శ.ర. సూ.ని.లు కూరుచు కూడుధాతుప్రేరణరూపములుగనె చూపినవి. 'కొమ్మ నలవరించి కూర్చు టరుదె (విరా.2.280) అనుచో కూర్చు అనుచో కూడునట్లు చేయు అని యర్థము. కూరుధాతువున కిట్టియర్థ మున్నదా?కూరు ధాతువునకు కలుగు పొందు అనురీతియర్థములె యుండఁ బ్రేరణమున నీవిశేషార్థ మెట్లు?

కాఁగా సూరియర్థానుగుణముగా కూడుధాతువున కీకార్యమును జెప్పుటెంతయు నుచితము. వరులవా రది తొలఁగించుటయు (పునరుక్త మనుటయు) సరి గాదు.

ఇంక సూరి 'చుక్క పరం బగునపు' డనఁగా వీరు ప్రేరణార్థక చుక్క పరం బగునపు డనిరి. వీనికి స్వార్థమునందుఁ జుగాగమము లేదు. కావున వీరు ప్రేరణార్థ మని యధికముగాఁ జెప్పుట ఉ.75సూత్రమునవలె స్పష్టతకె. అసందిగ్ధముగా నున్న సూరివచన ముచితము.

ఇట్లే సూరి "రేఫం బగు" నన వీరు "రేఫాదేశం బగు" నని 'యాదేశము'గాఁ జెప్పుటయు స్పష్టతకే- 'డకారంబునకు' అనుషష్ఠిచే నీయర్థము స్పష్టము.

సూరిసూత్రమె సూక్తము.

## ఉత్వమున కిత్వము :

బాల.క్రియా.81నుండి84లక్షణము లట్ల గ్రహించిరి.(ఉ.81నుండి87)

'ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచోనన్యాద్యం బయినయుత్వంబున కిత్వం బగు' [85] ననుసూరిలక్షణమును 'ఇత్వంబు గాని ఎత్వంబు

గాని గూర్చుచో ననాద్యం బయినఉత్వంబునకు ఇత్వంబు బహుళంబుగా నగు' [88] నని చూపిరి. నడుమ నడుమ సంధి మానుట స్పష్టత కేమో. అది యనవసరము. ఇఁక సూరి'ఇత్వం బగు' ననఁగా 'బహుళంబుగా నగు' అని సవరించిరి.

బహుళం బనుటచేత నీసూత్రము ప్రయోగానుసారముగా వర్తిల్లును. -పురుటియాలు- పురుడించు- -పగుల్చి (ఉ.450), పయిసందర్భమును బట్టి యిది బహుళ మనుట యుక్తము. (వ్యా.సం.స.1610) అందుకని యిట బహుళ మనిరి. ఇత్వమునకు యతిస్థలఘటితప్రాచీనప్రయోగము లభింపలేదని యీవిధిని దొలఁగింపకుండుట యుచితమె.

పురుటియాలు, పురుటిల్లు అని ప్రకృతసూత్రవిరుద్ధము లనుట యసమంజసము. పురుడు- పురుటియొక్క- యనుచో నౌపవిభక్తిక మగుటివర్ణ పరకత్వమున 'టితివర్ణంబులు పరంబు లగునపు' (అచ్చి.36) డనుసూత్రముచే రావలసినయిత్వ మచ్చో సూరి 'కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టెడు- నెత్తుటికి' నని చెప్పుట కనుగుణముగా నట్టిదిగా నెన్నఁదగును. నుదుటికి ననుదానివి సూరియె సూత్రాంధ్రమునఁ జూపె. కాఁగా నివి యే సూత్రమునకు విరుద్ధము లనఁగలము?

పురుడించు పగుల్చి యన్న విటఁ జూపఁదగినవె. కాని వీనికై 'బహుళ' మనవలెనా? 'మగిడి-మగుడి' యనుతీరుగా వైభాషికస్థితి ప్రచురముగాఁ గలదా? ఇట్టికొన్నిచిత్ర-స్థలములకు 'అగు'అనుట విరుద్ధము గా దని పైచోటిసూరివివరణమె నిరూపించును. సూరిలక్షణము సూక్తమె.వీరైనఁ 'దఱు' చనుట కొంతవఱ కుచిత మనవచ్చు.

## చకారము-పత్వము :

బా.ల.క్రి.86సూత్రము నట్ల గ్రహించిరి. (ఉ.90) 'ప్రేరణేంచుక్కు-పరం బగునపుడు పకారంబు చకారంబున కగు'(87) ననుసూరిసూత్రమును

'ప్రేరణేంచుక్కు పరం బగునపుడు చకారంబునకు పకారం బగు' (ఉ.89) నని మార్చిరి. '-పకారం' బనుచో వీరు సరళాదేశాదులు చేయకుంట స్పష్టతకై యనింద్యగ్రామ్యముగాఁ (ఉ.సం.24) గావచ్చును. అది యవసరము గాదు. సూరి 'పకారంబు చకారంబున కగు' ననుటలో నేమి యపసిద్ధాంత మున్న దని వీరు తిరుగవేసిరో స్పష్టము గాదు. అనవరము.

'బహూళ మనుటచేత మెచ్చించిన యాజగజెట్టి (ఉద్యో.3.175)- ద్విత్వస్థలములందు విభాషను పత్వ మగును. మెప్పించు అని కోశములందుఁ గలదు గాని యట్టిపత్వమునకు యతిప్రాసాదిస్థలగతప్రయోగము లభింపలేదు' (ఉ.410)

బహూళ మనుటచే ననిరి గాని బహూళ మని యెవ రనిరి? సూరి యనలేదు. వీరు ననలేదు.

'ద్విత్వస్థలములలో విభాష' యని సామాన్యముగఁ జెప్పిరి. సూరి మెచ్చునకు మాత్రమె విభాష యనెను. (మెప్పించు గానరా దనుచునే (వ్యా.సం.స.1615) వీరు విభాష యనుట విశేషమె.) వీరియీవివరణము సరి గా దని పైవివరణమె స్పష్టము చేయును. 'హెచ్చు హెచ్చించు ఇత్యాదులందు పత్వము లేనేలేదు. ఇచ్చు-ఇప్పించు, తెచ్చు-తెప్పించు ఇత్యాదులందు నిత్యము. వచ్చు-రప్పించు- -విశేషరూపాభావపక్షమున నిత్యమె. (ఉ.411) ఇట్టియెడల ద్విత్వమునకు సామాన్యముగా విభాష యను టెట్లు? నిత్యాదులుదానికి వ్యవస్థ చేసికొనవలెనా? వీరివివరణము సరి గాదు. 'మెచ్చునకు విభాష' యనుసూరిమత ముచితము.

రప్పించు-ఇత్యాదులలోనిపత్వమున కీసూత్రముతో సంబంధము లేదు. ఇంచుక్పుక్పాగాగమంబు (క్రి.80)లను సూత్రముచేతనే (వచ్చు-రప్పు) యది సాధింపఁబడును. వాని నిటఁ జూపుట యనవసరము. (బహూళ మనఁదలంచిన నది యనవసరము.)

సూరిలక్షణము సూత్రము.

### ప-వ :

బాల.క్రి.88,89సూత్రము లట్ల గ్రహించిరి. (ఉ.91,92)

"కవిత్రయాదీతరకవిప్రయోగంబులందుఁ గొన్నియెడల నుజ్యంతాదులు పరంబు లగునపుడు పత్వము విభాష నగు (ఉ.412) తత్స28.సూత్రమునవలెఁ గవిత్రయాదీతరప్రయోగములనుద్దేశించి సూత్రమునందే "ప్రాయిక"పదము చేర్చి సూరిసూత్రమును సవరింపకుండుట గమనార్హము. కవిత్రయాదీతరప్రయోగముల నైనను "విభాష" యనుటకంటెఁ గొన్నియెడలతే" దనుటయుఁ బ్రయోగానుగుణమె.[ప్రౌఢ.క్రి.16] పై వివరణమున "నుజ్యంతాదు" లనుట ప్రమాదము. నుజ్యంతాదులు ధాతువునకుఁ బర మగుట యసంభవము. నుజ్యాదు లని వీరియభిప్రాయము గుర్తింపఁదగు. "తీర్పుము" అనియుఁ జూపిరి.కావున నుజ్యాదులని ప్రత్యేకముగాఁ జెప్పుట యవసరమా?

### విడువన్ :

ఇట విడువన్- ఒలువన్ మొద లగునవి వ్యావహారికము లనిరి. [ఉ.411] అన నివి కావ్యప్రయోగయోగ్యములు గావు. గ్రామ్యములు విడుపన్ విడుపక అనురీతిని ఉండవలె నని వీరినిర్ణయము.[వ్యా.సం.స.1620]

కాని యిట్టిపత్వమునకు వత్వమునకువలె మహాకవిప్రయోగప్రమాణ మేదియుఁ జూపలేదు. [ఉ.412] లక్షణముచే పత్వము రావలెను. కాని యోగమువకారమునకు వకార మగుటయె యిటఁ బేర్కొనఁదగు. సూరి ఆ.ల.సం.లో వపవ్యత్యయంబు క్వాచిత్కంబుగం గలదు[4-14]అనె. అట్టి లక్షణ మిట వీ రేని జెప్పవలసినది.

'అద్రుచు అనుచోఁ బ్రేరణార్థము లేమి అదురు అనుధాతువును లేమి అద్రుచు అనుచో చువర్ణము ధాత్వవయవమె' (వ్యా.సం.స 1582,1621 ఇవి నవి రాను. మూ.ప్ర.క్రి.20)

## గర్జింపుచున్ :

'కవిత్రయాదీతరప్రయోగములందు వర్తమానార్థకచుపర్ణకాం కత్వమునందును నాగమచకారమునకు పత్వము విభాషగ నగును' (ఉ.93) సూరి యీయంశమును జెప్పలేదు. 'పకారంబు కొన్నియెడల శత్రర్థ చువర్ణకంబునకుం గానంబడియెడి' (ప్రౌఢ.క్రి.17) అనులక్షణమున కిది వివరణ మనఁదగు. 'విభాష' యనుటకంటెఁ బ్రౌఢ.పేర్కొన్నట్లు 'కొన్నియెడలఁ గానంబడియెడి' ననుట ప్రయోగానుగుణముగాఁ దోఁచు.

నుతింపుచున్నాఁ డనురీతిరూపములు నేఁ డసాధువు లనరాదు. (వ్యా.సం.స.1612) అని పేర్కొన్నవీ రిట నట్టి దుదాహరింపకుండుటను బట్టి సాధించునుద్దేశ్యము లే దనిపించు కావున చువర్ణకము శత్రర్థ మనరా దనుతలఁపుతో వర్తమానార్థక మని యందురు. శత్రర్థ మనఁదగు. (చూ.క్రి.43)

నిజక్రీడల్ పచారింపుచో రామా.6.144 అనురీతి నితరస్థలముల నిది గానవచ్చు.

## ఆకర్ణింపుదురు :

'ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి దుక్కు పరంబగు నపుడు పకారంబు విభాష నగు' (90). ననుసూరి సూత్రమును క్రి.108లోఁ గలిపి విస్తరించి చెప్పిరి.

'తద్ధర్మాద్యర్థకము నుభయప్రార్థనాద్యర్థకము నగునప్పుడుఁ గూడ నాగమతద్భిన్నచువర్ణములు రెండును తువర్ణముగా మారును.... బూర్ణముమీఁదిచుదు వైకల్పికముగా పుదు అనునదియు నగును' (ఉ.94)

'పూర్ణముమీఁదిచుదు' అనువీరిసూత్రమునందలి వివరణము సూరి పై సూత్రమునకు సంబంధించినది.

ఆదేశముగాఁ జెప్పిన 'పుదు'లో 'ఉదు' అనుభాగము ముందటి 'చుదు' అనుదానిలో నున్నదే. దానినే మఱల నాదేశింప నేల? మార్పుచకారముపకార మగుటయే. అదె విధింపఁదగును. అట్లు చెప్పినసూరిలక్షణమున నపసిద్ధాంత మున్న దనుట యెట్లు?

సూరి 'నెఱసున్నమీఁదిదాని' కనఁగా వీరు 'పూర్ణముమీఁది' అనిరి. భేదము లేదు గదా.

దీనికి ముందు వీరు 'ఆగమతద్భిన్నము లయినచువర్ణములు రెండును' గ్రహించిరి. "ఇట్టియెడల-- బూర్ణముమీఁదిచుదు" అనఁగా నా చువర్ణ మాగమ మయినఁ గావచ్చును, లేదా తద్భిన్న మయినఁ గావచ్చును. సూరి 'యాగమచకారమును మాత్రమ పేర్కొ‍న వీరు తద్భిన్నమును గూడఁ జెప్పుట విశేష మనవలె. ఆగమేతర మగుచకారమునకుఁ బత్వ మగుటను వీ రుదాహరింపలేదు. కాఁచులో చకార మాగమేతరము. వీరి లక్షణముచే కాంపుదురు అని కావలె. అట్టివి లేవు. ఇట్లే తలంతురు [తలంచుదురు] సయింతుము (సయించుదుము) ఇత్యాదిగా నాగమేతర మగుచకారముపైఁ బత్వము లేదు. ఇట్లె మంపుదు రిత్యాదుల వీరిలక్షణ మతివ్యాప్త మవుచున్నది.

సూరిలక్షణమె సూక్తము.

మిగిలినవీరిసూత్రభాగము బాల108సూత్రముకడఁ జూతము.

ఈ:

బాల. క్రి. 91సూత్రము నట్లు గ్రహించిరి. (ఉ.95) ఇచ్చునకు సర్వంబున కీ యగు(92)ననుసూరిలక్షణమును వీరు 'ముత్తు పరం బగునపుడు ఇచ్చు అనుదానికి ఈ అనునది సర్వాదేశ మగును. జీత్తు పర మగునపుడు ఈయ ఇయ్య అనునాదేశము లగును' [ఉ.96] అని వివరణాత్మకముగఁ జెప్పిరి.

"ముత్తు పరం బగునపు" డనునది ప్రకరణసిద్ధ మగుటచే సూరి యట్లీసూత్రమునందుఁ జెప్పమివలన నెట్టియపసిద్ధాంతమున కవకాశము లేదు. 'తేతేరులు తెచ్చున కగు' (ఉ.97) అనుతరువాతిసూత్రమున వీరును నీదళము నుజ్జగించినను నపసిద్ధాంతము లేదు గదా. ముత్తు పరం బగునపు దన్నది దీనికి బూర్వసూత్రమున నున్నది. కాఁగా నీవజ్ఝలవారిసూత్రమున'ముత్తు పరం బగునపు' దన్నది వివరణమే కాని విశేషము గాదు.సూత్రమున నేల?

'ఇచ్చునకు'- 'ఇచ్చు అనుదానికి' అనుటయు నిట్లే(పడునకు,85,86 చెడునకు ఉ.84)

"ఇచ్చునకు సర్వంబున కగు" ననుటచేతనె సర్వమున 'కాదేశ' మగుట స్పష్టము. వీరు మఱల "నాదేశ" మనుటయు స్పష్టతకె.కాఁగా వీరి సూత్రమున మొదటిభాగము సూరిసూత్రమునకు సంగ్రహవ్యాఖ్య.

పిదప వీరు "ఈయ-ఇయ్య" యనునవి రెండు నాదేశములుగాఁ జెప్పిరి. కాని "ఇయ్య" యన్నది ప్రత్యేకముగాఁ జెప్ప నవసరము లేదు. వీని నూయేలాదులలోఁ జేర్పఁగా (ఉయ్యేల)ఇయ్యయనురూప మేర్పడును. [నోవు- నొవ్వు వీ రీమార్గముననే సాధించిరి [ఉ.411]గాని నోవుతోపాటు నొవ్వు అనునాదేశమును వేఱుగా విధింపలేదు గదా. ఇట నేల? కాఁగా "ఇయ్య" యనునది యాదేశించుట యనవసరము.

ఇఁక "ఈయ" యనునది.ఒకానొకచో "ఈయ" యనునాదేశమును గల దని సూరి వివరించెను. దానిని వీరు సూత్రముననె చెప్పిరి. కాక "జీత్తు పరం బగునపు" డనునది "ఒకానొకచో" ననుసూరివాక్యమునకు వివరణ మనఁదగినను స్పష్టతర మైయున్నది. సూరివివరణమున నింత స్పష్టత లే దన్నను నపసిద్ధాంతము మాత్రము లేదు.

సూరి "యొకానొకచోఁ గానంబడియెడి" నని వివరించుటచే నిట్టిస్థితి ప్రచురము గా దనునభిప్రాయము వ్యక్త మగుచున్నది. కాని వీరు "ఈయ

ఇయ్యు అనునాదేశములు నగు" ననుటలో నట్టియర్థమున కవకాశ మీయ లేదు.

మొత్తముపై నిట సూరిలక్షణమునం దెట్టియపసిద్ధాంతమును లేమి గ్రాహ్యము.

## ఈవుత :

"ఈవుతన్ అనురూపముసూ.రా.నిఘంటువున నుదాహరింపఁబడెను. ఇందలివత్వము నిరాధారము. దీనిని నిర్వహించుమహాకవిప్రయోగము లేదు." (ఉ.415) సం.లో ప్రాసాదిఘటితమహాకవిప్రయోగము లభింపలే (వ్యా.సం.స.1635) దని ప్రాసేతరస్థలముల నుంట సూచించి రనవచ్చును.

అయు లీవుత [హరి.పూ.1.3]- అనయంబు నీవుతన్ [పాండు-1-6] అప్పసచివాగ్రణి కీవుత మీప్సితార్థముల్ (రాజ.1.5) విశేషవరంబు లీవుతన్ [భోజ-1.3] ఇట నెల్ల 'నిచ్చుత' అని దిద్దఁజూచుటకంటె నీరూపమును గుర్తించు టొప్పును గదా.

ఇట వత్వ మయిన దనుటకు నిచ్చో వత్వమును జెప్పులక్షణము లేదు. కావున నీవఁజము సుఖ ముండుఁ గావుత [హర.3.47] రణవీరులు గావుట నీ వెఱుంగవె [ఆది.8.286] భద్రసంపాదిని గావు టచ్చెరువె [శల్య.1.1-275) అనుతీరుగా నిట 'లాఁతిచో సహితము కాదేశాదు' [క్రి.102] లనులక్షణముచే ఇచ్చునకు ఈవు ఆదేశ మైన దని గ్రహింపఁ దగును.

## నేతురం :

బాల.క్రి.93నుండి 96సూత్రము అట్ల గ్రహించిరి.(ఉ.97నుండి100)

నేరుచునకు ఓడ్లాట్టులు ముత్తుం బరంబు లగునపుడు రుచులకు లోపంబు బహుళంబుగా నగు (97) ననుసూరిసూత్రమును 'నేరుచునకు

లాట్టునందును భూతార్థకరూపములందును రువర్ణము బహుళముగా లోపిం
చును.ముత్తు పరంబగునపుడుదీనితుదిచువర్ణము వైకల్పికముగాలోపించును.'
(ఉ.101) అని పేర్కొనిరి.

"సూరి భూతార్థములలో లిట్టునందు మాత్రమె రులోపము బహుళ
మని సూత్రించెను, ఆపక్షమున నీక్రిందిభూతార్థకరూపములు సాధ్యములు
కానేరవు. నేచినయట్లు (మౌసల.1.215) నేచియు నేరకుండియును (దశ.3.
140) (ఉ.416) ఇందుకయియే సూత్రము నింతగా మార్చిరా? సూరి
సూత్రమందలిబహుళపద మీరూపములను సాధింపఁగలదు గదా. పీ రిట్లు
సవరించినను బహుళపద మవసరమ యైనది. 'బహుళగ్రహణముచేత నేచు
కొనంగలరు [వరా.12.77] మున్నగునవి సాధ్యము లనిరి. వానితోపాటు
నేచిన, నేచి యనురీతివి గుర్తింపరాదా? లిట్టుకు భిన్న మయినభూతార్థముల
యందు నిట్టిది క్వాచిత్కముగాఁ గల దని బహుళపదముచే సాధించునప
కాళ ముండఁగా నివి సూరిలక్షణముచే సాధ్యములు గా వనుట యెట్లు?
నేచుకొను అనురీతివి వీరిలక్షణముచే సాధ్యములు గాకుండఁబోలేదే. ఇట్టి
ప్రయోజనము నుద్దేశింపనిచో [వీరు చులోపము వైకల్పిక మన్నట్లు
సూరియు] వైకల్పిక మనక బహుళ మనుట యేల?

బహుళగ్రహణముచే నేచుకొను మున్నగురూపములు గల్గు నని
సూరియాశయము కాఁబోలును.కాని యట్టియెడల రువర్ణలోపము భారతాది
ప్రాచీనగ్రంథములలోఁ గానరాదు' [వ్యా.సం.స.1642] అనుపీరియభి
ప్రాయము ననుసరించియే భారతాదిప్రాచీనగ్రంథములందుఁ గ్వాచిత్కముగా
నున్న నేచిన ఇత్యాదులు గల్గు ననుటయే బహుళపదప్రయోజన మని సూరి
యాశయ మనరాదా? (వానితోపాటే నేచుకొను) లిట్టు క్త్వవిషయములను
నుపలక్షణ మనుకొను [వ్యా.సం.స.1642] టేల?

వీరిసూత్రముత్తరార్థమున 'తుదినున్నచువర్ణ' మనుటఁ దుది

శబ్దము స్పష్టతకే, నేరుచున నున్న చువర్ణ మొక్కటె. అది చివర యున్నది. [నడిమిరువర్ణ మననల్లె] సూరి 'రుచుల'కనుటలో [నెట్టివిశే ణములేక] నపసిద్ధాంతము లేదు,

వేఱుచేసి చెప్పుటవలన చులోపము "వైకల్పిక" మైనది వీరిసూ[త్ర] మున. అందు విశేషము లేదు.

కాఁగా వరుులవారియీలక్షణము సూరిసూత్రమునకు సంగ్రహ వ్యాఖ్యయె. సూరిలక్షణము లక్ష్యసంగ్రాహక మగుచునె లాఘవముతో సూక్తము.

## పొద-పద

"పోవునకు దుఙ్మత్తులు ముజ్ఞుం బరంబు లగునపుడు వులోపంబు[ం] బొదపదలును విభాష నగు (98) ననుసూరిలక్షణమును "పోవునకు దుఙ్మ[త్తు]లు పరంబు లగునపుడు వులోపంబు విభాష నగు" (ఉ.102)అనిచెప్పిరి అనఁగా సూరి చెప్పిన"ముజ్ఞు పరం బగునపుడు పొదపదలు విభాష నగు' నన్నయంశమును దొలఁగించిరి. అది సరి గా దని వారివచనములనుండియే గ్రహింతము.

"పొమ్ము-పొదము- పదము మున్నగువానిలోనిము[ప్రత్యయము] మధ్యమపురుషైకవచనసంబంధి(ఉ.372)పదము పొదము అనునివి మధ్యమ[పురు]షైకవచనములు. పదఁడు పొదఁడు అనునవి మధ్యమపురుషబహు వచనాంతములు. యుష్మత్కర్తృకములు. (వ్యా.సం.స.1644)

ముడుజ్ఞులు మధ్యమపురుషప్రత్యయములె. పొదము- పదము పొదఁడు పదఁడు-అనుచో నున్నవి మధ్యమముడుజ్ఞు లనియె సూరి పేర్కొ[న]ె. ముజ్ఞు పరం బగునపుడు [పొద పద లగు] అనుట యుక్తమే కదా.

"ఈమధ్యమపురుషరూపములందును వచనద్వయమునందును దుక్కు[లో]పే అత్వమును పోవుధాతువునకు వెలయుచున్నవి" (ఉ.372]

ఈదుక్కాను, నత్వము నెట్లు వెలయుచున్నవో వివరించిరి గాదే. మధ్యమపురుజ్జు లని వీరే యంగీకరించిరి గదా. మధ్యమపురుషకు ముజ్జు లగుట లూట్టునందు. లూట్టులో దుగాగమమును సూరి చెప్పలేదు. వీ రేవి జెప్పిరా? ఉభయప్రార్థమున దుగాగమము చెప్పకయె సూరి యత్వము చెప్పు టె ట్లని అట మాత్రమె వీరు దుగాగమము విధించిరి. (ఉ.371)మరి యీమధ్యమపురుషలో దుగాగమము గానియత్వము గాని లక్షణముచే విధిం పఁబడకయె యెట్లు వెలసినవి. దుగాగ మయి దాని కత్వ మయిన 'ద' వర్ణ మగును. 'పొద- పద' అనుచో 'ద' యనున దిట్లు సూరి పైసూత్రమున విధించె. అది యగుచున్న దని యంగీకరింతురు గాని యగుటను జెప్పిన సూరిలక్షణమును దిరస్కరింతు రేమి?

ఈకార్యము 'పోవుధాతువునకు వెలయుచున్న'దనిరి.సూ॥యీసూత్ర మున పోవునకే విధించెను. అందుఁ ద ప్పేమి?

దుగాగమము నత్వమును బేర్కొనిరి గాని వీ రుదాహరించిన పొద, పద, యనువానిలో నంతమాత్రమె యైనదా? అయిన పోవుదము,పోవుదఁడు అనియు కావలె. కాని వీరు పొదఁడు, పదము అనురీతిని జూపిరే. అనఁగా వీరు వివరింపకున్నను దుగాగమము దాని కత్వముతోపాటు, వులోపము ఇది వీరిప్రస్తుత(602)సూత్రముచే సిద్ధించును వికల్పముగా. కాని పోవుదఁ డనురీతివిలేమి నీయెడ లోపము నిత్యముగా వేఱ విధించుకొనుటయో విభా షకు వ్యవస్థ చేయుటయో యవసరము. (పోదము- ఓత్వమునకు హ్రస్వ మొకసారి (పొదము) అత్వ మొకసారి (పదము) అగు నని చెప్పవలదా? లేనిచోఁ దిక్కనాదులప్రయోగములె విరుద్ధము లగు. ఇ ట్లిన్నికార్యములు విధించుటకంటె, పొద, పద అనునవి యాదేశించినసూరిలక్షణ మెంతయు సముచిత మనుటలో సందేహమె యక్కఱ లేదు.

'పొదము అనునుభయకర్తృకరూపమునకు సంక్షేపరూప మనుభ్రాంతి నొదవించుచున్న'- [వ్యా.సం.స.1402] దనిరి.ఇది భ్రాంతియే కావున సం. లోవలె నిటఁ గూడ నిని మధ్యమపురుషక్రియలే యని నిరూపించిరి. పొద

పొద మనికిన్ పదపదఁ డంచు అనురీతి నామ్రేడితపరకతలో లోపమును బట్టియు నివి మధ్యమముకు జులే [వ్యా.సం.స.1403] యని నిర్ణయించు టుచితముగా నున్నది. సూరిప్రక్రియ యెల్ల నొప్పికొనుచునే దానిం దొలఁగింప నేల?

'మఱి కొన్ని యాచ్ఛికధాతువులకును బహుత్వమున నివి ప్రయోగ దృష్టము లగుచున్నవి --వెదకుదండు చూతండు. [ఉ.372] ఇవి సూరిగాని ప్రౌఢవ్యాకర్త గాని చూచుకొనలే దఁట [ఉ.372] అవుఁ గాక చూచుకొనని యవి సాధింపకపోవుటయు దొసఁగె. చూచినవి సాధించుటయు దొసఁగె యగునా? పోవున కేకత్వమునను గలదు. భేదము వీరే స్పష్టము చేసిరే. వెదకుదండు చూతండు అనురీతి నరు దగునొండురెండురూపములు సూరి ప్రౌఢ.సాధింపలే దన్న వీరు ప్రచురములై భారతాదిప్రాచీనమహాకావ్యము లందె ప్రయుక్తమైయున్న పోదము పదఁ డనురీతివి సాధించిరా?

ఇంక మిక్కిలియరు దగు వెదకుదండు చూతండు అనురీతివానిని, ప్రచురము లగు పోదము,పదఁడు అనురీతివానిని సమానముగాఁ జెప్పు టుచితమా?

ఏ మైన వఝలవారిపై వివరణమునుబట్టి యీసూరిప్రక్రియ యుక్తమె. అయిన వీ రేల గ్రహింపరు?

పోదము- పదము అనువానిని పోవుము పొమ్ము అనువానికిఁ బర్యాయముగ నుదాహరించుట సరి గాదు--- అందలిఅత్వమహిమచే నస్మదర్థ సాహిత్యము వ్యక్త మగుటమాత్రమె విశేషము. [వ్యా.సం.స.1644) నీవు పోదము -- నీవు వెళ్లుము- -నేనును వచ్చెదను. [ఉ.372]ఇ ట్లర్థమున భేదము గల దనిరి.పోదపద అనువానిలో నస్మదర్థసాహిత్యమును గల దని క్రియా.37సూత్రమున వివరింపఁబడుటచే నిందు పోదపదలయాదేశము మఱల జెప్పలేదు' [ఉ.417] మఱలఁ జెప్పుట యేమి? ఇంతకు ముం దీయాదేశము నొకసారి చెప్పిరా? అస్మదర్థసాహిత్య మర్థమునుగూర్చి చెప్పితి మని

(వివరణమున) వారె పేర్కొనిరి. అర్థమును వివరించుట యారూపములు సాధింప నక్కఱ లే దనుటకుఁ గారణ మెట్లగునో తెలియకున్నది.

కాఁగాఁ బొదపదాదేశమును వీరు చెప్పక విడుచుట యసంగత మని వారివివరణమె నిరూపించుచున్నది.

ఇంక నర్థభేదమను బ్రస్తావించుటయే వీరు ప్రధానముగా నుద్దేశించి నట్లు వీరివిమర్శనమున గుర్తింపవచ్చును. ఏమైన నివి మధ్యమపురుష క్రియ లనుట వారును నిశ్చయించిరి. అర్థవిశేష మున్న దానిని విశేషముగాఁ గలిపి చెప్పుట యొప్పును గాని యసలు శబ్దమె సాధింపక విడుచుట యెట్లు- అపు డర్థభేదము లక్షణబద్ధ మయిన ట్లగునా?

దకారమహిమచేతను, (ఉ.372) అత్వమహిమచేతను (వ్యా. సం.స.1644) నస్మదర్థసాహిత్యము వ్యక్త మగు ననిరి. వీరు పైప్రక్రి యనె లక్షణబద్ధము చేయకుండ దేనిచే నైన వ్యక్త మగుట యెట్లు? వివర ణముచే గ్రహింపవచ్చు. అపు దత్వమో దత్వమో కారణముగాఁ జెప్ప నేల? అది సూత్రసిద్ధ మయినట్లుగా.

ఈవివరణమున వఝులవారు పేర్కొన్న ట్లర్థమున నీషద్భేదము గుర్తింపవలసియే యున్నది వీ రన్నట్లు 'పొదము- నీవు వెళ్లుము -నీవెంట నేను వచ్చెదను' [వ్యా.సం.స.1403] అనియె కాక నావెంట నీవు ర మ్మనియు నర్థము గల దేమో యనిపించు [లోకవ్యవహారమున నిట్లు గానరాదు.] అది గాను మచ్చోటను వే పొద ప్రాజాపత్యలోకమున కనవుడు [అను.4.72] అనుచోఁ బ్రాజాపత్యలోకము సందిత్తును రమ్మ అని యింద్రునియభిప్రాయము. రావిపాల నిచ్చెద ర [అను.4.79] మ్మనుచోఁ బూర్వ మిట్లే కదా. ఏ మైన వఝులవారు పేర్కొన్న యస్మ దర్థసాహిత్యము గల దని యంగీకరింపవలసినదే.

సూరి యైన 'పోవము- పదము -ఇట నర్థవిశేష'మనురీతిగనో యె
న్నియున దీనిం బ్రస్తావించిన బా గుండెడి దనిపించు.

కాని సూరి "మే మడిగినయర్థం బిక్కడన మఱచి పోమ్ము.
ఒయులనుబ్బికుము పోద మని వానిం బుచ్చి పింగళకుండు ఖిన్నుం డయి'
-[సీ.చం.90పుట] అను పోవము- పొమ్ము అనునర్థముననే ప్రయోగిం
చెను. నేవకుండు పోయెను గాని పోద మన్న పింగళకుం డటనే యుండె.

**అయి :**

బాల.క్రి.99,100సూత్రము లట్ల గ్రహించిరి. [ఉ.103,104]

"కదబ్రాల కనుటచేత అగుధాతుగకారమునకే యకార మయ్యె నని
వచ్చును గాని యూపక్షమున అవితిని మున్నగునవిష్టరూపములు దుర్వా
రము లగును. కాన ఆచ్ఛి69.చెప్పిన వకారము చేసి దానికి యకారము
చేయనగును" [ఉ.416] ఈవివరణ ముచితము గాదు. "అగు"లో గకార
మునకే యకార మగు నన్న నందలిగకారమునకు వకారము వచ్చి 'అవు'
అని యైనపక్షమున వకారమున కీసూత్రముచే యకారము రాదు గాన నది
యట్లే యుండి అవితిని అనురీతిని ననివార్యముగ నేర్పడు నని వీరి
నిశ్చయము.

అట్లే చేయుదము. వీరిసూత్రము ననుసరించి యైనను గవలు పర
స్వరము మాఱుట విభాషయే కదా. అవియెను అని కావలె నని గకారము
నకు వకారము చేసి వకారమునకు యకారము చేసిన- విభాష యగువకా
రము రానిపక్షమున గకార మట్లె యుండును గదా. గకారమునకు యకా
రము వచ్చు టెట్లు? వీరివివరణముచే "అవితిని" అనురీతిరూపములు
వారింపఁబడినవి. కాని దానివలన అగితిని, అగెను అనురీతివి దుర్వారములె
యైనవి. కాన వీరియీవ్యాఖ్య యసంగతము.

సం.లో అగుధాతువుయొక్కయు, నందలిగకారమునకు వకారా

దేశము గల్గినఅవుధాతువుయొక్కయు (వ్యా.సం.స.1645) గకారవకార ములు రెంటికి యకార మగు ననిరి. పై వ్యాఖ్యకంటె నిది కొంతనయము.

అయ్యు "అయి" అనురీతిరూపములు సాధించుటకు ముందు అను గకారమునకు వకారాదేశము చేయుగౌరవమున కేల పాల్పడవలె? (వ్యా. సం.స.1758) అని సందేహము.

ఇంక వీరు యకారమునకు గకారవకారములకు పొల్లులకె చేయు టయు నుచితము గాదు. 'అగు + ఇ-అయ్ + -ఉ + ఇ-అయి, పోవు + ఉ + ఇ. పోయి- (వ్యా.సం.స.1645) "తుదియక్షరంబున" కని యట వివరించుచునే పొల్లునకు మాత్రమె చేయుట విశేషము. సూత్రమున "కవ త్రవాలకు" అనఁగాఁ బొల్లును మాత్రమె గ్రహించు టెట్లు? 79సూత్రమునఁ 'గడత్రవాలు లోపించు' అనఁగా అడఁగు అడఁచు అనురీతిగా కవ త్రవాలు 'గు' లోపింపలేదా? ఉత్వము మిగిలినదా? ఇట్లే 105సూ. అట్లే యిచ్చుటఁ గడత్రవాల కనఁగా అగు, పోవు అనుచోట్ల నున్న 'గువు' అను వర్ణములకు మొత్తమునకే యకార మగును. కడత్రవాల కనుప్రత్యేకనిర్దేశము ననే యకార మేకాల్లయ్యు నంత్యవర్ణమునకుఁ గాక 'గువు'లు మొత్త మున కగుట సిద్ధించుచున్నది. కావున వీనిప్రక్రియ అగు + ఇ-అయ్ + ఇ-అయి, పోవు + ఇ, పోయ్ + ఇ- పోయి- అని చూపుట లక్షణాను గుణము.

'అయెసు- అయ్యెను. అచ్చి.36చొప్పున ద్విత్వమును సమా.76 చొప్పున హ్రస్వమును గల్గెను (ఉ.418) సూరిమార్గ మిదే. కాని పీరాయూరి లక్షణమును మార్చి పదద్వయసంధిలోనె హ్రస్వము చెప్పుకొనుటచే (సమా. 76)నిటఁ బదద్వయసంధి లేదు గాన హ్రస్వము రాక అయ్యెను అనియె యుండవలె. ఇట్లే నోవు నోవ్వు కావలె. వీ రది గమనించినట్లు లేదు.

**పిలుచు :**

బాల.క్రి.101.సూ. నట్లు గ్రహించిరి. (ఉ.105)వివరణమున సూరి

చెప్పినయిత్యాదులనుండి తొలఁగు గెలుచు వెఱచు అనునవి చూపుట యుచితముగా నున్నది.

బాల.క్రి.102సూ. నట్ల గ్రహించిరి. (ఉ.106) "రావించు రప్పించు కావించు మున్నగుచోట్ల నిత్యము. ఇవి క్రియా 80.సూత్రముచేతనె సిద్ధించును" (ఉ.419) అట్టియెడల "లాఁతిచోటులలో" వీనిని ప్రస్తావించుట స్పష్టతకె యైనను నవసరముగాఁ దోఁపదు.

కావునన్, కానన్ ద్రు.ప్ర. లనుట సూరిమతానుగుణమె. (ఉ.419) [చూ.ద్రుత.]

## అయియవులు-ఐఔలు :

'అచ్చికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగానగు' (103) ననుసూరిలక్షణమును 'అచ్చికంబులందు అయి-అవు అనువానికి వరుసగా ఐ ఔ అనువర్ణములు బహుళంబుగా నాదేశము లగును' [ఉ.107] అని చూపిరి.

'అయియవు లనుసూరిగారిసిద్ధద్వంద్వమును, సంహితాయకారమును ప్రామాదికము' (ఉ.419) లనిరి. దీనినిబట్టి సంహితాయకారమే కాక సిద్ధద్వంద్వమును దప్పే యని చెప్పఁదలఁచి రని తోఁచు. కాని సం.లో 'అయియవు లనుద్వంద్వమునందలియకారాగమము సాధువు కా దని తోఁచెడిని' (వ్యా.సం.స.1665) అనుటనుబట్టి సిద్ధద్వంద్వ మగు నని రని గుర్తింపవచ్చు. అచ్చికద్వంద్వ మయిన యకారాగమము సాధువె కదా. అయి,అవు అనునవి యాశబ్దములను బోధించు స్త్రీసమము లగుశబ్దములు.వీనికిఁ దెలుఁగున ద్వంద్వ మగును. (చూ.అదోడుకూడులు.) ఇందు యడాగమము లక్షణానుగుణము. సూరి 'అయియవు' లనుట నిర్దుష్టమె. కాన నది సరి గాదని వీరు 'అయి-అవు అనువానికి' నని చెప్పుట యనవసరము. వివరణ మనఁదగును. సూరి వక్రతమము లన వీరు 'ఐఔ' లనిరి. సూరివచనముల నపసిద్ధాంతము లేదు గదా.

'వరుసగా' ననునదియు వివరణమె. అగున కనుకనులకు (100) చావునోవులు చచ్చునొచ్చుల కగు నిత్యాదిస్థలముల వీరును 'వరుసగా' నన కున్నను నట్లు గాకపోయెనా? ఇదియు వివరణమె.

అయియవులకు (అయి-అవు అనువానికి) అనుచో టిషష్ఠిచేతనె వాని స్థానమున ననునర్థముతో నాదేశ మగుట సిద్ధించును. కావున వీరు 'ఆదేశము' లని పేర్కొనుటయు వివరణమే.

ఇట్లు వర్ణులవారిలక్షణము సూరిసూత్రమునకు సంగ్రహవ్యాఖ్య యగును.

ఐఔలకు అయి-అవు అనునవి యాదేశము లగుటయుఁ గలదు. కైక-కయిక దైవమ్-తద్భవ- (దై - అము- దయియము) దయ్యము యౌవనమ్ తద్భవ-(జౌవనము- జవువనము)జవ్వనముఇ ట్టీ పద్ధతిమిక్కిలి యరు దనఁదగును. (ఉ.420) ఇ ట్టి ది యరు దని గుర్తించిరి గానఁ జిం. వ్యాఖ్యలోవలె నిట ఐఔలకు అయియవులయాదేశమును సూత్రమునఁ జెప్ప కుం టుచితముగా నున్నది. సూత్రమందలిబహుళపద మిట్టిస్థలములను సం గ్రహింప సమర్థమె కదా. దయ్యము జవ్వన మనుచో వీరిప్రక్రియ యుచి తముగాఁ గానరాదు. దైయము, దయియము, (జౌవనము) జవువనము అనురీతిశబ్దములే గానరావు. 'కైక' యనుచో 'కయిక' పూర్వరూప మను టలో నిబ్బంది యేమో విచారింపవలె. ఈయంశము పరిశీలనార్హము.

### కలుఁగుఁ-కల:

కలుగున క స్త్యర్థంబునందు లట్టు పరం బగునపుడు కల యగు' (104) ననుసూరిసూత్రమును వీరు అ స్త్యర్థకంబును ప్రా ప్త్యర్థకంబును (సకర్మక)నగు కలుగుధాతువునకు కల యనునాదేశము లట్పరకత్వమున నిత్యముగా నగు' (108) నని చూపిరి.

కల యనునాదేశము, నిత్యముగా ననురీతి వరుసలసూత్రములోని పదములు సూరిసూత్రమునకు వివరణప్రాయములే. ఇంక వీరిసవరణము "ప్రాప్త్యర్థకకలుగునకను" "కల" చెప్పుట.

సూరి అస్త్యర్థకకలుగుధాతువునకు మాత్రమె కల అనునాదేశమును విధించెను. కాఁగా ప్రాప్త్యర్థకకలుగున కీక్రిందిరీతిరూపములు సాధ్యములు కానేరవు. 'ఎఱుకఁ గలరె మగువ లెందు (ఆది.2.34) ఇది వడిఁ గలదు (ఆది.2.34) -- (ఉ.420,వ్యా.సం.స.1655,1659)ఇట సకర్మకత్వమును గుండలీకరణమున నుంచుటంబట్టియు అస్త్యర్థ్యమున సకర్మకమునుప్రాప్త్యర్థమున సకర్మకము నై యుండ నకర్మకమునకు మాత్రమె యవు నని సూరి తలఁచినట్లు వీ రూహించిన ట్లున్నది.

ఎఱుకఁ గలరె యనురీతిప్రయోగములు బాల.సిద్ధములు గావా? "గుబ్బెత మట్టుత మిండత లస్త్యర్థకములె. (ఉ.తద్ధి.58) గుబ్బెత- ప్రశంశార్థ్యము లగు కుచములు కలది (ఉ.309] అనఁగా గుబ్బలు గలిగియున్నది అనురీతిగా నది 'యస్త్యర్థకమె' కదా. అట్లై ఎఱుకఁ గలరు.ఎఱుక గలిగి యున్నది- అనురీతివిగా నియ్యవి 'యస్త్యర్థకము' లనుట విరుద్ధమా? 'అస్త్యర్థంబున' అనుసూరిలక్షణముచే నీయవి సాధ్యము లగుచున్న వని స్పష్టమె.

'అస్త్యర్థంబున' కనుటచే నుత్పత్త్యాదు లగునర్థములు వారింపఁబడుచున్నవి. పుట్టుట యనునర్థమున నీయాదేశము లేదు గదా. నాకాశ్చర్యము గలుగుచున్నది యనుచో నాకాశ్చర్యము కల దని కాదు. (ఇది యకర్మకమును) పుత్రులు కలుగుచున్నారు. మొ॥ ధనలాభము కలుగుచున్నది.ధన లాభము గల దన్న నీయర్థము గలుగదు.

క్రియా.21.22.సూ.చొప్పున నుదంతము కామింజేసి చు-ఉన్న (ఉన్న-ఏ) అనునవి రావు. క్రియా.20.సూ.చొప్పున ఉన్న లేదు గావున దివి రావు. ప్రేరకత్వమున కలాదేశము నిత్య మగుటంజేసి 'ధనలాభము గలుగుచున్న

'అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు' [124] ననుసూరిలక్షణమును సవరించి యిట్లు సూత్రించిరి.'అప్రేరణకర్తృవాచకము ప్రేరణమున ద్వితీయాంతము కానపు డది కొన్నియెడలఁ దృతీయాంతమును గొన్నియెడల షష్ఠ్యంతము నగును' [ఉ.కార.4]

వీరిలక్షణమును బరికింతము. పూర్వసూత్రముచే నప్రేరణమునఁ గర్త యగునది ప్రేరణమునఁ గర్మ మగును. దానికిఁ 'గర్మంబున ద్వితీయ యగు' నని ద్వితీయ కావలెను. 'ద్వితీయాంతము కానపు డన ద్వితీయ రానపుడు ద్వితీయ రాకుండుట కవకాశ మేది. (వ్యా.సం.స. 974] అది వికల్పము గాదే. ముందు దాని కవకాశము కల్పింపవలె. ఇట్లనుటచేతనె ద్వితీయ రాకుండుటయుఁ గల దని యూహింపవలె. దీనికంటె ద్వితీయకుఁ గొన్నియెడలఁ దృతీయయుఁ గొన్నియెడల షష్ఠియు నగు నని చెప్పు టుచితము గదా.

అప్రేరణకర్త ప్రేరణమునఁ గర్మ యగును గావున అప్రేరణకర్తృవాచకము ప్రేరణమున (నింతవఱ కెట్లును పూర్వసూత్రసిద్ధార్థానువాదమె) 'కర్మ మై' ద్వితీయాంతము గానపు డన్న స్పష్టముగా నుండెడిది -ఇది యంతయు నేల? 'దానికి' అని మాత్రమె చెప్పిన తచ్ఛబ్దముచేతనె పూర్వపరామర్శక మయి యీయర్థ మెల్ల సిద్ధించి సూత్రము సూత్రమువలె నుండెడిది.

కర్మ యగుటను ప్రస్తావింపకపోవుటచే అప్రేరణకర్త ప్రేరణమునను గర్తయే యవు నేమో. కర్తకుఁ దృతీయ గదా రావలసినది. ద్వితీయాంతము కానపు డందు రేమి యనురీతిసందేహముల కవకాశము గల్గు. సూత్ర మసందిగ్ధముగఁ గూడ నుండవలెఁ గదా.

అట్లైె ద్వితీయాంతము గానపుడు, తృతీయాంతము షష్ఠ్యంతము

అనుటకంటె ద్వితీయ రానపుడు (ద్వితీయకు) తృతీయ, షష్ఠి- యగు నని చెప్పుట యింకను నుచితము.

ద్వితీయాంతము గానపుడు కొన్నియెడలఁ దృతీయాంతము, కొన్ని యెడల ననుట నవి రానపు డెట్లును ద్వితీయ రానిస్థితి కావున నిం కేవిభక్తి యగు నని సందేహము. కావున ద్వితీయాంతము కానిచోఁ దృతీయాంతమో షష్ఠ్యంతమో యేదో యొకటి కావలసినదే కాని యాయర్థము వీరిసూత్రముచే స్పష్ట మగుట లేదు.

వీ రిటఁ దృతీయాంతము నై యుండు నని లక్షణమునఁ జెప్పిరిగాని యట్టి దుదాహరించినజాడలేదు. 'రాముఁడు భరతుని రాజ్యమునేలించె'నుచో రాముఁడు భరతునిచే రాజ్యము నేలించెను. అని యుండ నవు(వ్యా.సం.స. 975) అది వీ రిటఁ జూపలేదు.ఇట్టితృతీయ పూర్వసూత్రోదాహరణములలో గుర్తింపఁదగు నని యెంచి రేమో. (చైత్రుండు మైత్రునిచేఁ బుడమి నేలించెను)కాని యిది యచ్చటిగతిబుద్ధిప్రత్యవసానశబ్దకర్మాకర్మకములలో నేది యుఁ గాదు.అందుకే సూరి(వీరును)లాఁతిచోసహితము గానంబడియెడి'ననెను కాఁగా నీతృతీయ పూర్వసిద్ధ మగుటచే నిటఁ బ్రత్యేకముగాఁ బేర్కొనవల సినయవసరము లేదు.

ఇంక వీ రిచటఁ జూపినయితరలక్ష్యములలోఁ దృతీయ లేదు.'కష్ణుఁ డర్జునునకుఁదరత్త్వంబుం దెలిపె'నుచో నర్జునునిచేఁ దెలిపె నని యుండదు గదా. ఇట నెల్ల వీరు షష్ఠినే యుదాహరించిరి. తృతీయావిధానమునకుఁ బ్రయోజనమును జూపిన జా గుండెడిది.

వీరియీలక్షణము 'తత్ర తృతీయా షష్ఠీ చ విభక్తి సమ్మతే ఉభే' అనునథర్వణునికారిక (వీరివ్యాఖ్యవ్యా.సం.స.974) ననుసరించియున్న దని గుర్తింపవచ్చును.

"అప్రేరణకర్తృవాచకము ప్రేరణమున ద్వితీయాంత మగుటయు (కర్మసంజ్ఞను బొందునవి?) గానపుడు తృతీయాంత మగుటయు (కర్మ

సంజ్ఞను బొందనివి?) సంస్కృతవ్యాకరణములనుండియె తెలియఁగల దన్న వి.వి.లోను విచ్చటను వీరు తృతీయ యేల విధించిరి? అట్లు ద్వితీయ రాన పుడు తృతీయ మాత్రమె వచ్చుట కాక కొన్నియెడల షష్ఠియు వచ్చుట'- (వ్యా.సం.స.974) అని విశేష మగుషష్ఠి యొక్కటి విధింపఁజాలదా?

ఇట విశేషముగా వఝులవారు పూర్వసూత్రముచేఁ గర్మమగునవియు నట లక్ష్యములు గాక కర్తయె యగునవియు రెండు నుద్దేశించినచో నీసూత్ర మునఁ గర్మమును బేర్కొనకుం టుచితమె. కాని ద్వితీయాంతము గానప్పు డను టెట్లు? పూర్వసూత్రము ననుసరించి కర్మసంజ్ఞను బొందనివానికిఁ దృతీ యకుఁ గదా షష్ఠి యవునది. పైఁగా నీసూత్రమున వీరు తృతీయయు విధిం చిరి. కావునఁ బూర్వసూత్రానుసారముగాఁ గర్మనే యుద్దేశించి రనవలె. అట్టి యపు 'ఢద్దాని' యని యిటసూత్రమున స్పష్టముగా లాఘవముతోఁ జెప్ప వచ్చును.

ఇఁక సూరి అన భిహితకర్తకు షష్ఠిని బహుళముగాఁ జెప్పె. తిజాదులచె నభిహితము కాకుండుటయె యనభిహితత్వము. వీ రిట సూరిలక్షణలక్ష్యము లును రెండును బొరపాటుగ గ్రహించిరా యనిపించు.

ఇచ్చటి షష్ఠి తృతీయాస్థానిక మనుట సరి గా దని వీరియభి ప్రాయము. (రాముడు వేదములను వినెను.] వేదములు వినఁబడెను. రామునకు వేదము వినఁబడె నన్నవి సమానార్థకములు గావా? ఇట వేద ములు కర్త యగునా?

సూరిలక్షణమున దోష మేమో స్పష్టము గాకున్నది. సూరి కన్వాది యోగమునఁ బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్య మనుటయు సరి గా దని వీరి యభిప్రాయము. [వ్యా.సం.స.978] "తనయన్నలఁ దమ్ములఁ గానిపించె నయ్యుత్తరు నర్జునుండు' అనుచో నుత్తరుఁడు ప్రయోజ్యకర్త. దీనికిఁ దృతీయ కాక ద్వితీయ యె ట్లవును? గతిబుద్ధిప్రత్యవసానాదులలో నేదియుఁ గాదు గదా యిది. దీనిని వీరు ఉ.లోఁ దమసూత్రమున కుదాహరించుటయు

విశేషమె. అది యెట్లు లక్ష్యమైనదో వీరు వివరింపలేదు. ఉత్తరుఁడు కనెను. అనుచో అర్జునుఁ డుత్తరునకుఁ గానిపించెను అని షష్ఠియె యుండును. "కర్మ" కామి ద్వితీయ రాక కర్తృత్వమునుబట్టి తృతీయయే రావలసియుండ నద్దానికి షష్ఠి నిత్యముగా నైనది.

షష్ఠి నిత్యముగా దన్నచో నది రానిపక్షమునఁ గర్తృత్వమునుబట్టి తృతీయ యై ఉత్తరునిచేతఁ గానిపించె నని కావలెఁ గాని 'ఉత్తరుని గానిపించెను' అని ద్వితీయ యగుట యెట్లు?

మైత్రుఁడు వందెను. చైత్రుఁడు మైత్రునిచేత వందించె ననుచో 'మైత్రుని వందించెను' అని మైత్రశబ్దము కర్మ యై ద్వితీయ నందుచున్నదా? అట్లైన పైకనుధాతువువిషయమునను.

వీరే అనభిహితకర్తృవాచకమునకు రావలసినతృతీయ పాక్షికముగ నైన రా దనియు షష్ఠియె నిత్యముగా వచ్చు ననియు' (వ్యా.సం.స.977) సూరివివరణము తాత్పర్యమును బేర్కొనిరి. అట్టియెడల 'షష్ఠీనిత్యత పొసఁగ' దని (వ్యా.సం.స.978,ఉ.213) చెప్పఁదలఁచుచో షష్ఠి రానపుడు రావలసినతృతీయతోడిరూపమును బ్రదర్శింపవలెఁ గాని యవకాశమె లేనిద్వితీయను జూపు టెట్లు? ఇఁక నిట్టిప్రయోగములను బూర్వసూత్రమునొద్ద 'లాఁతి' స్థలములలోఁ జేర్చి సాధించుకొను టే నుచిత మైయుండఁగా వయ్యలవారు తమవ్యాకరణమున నీసూత్రమునొద్దఁ జూపుట వింత.

కుశలవులు రాముని రామాయణము వినిపించిరి. అనురీతిస్థలములు గూడఁ గ్వాచిత్కమె యనక తప్పదు. "రామునికి వినిపించిరి" అనురీతిని షష్ఠియె ప్రసిద్ధము.

గతిబుద్ధ్యాదిపూర్వసూత్రమునకు సంబంధించినదిగాఁ గాక కృష్ణుఁ డర్జునునకుఁ దెలిపెను- [అర్జునుని దెలిపెను] కృష్ణుఁ డర్జునునికిఁ గానిపించె ననురీతిగా నెల్లయెడలు సంగ్రహింపఁబడునట్లుగా "అనభిహితకర్తకు" అని సూ౹ పేర్కొన్నలక్షణ ముచితమె.

శిష్యులను జదివించెను, శిష్యులచేతఁ జదివించె ననురీతియు సాధింప పీరు తృతీయను బ్రత్యేకముగాఁ దమసూత్రమునఁ బ్రస్తావించి రేమో. కాని యసమగ్రముగాఁ జెప్పుటచే నీయర్థము సిద్ధింపకున్నది.

సూరిసూత్రమం దున్న బహుళపదమును "ఒకానొకచో" ననుదళమును శిష్యులను జదివించెను, శిష్యులచేతఁ జదివించె ననురీతిని దృతీయకును సాధకమై యాయయివిశేషములు. గవిప్రయోగానుసారముగా గుర్తించుటకు వీలుగా సూరిలక్షణముసూక్తమైయున్నది.కాన విశేషములు ప్రయోగములం దెలియవలె.

ఇది క్రియాపరిచ్ఛేదము

# కృదంత పరిచ్ఛేదము

## కృత్తులు_అర్థములు :

'కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు' (1) అనుసూరిసూత్రమును వీరు 'ఆచ్ఛికకృత్తులయర్థములు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు' (ఉ.1) అని చెప్పిరి. 'అచ్ఛిక' విశేషణము నధికముగాఁ జేర్చుట విశేషము. ఇది సూరియభిప్రాయమునకు వివరణమె. వీరు సంస్కృత కృత్తులను గూడ నిరూపించిరి గావున నిట నాచ్ఛికవిశేషణమును జేర్చిరేమో' కాని సంస్కృతకృత్తులవిషయమునను కృత్తులును వానియర్థములును సాధారణముగాఁ బ్రయోగవేద్యములె' (ఉ.4467) యనుట గమనార్హము.

సంస్కృతద్ధతాంతములు సిద్ధసమాసములవలెనె సంస్కృతకృదంతము లట్లై తెలుఁగునఁ బ్రాతిపదికముగా నిల్చి తత్సమము లేర్పడును. 'రామ' మొదలగున విట్లె. రాముఁడు. వీరు నిరూపించుట ప్రయోజనవంతమె యనవచ్చు.

## కృత్తు :

'కృదతిఙ్' అనులక్షణము ననుసరించియే సూరి 'ధాతువునకు విహితం బగుడుఙ్భిన్నప్రత్యయం' బని వివరించెను. దీనింగూర్చి వఝులవారు ఈపక్షమున ఇంచుక్కు మున్నగునవియుఁ గృత్తు లనుభ్రాంతి కల్గును' (ఉ.432) కావున సూరివివరణము పొరపా టని వీరినిర్ణయము. అందుకే వీరు "ధాతువునకుఁ బరముగా విహితము లగుప్రత్యయములలో డుఙ్ఞును (క్రియా.16) ఇంచుక్కును (క్రియా.2,73) చుక్కును (క్రియా.76)

పుక్కును (క్రియా.77) పడ్వనుబంధమును (క్రియా.59)కొనుశబ్దంబును (క్రియా.62) అనునవి తప్పఁ దక్కినయావలఁ కుపదేశించిన ట మున్నగు క్రియా46సూ.మొ 57సూ.వ) ప్రత్యయములును నిట పైనిఁ జెప్పఁబడు కప్రత్యయాదులును కృత్తు లనఁబడును' (ఉ.432)

అనఁగా సూరివివరణము ననుసరించి ఇంచుక్, చుక్ మొద లగునివి యెల్లఁ గృత్తులు గావలయు నని వీ రెంచి రనుట స్పష్టము. కాని యిది యసంగతము. సూరి ధాతువుకంటె విహిత మైనదుఖ్యన్న 'ప్రత్యయమును' గదా కృత్తు అని చెప్పినది. ఇంచుక్కు, చుక్కు పుక్కు అనునవి ధాతువు కంటె విహితము లయినను నాగమములే కాని ప్రత్యయములు గావు గదా. కిత్త్వముచే ధాతువున కంతాగమము లై ధాత్వవయవములే యవును. ఆగమములు ప్రత్యయము లగుట యెట్లు? కాక వీ రాగమములు కృత్తు లని యెట్లూహించిరి. ఇట్లె 'కొను'శబ్ద మాత్మనేపదార్థమున ననుప్రయుక్త మయిన ధాతువే కాని ప్రత్యయము కాదు. ఇట్లె "పడు" అనుబంధము. కాఁగా నివి కృత్తులు గావలసివచ్చు నని వీరు వ్రాయుట కేవలము పొరపాటు.

ఇంక వీరివివరణమె ప్రమాదములతో ననర్థక మై యుండుట గమనింపవచ్చును.

ఇంచుక్చుక్పుక్కు లాగమము లగుటచేతను.పడు అనుబంధ మవుటచేతను, కొనుశబ్దము ధాతు వగుటచేతను, వీనిని "ఈవల కుపదేశింపఁబడిన ప్రత్యయములు" అని ప్రత్యయములుగాఁ జెప్పుచోఁ బ్రస్తావించుట యనుచితము. ఇవి ప్రత్యయము లై నఁ గదా, యేతద్భిన్నము లగుప్రత్యయము లనుట యొప్పును.

ఇంచుగాదులను బేర్కొనుచో వీరు తద్విధాయకసూత్రములను గూడ నిర్దేశించిరి. కాఁగా నివియే వీరు చూపినవానికంటెవేఱుసూత్రముల విధింపఁబడినచోఁ (బ్రత్యయేతరముల యయ్యును) గృత్తు లవు నని చెప్పవలసియున్నది.

క్రియా 2,73,76,77లచేఁ జెప్పఁబడినయించుక్పుక్పుక్కులను వీరు నిర్దేశించిరి. అయిన క్రియా.79,84,85,86, మొదలగుసూత్రములచేఁ జెప్పఁబడినయాయవి కృత్తులే కావలె. అడఁచు, మాపు వెలువరించు మొ॥ కృదంతములు గావలె.

ఇట్లె పడుకొనుట క్రియా.56,62లచేఁ జెప్పఁబడినవె నిర్దేశించుటచే క్రియా 113చేఁ జెప్పఁబడినయివి కృత్తు లవును. నిలఁబడు పండుకొను ఇత్యాదులు (ధాతువులు) కృదంతము లనవలె.

ఇట్లె వీ రిటఁ బేర్కొనని కొన్ని యిట్టియనుబంధాదులు గలవు. అవి యే మగును? కర్మార్థమున పడువలె వర్తమానమున ఉన్న ఖానిని కల అనుబంధములుగాఁ జెప్పఁబడినవి.ఇవి కృత్తులా? లడాదిపరకత్వమునఁ జెప్పుటఁ గృత్తులు గా వనుకొందమా? కాని క్రియా 114చే ననుప్రయుక్త మన్న తెంచుధాతువు, (ఘటకక్రియలు) శబ్దపల్లవములు? కృదంతము లగునా?

ప్రత్యయేతరము లెల్లఁ బ్రత్యయములుగాఁ దలఁచి సూరి నిర్వచనమును దిరస్కరించినవీరిలక్షణము మిక్కిలిగా నతివ్యాప్త మగుచు ననర్థకమైనది. కాన నిది యగ్రాహ్యము.

సూరివివరణమున నన్న ప్రత్యయేతరమునకుఁ బ్రసక్తియే లేకుంట నీసూత్రముచే నైనను వించుగాదిప్రత్యయభిన్నములకుఁ గృత్సంజ్ఞ లేకుంట సముచితముగా సిద్ధించును. సూరివివరణమె సమంజస మై గ్రాహ్య మై యున్నది. సూరిలక్షణమున వీరు చూపినదోష మందు లేదు గాని దానిని దొలగింపఁబూనినవీరివివరణమున విస్తరించినది.

## లోపవము :

'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' (2) ననుసూరిలక్షణమును 'ఇటం గృత్కగతపవేములు

(వ + ఇమి) పరంబు లగునపుడు ధాతువుతుది నున్న కగచయవలకు లోపం బగు' (2)నని చూపిరి.

(వ + ఇమి) అని చూపుట వివరణము. ఇది సూత్రమున నపవ సరము. వివరణ మెట్లును బిదప వ్రాయుచున్నారు గదా. 'ధాతువుతుది నున్న' అనుభాగమును సూరికంటె నధికముగాఁ జేర్చిరి. ఇదియు వివరణమే. ఈకగతపవేములు కృత్తులు. ఇవి ధాతువునకే విహితములు. కావున ఇవి పరంబు లగునపు డనఁగా ధాతువున కనునర్థము స్పష్టమె. ధాతువులు గాని వాని కివి రావు గావున నటఁ బర మగుట సంభవింపదు గదా. ఈపరము లగునపు డనుటచేతనె ధాతువునకుఁ దుది నున్న(కగచయవ) దానికె యీకార్య మగుట స్పష్టము. ఆగమాన్యచకారంబుల కద్వ్యరు క్తములకు ముత్తు పరం బగునపుడు పవ లగు' (ఉ.క్రి.91) ననుచో ధాతువుతుది నున్నయాగమాన్యచకారముల కనిరా? అయినను "పచింపఁడు" అనుచో ధాతువుతుది నున్నదానికె కదా పత్వ మయినది. వే తొకదాని కయినదా? ఇట్లే ఉ.క్రి.89 మొ॥ కాఁగా నిటఁ గూడ "ధాతువుతుది నున్న-" అనని సూరిలక్షణమున నపసిద్ధాంత మేమియు లేదు. అయ్యు వీ రి ట్లనుట వివ రించుటయె. అయ్యది వివరణమునఁ జెప్పఁదగు.

సూరిలక్షణము సూక్తము.

## వ్రేలిమి :

బాల.కృ.3,4సూత్రము లట్లు గ్రహించిరి (ఉ.3.4సూ) వీ రాయా కృత్తుల నర్థముతోఁ జూపుట ప్రశంసార్హము.

సూరి- వ్రేలుచు- వ్రేలిమి అని యుదాహరింప వీరు "వేలుచు-" అని రేఫను దొలఁగించిరి. "వ్రేలుచు- అనుదానికి హోమము చేయు అను అర్థము లేదు. (ఉ.434)(వ్యా.సం.స.1716) అందుకే వీరు సం.లో సూరి

వచనములందును వీని రేఫరహితములుగాఁ జూపిరి. వ్రేలిమి అనెడువకార రేఫసంయుక్తరూప మేకోశములందును లేదు. (వ్యా.సం.స.1716) కాని సూ.ని. వేలుచుతోపాటు వ్రేలుచు (వ్రేలిమి)శబ్దము నీయర్థముతోఁ జూపినది. వ్రేల్మి వ్రేల్మిబొట్టు మొ॥ సూరిపేర నున్నయాంధ్రధాతుమాలలో వ్రేల్చు- వేల్చు రెండును జూపఁబడినవి.

## పోరాటు :

బాల.కృ.5,6,7,సూత్రము లట్లు గ్రహించిరి. (ఉ.5,6,7) 'పోరాట అవియుఁ గలదు. నీటిపోరాటం దోటమిపాటు (భాగ.గజేంద్రో)-కొనియాట అనియే యున్నది. (ఉ.436) సూరి ననుసరించి 'అనుప్రయుక్తం బగు అటశబ్దము ప్రాయికముగాఁ గ్లీబసమ'మనుచోటప్రాయికశబ్దమున కిది వివరణముగా నుచిత మైయున్నది.

## పవర్గకాంతములు :

బాల.కృ.8,9సూత్రము లట్లు గ్రహించిరి. (ఉ.8,9,సూ.) "ఈపవర్గకాంతములు ప్రాయికముగా నపుంసకలింగసమములు." (ఉ.437)వీ రిట సూరి ననుసరించి యుదాహృతు లిచ్చిరి.అవి యెల్లఁ గ్లీబసమములే.మువర్ణకాంతము లై యున్నవి. 'ప్రాయిక' మనుటకుఁ గ్లీబసమము గానిపవర్గకాంతము నుదాహరించిన బా గుండెడిది.

ఇట సూరి కలియున కత్వమును జెప్పుటంగూర్చి "కలియుధాతువునకుఁ బర్యాయ మగుకలయుధాతువు సూరిగారికి స్మృతి గోచరము కాలేదా యని యాలోచింపవలసియున్న" [వ్యా.సం.స.1724] దనిరి. అట్టియెడల 'కలపము' కలయుధాతునిష్పన్నముగా గుర్తించి 'కలియు'ను తిరియ్వాదులతోఁ జేర్పకుండు టొప్పును. కాని వీరు ఉ.లో. 'కలియు- కలయు- ప- కలపము' అని చూపిరి. [437] కలియు- కలయు- కావలె నన్న వీరు సూరివలె నిట నత్వమును వివరింపలేదు. మఱి యిటఁ 'గలియు' నేల చూపిరో.

## అప్పాదులు :

బాల.కృ.10,11,12,సూత్రము లట్లు గ్రహించిరి. [ఉ.10,11,12సూ.]

'అప్పాదులకు నజీ యగు' [13]ననుసూరిలక్షణమును వీరు 'పీచు ప్రభృతులకు నజీ యగు' [ఉ.13సూ] అని సవరించిరి. 'సూరి అప్పాదుల కు నజీ యగు' అని సూత్రించుట సరి గాదు. అవి కృదంతము లనరాదు' [ఉ.429] అప్పన- ఒప్పన- ఉజ్జన గట్టన గడన మన్నన అనుశబ్దములు అర్పణాదిల్యుడంతసంస్కృతశబ్దభవము లగుటచేత వీనిలోని"న"అనునది యాచ్ఛికకృత్ప్రత్యయ మనుట సరి కా దని తోఁచుచున్నది. సూరి భ్రమించి యిట్టిప్రకృతిప్రత్యయవిభాగము చేసె ననఁదగును' [వ్యా.సం.స.1751]

ఇవి తద్భవములుగా నిట్లే యేర్పడియుండవచ్చును, కాని సూరి యిట్లు ప్రకృతిప్రత్యయవిభాగము చేయుటలో భ్రాంతిపడె ననరాదు.

ముఖమ్- మొగము ఇత్యాదులందు మొగప్రకృతి, "ము"ప్రత్యయ మని విభాగింతురు గదా. "ముఖ" యనుదానినుండి"మొగ"యనియే తద్భవ మేర్పడె ననలేము. అట్లె అప్పన అర్పణశబ్దభవ మైన నవర్ణము కృత్తుగాఁ జెప్పుటలో దోషము లేదు. అవసరమును.

సూరివలెనే వీరును క్రి.సూ.81సూ.వద్ద అప్ప- అప్పగించు అప్పించు అప్ప [అర్పణ] [ఉ.407] అని చూపిరి. దీనినుండి అప్పగింత ఒప్పగింత యనురీతికృదంతములు నేర్పడును. అట్టియెడల అప్పించు, ఒప్పించు, ఉజ్జగించు, గడించు, మన్నించు, గట్టించు [శ.ర] అనుధాతురూపములనుబట్టి "అప్ప" ఇత్యాదు లాచ్ఛికధాతువు లనుట స్పష్టమే. అట్టియెడల అప్పన ఇత్యాదులలోనియప్పాదు లాచ్ఛికధాతువులే అయినపుడు మీఁదినవర్ణకమును [నాచ్ఛిక]కృత్తుగా విధించుట యొప్పును గదా. అప్పాదులు తెలుఁగునఁ బ్రత్యేకముగా ధాతువు లై యుండుటనుబట్టియే సూరి యీరీతి నవర్ణమును గృత్తుగా విధించె ననియు నయ్యది యుచిత మనియు గుర్తింపఁదగు.

వఝులవా రిట అర్పణశబ్దభవ మప్పన అని చూపిరి. క్రియా 81.సూ.వద్ద అప్ప.(ఒప్ప) అర్పణ అని చూపిరి. అప్ప ఒప్ప అన్నవి

అర్వాణశబ్దభవము అని కాక తదర్థకము అని చెప్పుట యుద్దేశ్య మేమో.

కాన సూరి యప్పాదుల కనుట సూక్తమే. వీరె వీచుప్రభృతు లనుట వారిపద్ధతికి బాధకము. (చూ.ఉ.క్రి.117)

## పుట్టువు :

బాల.కృ.14నుండి17సూత్రము లట్ల గ్రహించిరి.(ఉ.14-17)మన్నా దులలోఁ బుట్టుధాతువును జేర్చి 'పుట్టువు' అని వీరు విశేషముగా నుదాహరించిరి. (ఉ.441) (వ్యా.సం.ప.1736) 'పుట్టుగు' అనియు రూపము గలదు. అట వకారమున గకార మైన దనవలె, విచార్యము,

## గీఱ్వాదులు :

బాల కృ.18 20సూత్రముల నట్ల గ్రహించిరి (ఉ.18-20) కాని యిట గీఱ్వాదులు మున్నగుచోట్ల 'ఱ్వా' అనుదానికిఁ బిదప (ర్వా) యని కుండలీకరణమునఁ గూర్చి చెప్పుట వీరిలక్షణముల విశేషము. ఇట్లు చూపుట నవసరము.'అలఘురేఫంబు లుప్తాచ్కంబగుచో లఘురేఫం బగు'(ప్రౌఢ.ము.ల.2) నని సాధురేఫ మగు నని యనుమానింప ['ఱ్వా' యని ప్రధానముగాఁ జూపిరి గదా] ననవసరము లేదు. [ఇట యణాదేశకారణమున నలఘురేఫముపై నచ్చు లోపించు ప్రసక్తి లేదు] ''గీఱు' మొదలగు నీశబ్దములు సంస్కృతమున ననుకరింపఁబడుటంజేసి యణాదేశము మొదలగుసంస్కృతలక్షణమె యందు వర్తించును గాని (యలఘురేఫమునకు లఘురేఫ మగు నను) నాంధ్రలక్షణము వర్తిల్లరాదు. కావున వీరు ['ర్వా] యని చూపుట సరి కాదు. అనుకరణ మగుటంజేసి శకటరేఫ మం దుండుట యవసరమె.

## మఱికొన్నికృత్తులు :

బాల.కృ.21,22సూ. లట్ల గ్రహించిరి. [ఉ.21,22] పిదప వీరు 23-29 ప్రౌఢ.నుండి 30-33 గాణపతవివరణమునుండి లక్షణములు ప్రస్తావించిరి.

పిదప వీరు "తెలియునకు విడియు కొనునకు కోలు నగు"(ఉ.34సూ) నని చెప్పిరి. "ఇందు కొనునకు కోలును" అని సామాన్యముగాఁ జెప్పుట యుచితముగా లేదు. దీనివలనఁ గొనున కెల్లయెడల ప్రత్యేకముగా నున్నను 'కోలు' రావలసియున్నది. కాని వీరు పొగడికోలు మున్నగురీతి నను ప్రయుక్త మగుకొనునకే కోలు అగుటను జూపిరి. కొనుట యనునర్థమున 'కోలు' అని యుండదు. కావున వీ 'రనుప్రయుక్తం' బగుకొనునకుఁ జెప్పుట యవసరము. అనుప్రయుక్తమునకును నెల్లయెడల లేదు. వండికొనుట యనుదానికి 'వండికోలు' అనురూప ముండదు. 'కొన్నియెడల' ననుటయు నవసరము.

ఇంక వీరు 'కొనునకు కోలును' అగు ననఁగాఁ గొనుధాతువునకుఁ గోలు అను (కృత్)ప్రత్యయ మగు నని యర్థ మగును. ఈసూత్రమునఁ బూర్వార్థమునందుఁ 'దెలియునకు విడి' యనఁగాఁ దెలియుధాతువుపై 'విడి' కృత్తుగనే గదా యవునది. ఇంక వీరిలక్ష్యములనుబట్టి 'కొను' అనుదానికిఁ గోలు ఆదేశముగా వచ్చుట యుద్దేశించి రనవలె. ఆయంశము సూత్రమున స్పష్టము గాదు.

'కొను' ధాతువు కావున దాని కాదేశ మైన'కోలు'అనునదియు ధాతువే యగును. 'కోలు' కృదంతముగా (భావార్థకము) వీ రుద్దేశించి రనుటకు వివరణమునను నాధారము లేదు. పొగడికోలు- (పొగడు+కొను) అను రీతిగనె 'కొను'నే చూపిరి. పొగడికొను- పొగడికోలు అనునవి సమానార్థకము లని చెప్పవలసివచ్చుట వీరిలక్షణమున నిం కొకయనర్థము. ఇటఁ గృత్ప్రత్యయ మనుక్త మైన దనక తప్పదు.

పొగడికోలు- పొగడికొనుట కావున 'కోలు' కొనునకుఁ గాక భావార్థకటప్రత్యయాంత మగు'కొనుట 'కాదేశించు "భావంబునం దనుప్రయుక్తం

నగుకొనుటకుం గోలు విభాష నగు" నను ప్రౌఢ.లక్షణము దీనికంటెంగొంత యుచితము. ఇట ననుప్రయుక్తము "కొను" అనునదే. "కొనుట" మొత్త మనుప్రయుక్తము గాదు. అనుప్రయుక్త మైనకొనుపై "ట"వర్ణక మగును గావునఁ బ్రౌఢ.లక్షణము నించుక మార్పు నపేక్షించుచున్న దని తోఁచు. (సూ.త్రి.శే.)

దీనింబట్టి చూడఁగా పోఁగడికోలు అనునర్థమునఁ బొగడికొనుట యని యు నుండనవు. కావున కోల్వాదేశమును విభాషగాఁ జెప్పవలె. ప్రౌఢ. అట్లు చెప్పు టుచితమె. మొత్తముపై వీరు "కొనునకు కోలు నగు" నని చెప్పినలక్షణము వా రుద్దేశించినయర్థము నీఁజాలదు. సరి కాదు.

వేఁడికో లుచితంబు (అది.5.218) ప్రాణంబుల్ నాఁచికోల్ దప్పు డు (సౌప్తి.2.14) లచ్చిం బుచ్చికోలున్ [ఉద్యో.1.232] ప్రాణంబు రక్షించుకోలు (హరి.పూ.7.65) మొద లగుచోట్ల వేఁడికొనుట యనురీతి నర్థము స్పష్టము. తెచ్చికోలేడ్పులు [కాశ.4.30] అనుచో [తెచ్చికొనున్నట్టివి యగునేడ్పులు] నర్థమున భేదము గోచరించు.

## ఇంపు-అడ :

ఇంపు అడప్రత్యయాంతములను వరుసవారు సాధువులుగాఁ దలఁచు టుచితముగా నున్నది. అయ్యది విధింపఁదగినవి. [ఉ.377]

దాకాలితాటింపులు (శృం.శా.1.39] తాలింపులు [జై.3.50] మాట లలో నందగింపు [కువ.5.5] వీని కారగింపు నేయఁగా [శుక.3.191]కోట ముట్టడము దక్కి [హరి.ఉ.1.25] సోలడములు [శృం.శా.3.220] చల్లి దములతోన్ [కువ.2.398] మొ॥

పిదప "ఇవ" మొద లగుకృత్తులు వివరించిరి. ప్రౌఢ.ప్రభృతిలక్ష ణముల నిట సంగ్రహింపఁదలఁచియే యుండిరి కావున "వడిప్రభృతు లి ట్లె యగునది యనుపరిచ్ఛేదాంతలక్షణమును వీరు నిట నీపరిచ్ఛేదముచివరఁ

బేర్కొనఁ బడ గుండెడి దనిపించు.

"ఇది అచ్ఛికకృదంతపరిచ్ఛేదము" అని దీనిని ముగించి పిదప సంస్కృతకృదంతములు చెప్పి చివర "ఇదిసంస్కృతకృత్పరిచ్ఛేదము" అనిరి. ఇది యెల్లఁ "కృదంతపరిచ్ఛేదము"లోనివిషయమె. దాని నాచ్ఛికకృదంతము సంస్కృతకృదంతమును గలయవి ప్రకరణములుగాఁ బేర్కొనఁబడ గుండెడి దేమో యని తోఁచును.

కానిచో మొదటనే కృదంతపరిచ్ఛేద మని సామాన్యముగాఁ గాక "అచ్ఛికకృదంతపరిచ్ఛేదము" అని ప్రారంభించి, సంస్కృతకృదంతములను "సంస్కృతకృదంతము" అని కాక సంస్కృతకృదంతపరిచ్ఛేదము" అను పేర "కృదంతపరిచ్ఛేదములు" రెండు చెప్పవలె.

ఇట్లె తద్ధితపరిచ్ఛేదవిషయమునను.

రెండుతద్ధితపరిచ్ఛేదములు రెండుకృదంతపరిచ్ఛేదములు చెప్పుటకంటె నొకపేర[తద్ధిత]పరిచ్ఛేదమున నాచ్ఛికతద్ధితప్రకరణము, సంస్కృతతద్ధిత ప్రకరణము, ఇట్లె [యొకే కృదంతపరిచ్ఛేదమున] అచ్ఛికకృదంతప్రకరణము, సంస్కృతకృదంతప్రకరణము" నని నవాంతరవిభాగము, ప్రకరణములుగాఁ జెప్పిన బడ వుండెడిది గదా.

ఇది కృదంతపరిచ్ఛేదము

# ప్రకీర్ణక పరిచ్ఛేదము

ఉద్ద్యోతమున నీపరిచ్ఛేదమె లేదు. ఇందుఁ జెక్కు విషయము లాచ్ఛిక శబ్దసంబంధు లగుటచే వీ రందుఁ జేర్చిరి. "ప్రకీర్ణకముగా" నీపరిచ్ఛేదమును బేర్కొనుటలోనె సూరియు నిందలిలక్షణము పూర్వోక్తము లగునాయా పరిచ్ఛేదములకు సంబంధించియుండుటను సూచించెను.

## ఋౠ-రలతుల్యత:

"పదాద్యంబులు ఋౠవర్ణంబులు రలతుల్యంబులు" [1]అనుదాని నట్ల గ్రహించిరి. [సంధి.2] వీ రిది యుత్త్వసంధికిఁ బిదపఁ జూపిరి. ఇది యుత్త్వసంధికి మాత్రమె కాక ద్రుతకార్యాదు లగునితరాంశములను బ్రయోజనవంత మగుట యిటనే స్పష్టము.

## నల్లెరు:

"అచ్ఛికపదంబులం దుత్తమంబు లగురులుడుల ముందటియేత్వంబునకు హ్రస్వంబు విభాష నగు" [2]ననుసూరిలక్షణమును వీరు "అచ్ఛిక సమానపదంబులం దుత్తమంబు లగురులుడులముందటి"ఏ"త్వంబునకు హ్రస్వంబు విభాష నగు" [అచ్ఛి.32సూ] అని చూపిరి. "ఏ"త్వంబున కనుచో యడాగమాభావము స్పష్టతకె. ఇది యనింద్యగ్రామ్య [ఉ.సం.24] మని వీరిమతము సూరి "అచ్ఛికపదంబులం దనఁగా వీరు "అచ్ఛికసమాన పదంబులం" దని సమానపద మధికముగాఁ జెప్పిరి. "ఉత్తమంబు లగు" ననుతరువాతమాటలనుబట్టియే కాక "అచ్ఛికపదంబునం దన భిన్నపదముల నడుమ నని యర్థ మగునవకాశమె లేదు. "సంస్కృతసమేతరంబు లయిన తెలుఁగుశబ్దములయందు"- [ఉ.సం.16] మొ॥స్థలముల సమానపద మున్న

దా? ఇది లేనిసూరిలక్షణమున నెట్టియపసిద్ధాంతమును లేమి వీరు "సమాన" శబ్దమును జేర్చుట వివరణ(ప్రాయ మనఁదగు.

సూరిలక్షణము సూక్తమె. ప్రాతిపదికాంత్యవికారము, మొద లగు నాచ్ఛికపరిచ్ఛేదోక్తలక్షణములకు భిన్నముగా నిది ప్రాతిపదికనడిమివికార మగుట గమనింపవచ్చును.

## ఉయ్యేల :

బాల.ప్రకీ.3.4సూత్రము లట్లు గ్రహించిరి. [ఉ.ఆచ్ఛి.33,34సూ]

"ఉయ్యేల -- వీనియందు సమా 76వసూత్రపుద్విత్వపరకహ్రస్వము గల్గుచున్నది" [ది.173] ఇట "76వ"యనుట యనింద్యగ్రామ్యముగా నేమో. ఇఁక నిట్టివివరణము సూరిలక్షణమున [సమా.13] సరిపడును. వీ రాలక్షణమును మార్చి ప్రస్తుతస్థలమున నుపయోగపడకుండఁ జేసికొన్న విషయము మఱచిరి. "ద్విరుక్తం బగుహల్లు పరం బగునపుడు పదద్వయ సంధిలో నాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు (ఉ.సమా.76) నను వీరిసూత్రముచేఁ పదద్వయసంధియందే హ్రస్వము. "ఊచు + హేల-ఏల-ఎల-ఊయెల -- అని చేవ మనియు నివి సమానపదములు గా వనియుఁ జెప్పెడియప్పకవ్యాదులవ్రాఁత సరి కాదు" (ఉ.173) గదా. ఊయేలాదు లెల్ల సమానపదములే గావున నిటఁ బదద్వయసంధిప్రసక్తియే లేదు. వీరి సూత్రముచే నిట హ్రస్వము రాదు. "ఊయ్యేల" యనురీతి నపరూపములే వీరిలక్షణము నిరూపించును.సమా.76సూత్రముతో వీరు సూరి అచ్ఛి.13.లక్ష ణమును సవరించుట యసమంజస మనియే నంగీకరింపవలె. లేదా సమాన పదములం దిట్టియెడల హ్రస్వము నిం కొకసూత్రముచే విధించుకొనవలె.

ఇట సూరిచూపినఓయశబ్ద మేకోశమందును గానరా(వ్యా.సం.స.1759) దనిరి. ప్రయోగములం బరిశోధింపవలె.

## అక్కటాదులు :

బాల.ప్రకి.5,6,7,8సూత్రముల నట్లు గ్రహించిరి. (ఉ.అచ్చు.35.36,25,26)

అక్కటాదులలో (సూరి పేర్కొన్న ఇత్యాదులలో) వీరు 'అద్ది ఇద్ది ఎద్ది ఎవ్వఁడు ఎవ్వాఁడు'లను జేర్చిరి. వీనిం జేర్చినవీరు అవ్వి ఇవ్వి ఎవ్వి యను బహువచనాంతరూపము లేల పేర్కొనలేదో. ఇట దివిప్రత్యయము లను, నట ద్విత్వమును జెప్పె ప్రౌఢ. అద్ది ఇద్ది ఎద్ది అనువానిని సాధించినది.

అద్ది ఇత్యాదులలో ద్విత్వలోపమునకై వీని నక్కటాదులలోఁ జేర్ప వలె నన్నఁ బ్రత్యయము 'ద్ది' అని చెప్పవలె. ఇట్లు చెప్పినచో అయ్యది ఇత్యాదులలో జడ్డలోపము నిత్య మనవలె. విభాష కట్టివ్యవస్థ చేసికొన వీలు లేకపోలేదు. కాని ప్రత్యయము సద్విత్వముగా విధించుకొన నేల? కొన్ని యెడల నిత్యముగను గొన్నియెడల వికల్పముగను లోపమును జెప్పుకొన నేల? [నన్ను ఇత్యాదుల నిత్యలోపమును జెప్పనవసరము లేమి గమనింపఁ దగు-నన్నెలె) కావునఁ బ్రౌఢ. పేర్కొన్నట్లు ప్రత్యయములు దివి యని పేర్కొని యవసర మైనచోట ద్విత్వము వికల్పముగా విధించుకొనుటయే యుచితము. కావున వీని నిటఁ జేర్పరాదు.

## మన సేకాగ్రత :

'జడ్డకారంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. (9)అనుసూరిలక్షణమును వరుసలవారు 'జడ్డకారంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో 25,26(అచ్చు)సూత్రములకు లక్ష్యము లగుజడ్డలకు లోపములేదు' (ఉ.అచ్చు.27)అని సవరించిరి. సూత్రముగా దీనిస్థితి విలక్షణమె. "25,26 సూత్రములకు లక్ష్యము లగు" అనుటచేత మన సేకాగ్రత (శాంతి.5.121) మున్నగునవి విరోధింపనేర [ఉ.170]వని తమసవరణమునకుఁ బ్రయోజన మును వివరించిరి. సూరిలక్షణమున కివి విరోధించు నని తాత్పర్యము.

కాని యి ట్లనుట యసంగతము. ఇట విధింపఁబడుచున్నది ద్విత్వ మునకు లోపము రా దని. లోపము ప్రాప్తించుచున్నపుడు గదా రా దని నిషేధించుట.. 'మనస్సు' అనుచో నేసూత్రముచే నైన వీ రైన లోపమును జెప్పిరా? 'మనఃప్రభృతులసకారంబునకు ద్విత్వంబు విభాష నగు' (తత్స. 84) అని సూరివలెనే యిట ద్విత్వము వచ్చుటయే విభాష యని వీరును జెప్పిరి. అట్టియెడల 'మనసు' అనురూపము ద్విత్వము రానిపక్షమున నేర్ప డినదే కాని ద్విత్వము లోపించుటచే నేర్పడినది గాదు. ద్విత్వమున కిట లోపమె ప్రాప్తింపకుండఁగా నిషేధింప నేల?

కావున మన నేకాగ్రత యనురీతిని సూరిలక్షణమును విరోధింప నేరవు.

'ఇట్టియాచ్ఛికవిధులు పెక్కు ప్రకీర్ణము లనుచు సూరి సూత్రించె (ఉ.168) నని యివి యాచ్ఛికవిధులుగా గుర్తించియు వసులవారు 'మనసు' అనుసంస్కృతసమరూపము నిటఁ బ్రస్తావించుట వింతయే. (సూత్రమున నాచ్ఛికముల కని లేదు. అవసరము లేమి.)

ఇట్టితత్సమశబ్దములను నుద్దేశించియే వీరు 25,26సూత్రముల నీసూత్రమునఁ బ్రస్తావించిన నది యనవసరము. అని లీసూత్రములవేఁ గాక వే తొాకదానిచే జడ్డలోపము విధింపఁబడినదా? అట్టిది లేదు గావున వీరు సూరికంటె నధికముగా సూత్రమునఁ జేర్చినభాగము సూరిసూత్రవివరణమె కాని ప్రత్యేకప్రయోజనము గలది గాదు.

## అత్తైత్తె:

పయి,7,8సూత్రములచొప్పున హల్లోపము గల్గిన దానిపై నుండు నచ్చునకుఁ బరరూపసంధి గల్గనేర దని9సూత్రపు వద్యవసితార్థము అయి + ఎత్తె ననున్ + అడిగె. -ఇట్టిచోటులందుఁ బరరూపసంధి కల్గ నేరదు' (వ్యా.సం.స.795) ఇది సరి కాదు. ఇట సంధి లేకున్న ననుఁడిగె

ననుచో మాత్రమె యిష్టరూపసిద్ధి మిగిలినచోట్ల జడ్డలోపముచేఁ బరరూప సంధి లే దనుటవలన అఱు+ఎత్తె=అఱెత్తె నని సంధి జరుగదు గాని సంధి లేనపుడు రావలసినయడాగమము రాదా? పరరూపసంధి లే దనిరే కాని యడాగమము లే దనలేదే వీరు. అఱుయెత్తె. కనుయదరె నని యుండునా? యడాగమమును లే దందురు గాక అఱు ఎత్తె కను అదరె నని యుల్లేయుండవలె నట్టివి మాత్ర మున్నవా? అఱ్ఱెత్తె నని మాత్రమె యుండును గాని యింకొకతీఱుగా నుండ దనియే సూత్రపుఁబర్యవసితార్థము. జడ్డలోప మైనఁ బరరూపసంధి కా దని కాదు పరరూపసంధి యగుచో జడ్డలోపము లే దని. (చూ. త్రి. శే.) కావున వీరియీవివరణ సమంజసము.

## తొలిహల్లులోపము :

'హాదులయు నీలుగులోనగువానితొలిహల్లునకు లోపంబు బహుళంబుగ నగు'(10) ననుసూరిసూత్రమును వీరు 'హాదులయు నీలుగుప్రభృతులయుఁ బదాదిహల్లు విభాషను లోపించు' (అచ్చ.28) ననిరి.

'లోనగువానితొలిహల్లున' కనుసూరివచనమునకు వీరి "ప్రభృతులయుఁ బదాదిహల్లు" అన్నది వివరణమా? సూరివచనముల నపసిద్ధాంతమేమొ? వివరణముగానే యైనను వీ రధికముగాఁ జేర్చిన "పద"శబ్దము వలన నిబ్బంది. "హాదు లైనపదము లయు, నీలుగుప్రభృతు లైనపదము లయు" -అనురీతిగా నన్వయింపవలెఁ గదా. కాని నీలుగుప్రభృతులు పదములా? సూరివలెనె వీరును నీలుగు నెగయు అనురీతిని ధాతువులనెఁ ప్రకృతులనె చూపిరి.] ఇఁక నీయవి క్రియావిభక్తులో కృత్తులో చేరి పదము లైనపుడే తొలిహల్లు లోపించు నని యెంచిరా? అది యనవసరము. వీరు నట్లు తలఁచినట్లు లేదు.

సూరిసూత్రము సూక్తమె కదా.

## పూను-పొదవు :

పూనుపొదవుల కాదిలోపమును సూరి తిరస్కరింపఁగా రవ్వానిని నీలుగుప్రభృతులలోఁ జేర్చిరి. అనఁగా సూరియభిప్రాయము సరి గా దన్న మాట.

ఆద్యక్షరలోపమున నేర్పడిన దని యంగీకరించినశబ్దమునకును నాద్యక్షరలోపము లేని మొదటిశబ్దమునకును నర్థములం (సకర్మకత్వాదులం) దించు కేని భేద ముండరా దని సూరిగారియాశయము -- ఇట్లగుటం జేసియె సూరి -పూనుపొదవు- అని వ్రాసెను' (వ్యా.సం.న.797) సూరి యాశయము సమంజస మై యెల్లరు నంగీకరింపవలసిన దై యున్నది. ఏ మైన నిట వీరు సమంజస మైనసూరియాశయము ననుసరించి పూనుపొద వుల నాదిహల్లోపము లే దనువంశము నంగీకరించి రనవలె. అంతే గాక సూరిని సమర్థించుచు శ.ర.అభిప్రాయమును దిరస్కరించిరి. (వ్యా.సం. న.798] మఱి యట్టియెడల నిటఁ బూనుపొదవులను నీలుగుప్రభృతులఁ జేర్చు టెట్లు? పూను యథాతథముగా గ్రహించిరి. పూను-సకర్మకము నకర్మకమునుగా ఊనుసకర్మకము మాత్రమె. సూ.ని. ఊనుధాతువున కకర్మకత్వమును నంగీకరించినను నకర్మకత్వమున పూనుధాతువునకు 'కదఁగు' అని యర్థముగా ఊనునకు నాఁటుకొను అని యర్థము -కొన్నియర్థ విశేషములం దైక్యము నంగీకరించుటుచిత మని శ.ర. గు.ప్ర. ఆశయము -(వ్యా.సం.న.797)అనఁగా సూరి యాశయమును దిరస్కరించి శ.ర.,గు. ప్ర.లయాశయమునా మోదించిరాయిట. సం.లో వీరు "పూను" నిందుఁ జేర్ప లేదు. (వ్యా.సం.స.797)

సూరి యుదాహరించినశబ్దముల నెల్ల నట్టియభేదస్థితిని వీరు గుర్తించిరి. వర్ణలోప మైనంతమాత్రమున నర్థభేద మెట్లు (చిలుక-చిల్క- నేరిచెను- నేచెను మొ॥ సూరియాశయ మెంతయు నుచిత మైయుండఁగా దానిని

వీరు తిరస్కరించుట కేవల మసమంజసము. 'పూను'ను జేర్చుట సరి గా దని వారిసం.వివరణమె స్పష్టము చేయు.

ఇంక వీ రిట పొదవు చేర్చినను 'సంభవించు, కలుగు' అనునర్థ ములు చూపుటచే నీయర్థములందే యాదిహల్లోప మగు నని చెప్పఁదలఁచి రన్నమాట. సం.లోను నీయర్థములం దిది నీలుగుప్రభృతులలోఁ జేర్పఁ దగిన దనిరి. (వ్యా.సం.స.789,800) కాఁగాఁ బొదవుధాతువునకు వీ రంతకు ముందు చూపిన వ్యాపించు పయికొను ఇత్యాద్యర్థములు ఒదవుధాతువునకు లేవు. ఒదవుధాతునకుఁ గలలభించు, వర్ధిల్లు, నెఱవేరు (సూ.ని.) ఇత్యాద్యర్థ ములు పొదవుధాతువునకు లేవు. అట్టియెడలఁ బొదవులో నాదిహల్లోపముచే "ఒదవు" ఏర్పడిన దను టెట్లు? లభించు ఇత్యాద్యర్థములం దెట్లును ఒదవు ధాతువును బ్రత్యేకముగా నంగీకరింపవలసినదే కదా. సూరియాశయము సముచిత మైయుండ సరి గా దనుట కెట్టిప్రమాణములు చూపకయె వర్షుల వారు తద్విరుద్ధముగాఁ బేర్కొనుట సరి గాదు గదా.

కావున వీరు పూనుపొదవులను నీలుగుప్రభృతులలోఁ జేర్చుట సరి గాదు. సూరిమతము సమంజసము.

సూరి నీలుగుప్రభృతులలోఁ బొందును జూపుటనుగూర్చి వీరు "పొందుశబ్దము క్రియయు, సంధి, మైత్రి యనునర్థములలో విశేష్యము నై యుండగా ఒందుశబ్దము క్రియమాత్రమె యగుచున్నది. ఇది సూరి చూచికొనలేదు గాఁబోలు" [వ్యా.సం.స.797) ననిరి. సూరి నీలుగు మొద లుగాఁ జూపిన వెల్ల ధాతువులె యగుట స్పష్టము. పొందునకు ముందువెను కల నున్న వెల్ల ధాతువులె యైయుండ నడుమ నున్నపొందును ధాతువు మాత్రమె యగుట సహజము. పొందు విశేష్య మైయున్నను నది యీధాతు వులనడిమిపొందుశబ్దముచే గ్రహింపఁబడ దని చెప్పుట యుచిత మైయుండ వీరు పొందును జేర్చుటను విమర్శించు టేల? సూరి చూచుకొనియె ధాతు

వగుపొందును ధాతువులనడుమఁ గూర్చినట్లు గు_ర్తింపరాదా? ఉ.లో నట్లు గు_ర్తించి "పొందు"ను సూరివలెనె చూపు టుచితముగా నున్నది.

## పెండ :

బాల.ప్రకీ.11,12సూత్రము లట్ల గ్రహించిరి. [ఉ.అచ్చి.37,38] పేఁడశబ్ది మోయారాదులలో నుండి తొలిదీర్ఘమునకు హ్రస్వము నొందును. ఇట వజ్ఝలవారు 'పేఁడశబ్దాదిదీర్ఘము హ్రస్వము కాఁగాఁ బదాదిహ్రస్వము మీఁద ఖండబిందు వుండనేరదు గాన నది పూర్ణముగాఁ బరిణమించును. పేఁడ పె+ఁ+డ పెండ [వ్యా.సం.స.1763] ఉ.లోను పేఁడ-పెండ [సంధి. 22వసూ] అనుటలో [ఉ.174] సం.లోనిపై యభిప్రాయమె యుద్దేశించి రనవచ్చు.

కాని యఱసున్న నిండుసున్నగా మాఱిన దని యూహగాఁ జెప్పుట కంటె లక్షణముచే సాధించు టుచితము గదా. 'పేఁడ' యనుచో హ్రస్వము రాఁగా '(పెఁడ' అని యగు) ఖండబిందువు హ్రస్వముపై నుండును గాన 'హ్రస్వముమీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును' (సం.14) అనుసూత్రముచే నిండుసున్న వచ్చి 'పెండ' యగును. వైకల్పిక మనుటచేఁ బూర్ణము రాక యొకపక్షమున ఖండ మట్లే యుండవలసియున్న ను 'అఁటయిఁకచుఁడుశబ్దంబులం దప్ప'- నుడితొలిహ్రస్వముపై ఖండబిం దువు (సంధి 22) ఉండరాదు గావున ఖండ మట్ల యుంకుస్థితి వారింపఁబడి పై (సం.14)సూత్రముచే నిండుసున్నయె నిత్యముగా నగు నని గ్రహింపఁ దగును. వఝలవారును 'పూర్ణముగాఁ బరిణమించు' ననుటలో నీప్రక్రియ యుద్దేశించిన నట్లనుట సమంజసమే.

## సీఱఁకోళ్ :

బాల.ప్రకీ.13,14,15సూత్రము లట్ల గ్రహించిరి. (ఉ.అచ్చి.40, 41,39)

'పదాంతంబు లయి యసంయుక్తంబు లయినను లురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' (16) ననుసూరిసూత్రమును 'పదాంతంబు లగునులురుల' యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' [ఉ.అచ్చి. 24] అని చూపిరి.

కాఁగా సూరిలక్షణమునందలి 'అసంయుక్తంబులయిన'అనుదళమును దొలఁగించి రన్నమాట. దీనింగూర్చి సంయుక్తములందును నీలోపము గల దు. నీరుకోళ్ళు- నీరుకోళ్- --[ఉ.168][వ్యా.సం.స.791] అద్విరుక్తము లయం దీలోపము ప్రచురము. ద్విరుక్తములందు నొండురెండుచోట్లఁ గలదు గదా యని ద్విరుక్తాద్విరుక్తవివక్ష లేక సాధారణముగా నుత్వలోపము చెప్పుట లక్ష్యానుగుణమా? స్పష్టతను దగ్గింప నేల? కన్నెఅచి ఇత్యాదులలో ముందు క్రిందిహల్లు లోపింపఁజేసి [కన్ను-కను] యాపిదపనె యిట నుత్వ లోపము చేసిరి.[అసంయుక్తముల నని కవిభల్లహైః మున్నగుచిం.లక్షణము నెడవలెనె] కాఁగా నీరుకోళ్, అఱువుళ్ అనురీతి నొండురెండుప్రయోగము లకై బహుళపద మాశ్రయింపఁదగియుండ లక్షణము నస్పష్టము చేయ నవ సరము లేదు గదా.

'అసంయుక్తంబు లయి' అనుటచే ద్విరుక్తములందే కాక భిన్న హల్సంయుక్తస్థితిలోను నీలోపము సూరిలక్షణము వారించుచున్నది. తేర్లు తేర్(ల్) గోర్లు- గోర్[ల్] అనురీతి నుండవు గదా. ద్విరుక్తములం దయినను అఱ్ఱు-అర్. కఱ్ఱు-కర్ అనురీతి నవునా? వీనిని వారించుటకై వీరు బహుళపదము నాశ్రయింపవచ్చును. కాని 'యసంయుక్తంబు లయిన' యనుదానిం దొలఁగించి ద్విరుక్తస్థలముల నొండురెండింటఁ దప్ప సాధారణ ముగా నీలోపమున కప్రవృత్తి యని చెప్పుకొనుటకంటెఁ బ్రయోగప్రాచు ర్యము ననుసరించి 'యసంయుక్తములయం' దని స్పష్టము చేసి యాయొండు రెండుప్రయోగములు బహుళపదసాధ్యము లనుట మేలుతరము గాదా? కను కనే యేమో ముం దిట్లును జెప్పిరి.

"బహుళగ్రహణముచే నురులు అనువానికి భిన్నస్థలములందును స్వరలోపము -మాఱు+పల్కాన్- మార్పల్కాన్- --సీరుకోళ్ళు- సీరుకోళ్ (ఆము-1.71) అఱువుళ్ళు- అఱువుళ్ (భాస్క-.యుద్ధ.548) (ఉ. 168) ఇట్లివి బహుళపదసాధ్యము లని వారే నిరూపించియు 'అసంయుక్తంబు లయిన' అనుదానిచే నీరూపములు సాధ్యములు గా వనుట విరుద్ధము గదా.

కాఁగా సూరిసూత్రమందలి "యసంయుక్తంబులయిన" అనుదళము ప్రయోజనవంత మైయుండఁగా వీరు దానిని దొలఁగించుట యసమంజసమని వారిమాటలచేతనె స్పష్ట మగుచున్నది.

"నులురులయుత్వమాత్రమునకే లోపమును విధించుటచే మార్పలుకంగ, కీడ్గురతల్పగుండు, కీడ్పడన్ మున్నగురూపములు బాలవ్యాకరణసాధ్యములు గానేరవు" [వ్యా.స.సం.791] అని సం.లోఁ బేర్కొన్నను నిట వీరు నల్లే సూత్రమునఁ జెప్పుటనుబట్టి సూరి "నులురుల" కుల్లోపము చెప్పుట సమంజసమె యని ఉ. ననుసరించియు గుర్తింపవచ్చు. బాలవ్యాకరణసాధ్యములు గా వన్న మార్పలుకంగ మున్నగునవి బహుళపదసాధ్యములని ఉ.లో నిరూపించి యీయవి బాలవ్యాకరణసాధ్యము లగుట [బాల. లోను బహుళపదము గలదు గదా.] స్పష్టము చేసిరి.

కాని "మార్పలుకంగ" నన్నది బహుళపదముచే నిట సాధించిరి. అచ్చి.12.సూత్రమునందలి"ర"అనుసది కొన్ని యలఘుఅకారములకును నుపలక్షణము [ఉ.158] అనిరి. అట్లే యిట నేల చెప్పలేదో. ఆసూత్రము [అచ్చి.12]నను బహుళపద మున్నది.

"మఱియుఁ గవిత్రయమువారు పలుమాఱుప్రయోగించిన నిన్, నన్

తన్ అనురూపములును బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడవయ్యె [వ్యా. సం.స.791] చిం.లో సాధించినట్లు బాల.లో సాధింపరాదా?

"నిన్,నన్,తన్, అనురూపములు నిన్నున్ నన్నున్ తన్నున్ అను వానినుండి కవిఖల్లటసూత్రముచే సంపాదించుకొనవలయును" [వ్యా.సం.స. 210] కవిఖల్లటసూత్రార్థము నీబాల.సూత్రము చెప్పదా? కవిఖల్లటసూత్రముచే నివి యగుట యెట్లు? వాక్యాన్తగతపదానాఞ్చ యని ద్రుతలోపము చేసి [నను] అన్యతరలుక్చ యుక్తస్య యని జడ్డలోపము చేసి [నన్ను] ఆపిదపఁ గవిఖల్లటసూత్రముచే నుల్లోపము చేయవలె. "నన్నున్" అను దానితో 'న్ను'వర్ణము కవిఖల్లటసూత్రముచే లోపింపదు గదా. నన్నైతె ననురీతిరూపములు నన్నయాధర్వణీయసమ్మతములు చేయవలె నన్న "నెట్లెట్లో" చేయవచ్చు నని యీమార్గము చూపిరి. వా రనఇట్లిది యెట్లెట్లో యున్నది గాని సక్రమముగా లేదు. అది తద్గ్రంథపరామర్శనమున జ్ఞాతము.

ఉ.లో వీ రిట నన్ను -నన్ -నిన్ను(న్)నిన్ తన్నున్- తన్ అను వవియు నుదాహరించిరి. సద్విత్వము లయ్యును నుత్వలోప మందిన వని చెప్పుట వీరియుద్దేశ్య మేమో. నిన్ను-నిన్ అనుచోవలె నన్నున్ తన్నున్ అనుచోఁ గూడ నవసానద్రుతలోపానంతరరూపమే చూపిన బా గుండెడిది. అయ్యుఁ బిదప ద్రుతము లోపించిన దని యూహించుకొనవలె. కాని యిట సద్విత్వములందే యుత్వము లోపించిన దని చెప్పనక్కఱ లేదు. అకారంబుక్రింది-[.అచ్చి.25]సూత్రమునొద్ద విల్లు-విలు అనుదానితో నన్నున్ ననున్ అని యిమ్మాత్రఁటిని జూపిరి. [సూరియు నను ఇత్యాదిగా జూపె] -కాఁగా నాసూత్రముచే జడ్డ [అవసానమున ద్రుతము] లోపింపఁగా నసంయుక్త మయిన నువర్ణమునందే ప్రస్తుతసూత్రముచే నుత్వలోప మయిన దనఁదగు. వీరు నిట విల్లు-విలు- విల్వానె అని జడ్డలోపానంతరపు టసంయుక్తస్థితినె చూపిరి. అట్ల నన్ను- నను- నన్ అని యేల చూపరాదో

వీరు స్పష్టము చేయలేదు. సూరియు మిన్నడె నని యుదాహరించె.

కాని యిట్టిప్రక్రియ సూరిసమ్మత మనలేము. నన్ బిలిచి ఇత్యాదు లందు నిట్లు నవసానద్రుతలోప మైన దనుసమన్వయము గుదురదు గదా. ఇట్ల యైన నవసానద్రుతలోప మై నాకొఅకు + ఇచ్చె నాకొఅ కిచ్చె ద్రుతము లోపింప కున్న నాకొఅకు నిచ్చె. ప్రథమేతరవిభక్తివిధిక్రియేల, 'న్ను'వర్ణ మరుదుగ రాకుండుట గల దని యీసర్వనామములప్రక్రియ యం దూహించుట యుక్త మని తోఁచు.

ఇట సూరివివరణమం దొకదోషము నిట్లు పేర్కొనిరి.

"తత్పాలుర్ (ఆది.2.92) నలువుర్ (అను.1.316) చింతుర్ (శాంతి.2.180) మున్నగునవియు సూరిచే సంగ్రహింపఁబడలేదు" (వ్యా. సం.స.791) తత్పాలుర్భయం బందఁగన్, నలువు ర్తనయులు, చింతు ర్భూమి- అని యిట నెల్లెడల హల్పరకత్వమున నుత్వలోప మగుటంజేసి యీవిమర్శ సరి గా దని గుర్తించి ఉ.లో దానిని విడుచు టుచితముగా నున్నది.

"వీనిలో పాలుర్ మున్నగుప్రథమారువర్ణోల్లోపమును ప్రౌఢ. సంగ్రహించె" (వ్యా.సం.స.791) ననుటలోఁ బయిని సూరి ప్రథమా రువర్ణకమునం దుత్వలోపము చెప్పలే దని యెంచి రనిపించు. చింతుర్ అను నదియు [సూరిఁప్రౌఢ.]చే సంగ్రహింపఁబడలే దనిరే. సూరి రువర్ణోదాహృ తులు వత్తుర్వారు కార్కొనియె నని రెం డిచ్చెను. వత్తుర్వారు వంటిది గాదా చింతుర్భూమి యన్నది. ఇది వీరు గమనింపలే దేమో. వత్తుర్వారు అనుచోఁ ప్రత్యయరువర్ణమునందును, కార్కొనియె ననుచో శబ్దగతరు వర్ణమునందును నుత్వలోపమును సూరి స్పష్టము చేసె. చింతురు అనుచో వలె తత్పాలురు అనుచోటిరువర్ణమును ప్రత్యయమె. సూరి యిట నుత్వ లోపమును సంగ్రహింపలే దనుట సరి కాదు.

ఉ.లో నిట్టివిప్రస్తావింపకుం టుచితముగా నున్నది. కాని మఱియు నీవిధి హల్పరకత్వమందే నురులకు వర్తించు నని సూరి వ్రాసెను. అది సరి కాదు. ద్రోహిఁగాన్ [పద్యాంతము.] ఎట్లు సహింతుర్ [పద్యాంతము] అనిరి. [ఉ.168]

ఇదియు సరి గాదు. సూరి నురులకు హల్పరకత్వమం యీవిధి వర్తించు ననలేదు. "ప్రాయికంబుగా హల్పరకంబులకుఁ జూపట్టెడి" ననెను. వీ రవధారణార్థకము చేర్చి విపరీతార్థమును దెచ్చిపెట్టిరి. హల్భిన్న [అవసాన] స్థలములయం దీవిధి వర్తిల్ల దనియే సూరి తలఁచినఁ బ్రాయి కంబుగా నన నేల? [చూపట్టెడి ననుటయు] బాహుళకంబుచే నీలోపము నురుల కవసానంబున లే దనిఁస్పష్టముగాఁ జెప్పఁడా? కాఁగా సూరిలక్షణము నకు విరుద్ధ మైనవీరివిమర్శ యసంమజసము.

అవసానమున లోప మైనందులకు వీరు చూపినయుదాహరణములలో మొదటిది సరి యైనది గాదు. 'ద్రోహిని గాను' అనుచో 'కాను' అను క్రియాపద ముత్తమపురుషైకవచనాంతము. కావున నియ్యది ద్రుతప్రకృతి కము. అనఁగా నిందుఁ జివరినువర్ణము ద్రుతము. ఈద్రుతస్వరమునకు 'అవసానంబునందు ద్రుతస్వరలోపవిధి వేఱుగా నుండఁగా నది ప్రస్తుత సూత్రమునకు లక్ష్య మగుట యెట్లు? ద్రుతేతర మగు'ను'వర్ణకమున కుత్వ లోపమును జూపఁగలగిన నది యీసూత్రమునకు లక్ష్య మగు. దీనింబట్టియు నిట సూరివివరణ ముచిత మని స్పష్టము. ప్రౌఢవ్యాకర్తయు (శబ్ద.16) లురువర్ణకములయందే చెప్పుట గమనింపఁదగు.

వీ రీసూత్రమునకు నేను-నేన్- తాను-తాన్ అనునవియు లక్ష్యము లుగాఁ జూపిరి. నేను, తాను అనునవి కళలుగా భావించియుండుటవలన వీ రీసూత్రముచేతనే యుత్వలోపము చేయఁదగును. కాని సూరి సముచిత ముగా వీనిని ద్రుతప్రకృతికములుగాఁ జెప్పెను గావున నవి సూరిమతమున దీనికి లక్ష్యములు గావు.

అన్స్వరంబు, చన్వరము లన్నవి బాల.సాధ్యములు గా వని చిం. లక్షణమును సూరి సంకుచితము చేసె నని (వ్యా.సం.స.791) వఝులవారు పేర్కొనుట సరి గాదు. ఈసూత్రముచే నట నుత్వలోప మేల రాదు? (చూ.త్రి.శే.)

## నీకే బ్రాఁతియే :

'బహుళగ్రహణముచేతనె ఏమి ఇంద్రుని మున్నగువానితుదిఇకారాదులు లోపించును. నీకే బ్రాఁతియే, (ప్రౌఢ.సంధి.16) ఇంద్రున్వలెన్, (ప్రౌఢ.సంధి.17) పల్కుల్వంటి- (ఉ.169) అని ప్రౌఢ. చెప్పినవిశేషాంశము లిచ్చటిబహుళశబ్దముచే వీరు సంగ్రహించిరి.

'ఏమి ఇంద్రుని మున్నగువానిలోనితుదిఇకారాదులు' అనుటలో నిందు మొదటి దైనఏమిశబ్దమునందు ఇకారము లోపించు నేమో యని పించును. కాని లక్ష్యము ననుసరించి ఇకారాదు లనుచోటియాదిశబ్దముచే ఏమిలో 'మి'వర్ణమే లోపించు నని గ్రహింపవలెను. ఏమ్బ్రాఁతియె యని యుండదు గదా. ఇంద్రుని అన్నది మొదటఁ బేర్కొన్న బా గుండెడిది.

'ఇంద్రున్వలె' ననుచోఁ దత్సమమున నిత్వలోపము. ఇవి యెల్ల నాచ్ఛికవిధుల య్యు నిట బహుళశబ్దముచే సాధింపఁబడును గావునఁ దత్సమ మైనను బాధ లే దేమో. ప్రౌఢ.విధానము లట్ల గ్రహించిన బాగుండు నేమో కదా.

## పదమధ్యస్వరలోపము :

'అచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' (17) లాఁతియచ్చునకుసహిత మొకానొకచో నుది

నడుమ లోపంబు గానంబడియెడి (18) అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు (19) ననుసూరిలక్షణములను గలిపి వీ రిట్లు పేర్కొనిరి

"అచ్చికంబులం దమథ్యంబుల

1. నలదరలమీఁదిఉత్వంబునకు లోపంబు విభాష నగు

2. తద్భిన్నాక్షరములమీఁదను ఉకారేతరస్వరంబులును గొన్ని యెడల లోపించును.

3. ప్రత్యయపూర్వస్వరములును యథాప్రయోగముగ లోపించును అచ్చి.29సూ.(బాప్రకీ.18,19సూ)

ఒకసూత్రముగా నెన్నిరి గాని సూరి మూఁడుసూత్రములయంతయు నిది యున్నది. ఇందలి మొదటియంశము దాదాపుగా బాల.ప్రక్రీ.17 సూత్రమె. వీ రిట నది మూలముగాఁ బేర్కొనియే యుందురు. అచ్చుపొర పాటునఁ బోయియుండును.

సూరి యట బహుళ మనఁగా వీ రిట విభాష యనిరి. బహుళపద ముచే సిద్ధించువర్థ మీతమసూత్రమందలిరెండవయంశముచేఁ జెప్పఁబడిన దని యెంచియుందురు. విభాష యన్నమాత్రమున నాచ్చికపదము లన్నింట నడుమ నలదరల కే నుత్వ ము వికల్పముగా నగు ననరాదు" కొన్ని శబ్దముల లోనినలడాదులలోపమీఁదియుకారమునకు సైతము క్వాచిత్కముగఁ బాక్షిక లోప మేని రాకపోవచ్చు నని వ్యక్త మగుచున్నది" ఉదా. పడుగు వడుగు పొలుగ మొ॥ (వ్యా.సం.స.807) ఆయర్థ మిట వీరు విభాషాపదమునకు వ్యవస్థ చేసికొనవలెను. తరువాతి2,3అంశములు నీవిషయమును సాధింపఁ జాలవు గదా. బహుళపదమువలనియర్థ మేదో వీరు చెప్పలేదు. స్పష్టత నుద్దేశించి రన్నను విభాషకు వ్యవస్థ యవసర మైనది గదా. కాఁగా నీ(ప్రకీ, 17)సూరిలక్షణము సూక్తమ.

సూరి నలడరలయుత్వమున కన వీరు నలడరలమీఁదియుత్వమున కనిరి. ఇది వివరణమె. విశేషము లేదు.

ఇఁక వీరిసూత్రమంతలి రెండవయంశము దాల. ప్ర. క్రి. 18సూత్రము నుద్దేశించిన దనవచ్చును. కాని సూరి లాఁతియచ్చున కనుటచేతను, కల్కి- పొల్తి యనురీతి నుదాహరించుటచేతను నాచ్ఛికపదమధ్యమున నుద్భిన్నస్వరమునకు మాత్రమె, నలడరేతరములపై లోపము నుద్దేశించె ననవలె. వీరిలక్షణముచే నలడరేతరములపైఁ గూడ నుద్భిన్నస్వరమునకు లోపము వచ్చును.

నలడరలపై నుద్భిన్నస్వరము గ్వాచిత్కముగ లోపించు ననుసూరి 'సూత్రాభిప్రాయము సమ్మతమె కద. అట్టియపు డాసూత్రము నట్ల నిల్పి వీరు విశేషముగాఁ జెప్పఁదలఁచినయర్థమును వేఱుగా సూత్రించిన మేలు గదా. నలడరేతరములపై నుత్తును దద్భిన్నస్వరమును గొన్నియెడల లోపించు ననుట యింకను స్పష్టముగాఁ జెప్పఁబడిన ట్లగును గదా. కాని వీరీరెండవయంశమునకుఁ జూపినలక్ష్యము లన్నియు సూరిసాధించినవే కాని వేఱు గావు.

2. అబ్బురము- అబ్రము. కప్పురము. కప్రము. నెత్తురు- నెత్రు. అప్పుడు- అప్డు ఇప్పుడు- ఇప్డు, ఎప్పుడు- ఎప్డు మొ॥ వలచు-వల్చు, కలికి -కల్కి పొలితి- పొల్తి ములికి-ముల్కి బుడిపి-బుడ్పి మొ॥(ఉ 171)

ఇందు వీరు చూపిన కల్కి ముల్కి ఇత్యాదులు సూరి ప్రకి. 18 సూత్రమునొద్దఁ జూపినవే. వీరు చూపిన'పొలితి' అచ్చు పొరపాటేమో. పొలఁతి' యని యకారమధ్యముగఁ బైని ఖండబిందువుతో నున్నశబ్దమునె వీ రుద్దేశించి రేమో. 'పొలితి' యనుశబ్దము గానరాదు. కలికి-ములికి యను వికారమధ్యము లగుశబ్దములనడుమ నిచ్చుటనుబట్టి సందేహము. వలచు వల్చు అనుదానివెంట నుదాహరించిన దా గుండెడిది. దీనిని సూరి చూపె. వలచు-వల్చు అనునది పొలఁతి-పొల్తి వలె నీసూత్రముచే సాధ్యమె.

అబ్బురము-అబ్రము ఇత్యాదిగా వీరు చూపిన లక్ష్యము లెల్ల 'అబ్బు రాదులందు- (ప్ర.కీ.19) అనుసూత్రమునొద్ద సూరి యుదాహరించినవే కాని భేదము లేదు.

భేద మొం డున్నది. సూరి యబ్బురాదులలో 'చప్పుడు' శబ్దమును జూపె. చప్పు అనురూపమునకుఁ బ్రయోగము కన్పట్ట లేదు. అయినను నిఘ కోశములందుఁ జేర్పఁబడియున్నది' (వ్యా.సం.ప.817) కోశములు సూచి నను బ్రయోగము కన్పట్టలే దని వీరు నిటుఁ బరిహరించి రన్నమాట. సూ.ని. తారె ఐడి సప్పు లేక పాతాళమునకు (కాశీ.5.288) అనుప్రయో గమును జూపినది.

"ఒనర నపుడిప్పుడును జప్పు డనెడునుడుల, నుండెడుపువర్ణ శృంగంబు లుడుప఼బడును, సరవి నప్పును నిప్పును జుప్పు ననంగ, కోటికోటీందుసంకాశ కుక్కుటేశ.(స.సా.సం. సంధి.44)పడి సప్పు లేక పాతాళమునకు (కాశీ)"

కాఁగా సూరి చప్పుడు- (చప్పు-) అనుదాని నబ్బురాదులలోఁ జేర్చు టుచితమె. వీరు పరిహరించుట సరి కాదు.

మొత్తముపై వీ రిటుఁ జూపినలక్ష్యము లెల్ల సూరి చూపినవె. మఱి సూత్రము లేల మార్చిరి? అం దే మే నపసిద్ధాంత మున్నదా? సూరి మూఁడు సూత్రములు చెప్ప తా మొక్కదానితో (రెండంశములతో) సాధించుటలో లాఘవము గల్గిన దని యెంచిరా?

సూరిలక్షణమునందలిస్పష్టత వీరిలక్షణమున నున్నదా? ఉత్వలోపము నలడరలయందుఁ బ్రచురప్రసిద్ధము. నలడరేఫములందుఁ 'గొన్ని యెడలనే' అకొన్నియెడలును నొకగణముగా నేర్పఱచి అబ్బురాదు లని యం దుత్వలోపమును సూరి వేఱుగఁ జెప్పె నం దనౌచిత్య మున్నదా?

"నలడాదిసూత్రము(చిం.)నందలియాదిశబ్దముచే గ్రహింపఁదగిన వివిధవర్ణములలో నొక్కరేఫమునే సూరి గ్రహించుట యుక్త మైయుండ

లేదు. పలుకులఁజెయ్వుల — కాయ్వు— మున్నగు-వెనుకనుదాహరించిన
వన్నియతిక్కనాదులప్రయోగములు సూరిపక్షమున సంగ్రహింపఁబడనేర
వయ్యె. ఇంక నిట్టి వెల్ల బహుళగ్రహణముచే సూరిపక్షమున సాధించుకొన
వలసియుండును' (వ్యా.సం.స.815) అనునభిప్రాయముతోనె వీ రిట నిట్లు
సూత్రించిరా?

సూరి నలడర లన వీరును వల్లె రేఫ మొక్కటి గ్రహించిరే. కాయ్వు
మొద లగువానింబట్టి "నలడయర" ఇత్యాదిగా నావివిధవర్ణములు నిందు
వీ రైన గ్రహింపలే దేమి? సూరి "నలడర" లనుట యుక్త మనియే గదా
వీరు నట్లు చెప్పినది?

ఇ ట్లని సూరి నలడరేతరముల నుత్వలోపము చెప్పలేదా? సూరి
సాధించిన అంబము మున్నగునవే గదా వీ రిట నుదాహరించిరి. సం.లో
చూపిన చెయ్వు. కాయ్వు అనునవి (యిటఁ జూపఁదగు) సాధించుటకు
బహుళపదము నాశ్రయింప నేల? (అరు దగునిట్టిరూపములకై బహుళ
పదము నాశ్రయించినను ద ప్పేమి?) చెయువు. కాయు వనువాని నబ్బురా
దులలోఁ జేర్పరాదా? ఇత్యాదు లనెనే కాని సూరి యబ్బురాదిని నియతగణ
ముగాఁ జెప్పలేదే.

కాఁగా నలడరేతరముల నుల్లోపమును సూరి ప్రకీ.19సూ.చే సాధిం
చియే యున్నాఁడు. కాఁగా సూరి ప్రకీ17సూ.చే నలడరలమీఁద 19చే
నలడరేతరములమీఁద నుత్వలోపమును, 18చే నలడరలపై నుద్భిన్నస్వర
లోపమును సాధించె.

ఈయర్థములు వీరు నంగీకరింతురు. అట్టియెడ నాసూరిసూత్రము
లట్లే గ్రహింపరాదా?

ఇంక వీరు నలడరేతరములయందును నుద్భిన్నస్వరమునకు

లోపము నంగీకరించుట యొకటి విశేషము. ఇది సూరి స్పష్టము చేయలేదు.

విశేషమె. కాని వీ రిట్టిలక్ష్య మొక్కటియు నిట చూపలేదే. మఱి వీరివిశేషార్థమువలనిప్రయోజన మేమి. తప్పక చూపవలసినది గదా.

సం.లో వెల్వెల్లఁగ, అయ్యును, వెల్వెలఁబాతె. ము న్నగుపదాంత స్వరలోపములును బాలవ్యాకరణమున సంగ్రహింపఁడవయ్యె (వ్యా.సం. స.815) ననిరి. ఇ ట్లని వీరు లాఁతిచో (ప్రకీ.18) సూత్రమునొద్దఁ బేర్కొన్నను "పదాంతిమస్వరలోప" మనుటచే దీని కీసూత్రమునొద్దఁ బ్రసక్తియే లే దనియు వఝలవారు పొరవడి రనియు స్పష్టమే. ఇవి పదమధ్య స్వరలోపమును బేర్కొనునవి గదాఁ ప్రకీ,17,18,19) ప్రస్తుతగ్రంథమున అచ్చ.24(ప్రకీ.17) సూత్రమందలిబహుళపదముచే సముచితముగ సాధించి యిట్టిపదాంతస్వరలోపము బాలవ్యాకరణమున సంగ్రహింపఁబడియే యుంటను నిరూపించిరి. సం.లోనిపై విమర్శన మసమంజస మని ఉ.లోని వఝలవారివివరణముచేతనె స్పష్టము గదా.

మొత్తముపై నిట "తద్భిన్నాక్షరములమీఁదను ఉకారేతరస్వరంబు లును గొన్నియెడల లోపించును" అని వీరు సూత్రమునందుఁ బ్రధానముగాఁ జెప్పినయంశమునకు లక్ష్యములే లేవు. లక్ష్యవంత మగులక్షణము సూరి స్పష్టము చేసినదే.

సూరి స్పష్టముచేసినయర్థము వీరిలక్షణమున నస్పష్ట మగుట యొకటి విశేషము.

ఈయంశమున 'తద్భిన్నాక్షరములమీఁదను' అనుట విరుద్ధము నైె తోఁచున్నది. దీనివలనఁ బూర్వ ముక్త మైననలడరలును. నిట నుద్దేశించిన నలడరేతరములును 'నక్షరములె.'-- స్వరమె యక్షరము వ్యంజన మక్ష రాంగము (వ్యా.సం.స.23) కావున నలడర- తద్భిన్నములు అనుఅక్షరము లపై స్వరలోప మెట్లు? 'న' అక్షర మన నత్వసహిత మైననకార

మని పైవరుసలవారివివరణముచే నర్థము స్పష్టము. టాక్షరము (బాల సమా. 16) అనుచో సూరియు నిట్లు చెప్పెఁ గదా. 'స' అనునక్షరముమీఁద ఉత్వ మె ట్లుండును? పదమధ్యమున నచ్చుపై న చ్చుండుట యెట్లు? అట్టియెడల, కినుక-కిన్క- అబ్బురము- అబ్రము కలికి- కల్కి- యనురీతిగా నిచ్చోఁ రూప ము లేవియు వీరిలక్షణము సాధింపఁజాలదనవలె. మఱి వీరిలక్షణము ప్రవ ర్తించుచోటులుమృగ్యములు.

'తద్భిన్నాక్షరములమీఁదను' అనుదానికి 'అక్షరములయందును' అను రీతిగా నర్థము చేయుట కవకాశము లేదు గదా. అక్షరశబ్దముచే నలడరాది వ్యంజనమాత్రమునే గ్రహించుట వీరి యుద్దేశ్యముగాఁ దోఁచు. లక్ష్యములం బట్టి యిట నక్షర మన వ్యంజన మని చెప్పుకోవలె. అక్షరము లనకున్న బా గుండెడిది గదా.

అట్టియవసరము లేక సముచితముగాఁ బదమధ్యస్వరలోపమును స్పష్ట ముగా సాధించుచున్న సూరియీలక్షణములం దెట్టియపసిద్ధాంతమును లేమి సూక్తము లై యుండుట నవి (ప్రకి. 17, 18, 19) యట్లే గ్రహించుట యుక్త మని నిశ్చయింపఁదగు.

## ప్రత్యయపరకస్వరలోపము:

ఇఁక నీసూత్రమున వీరు పేర్కొన్న మూఁడవయంశము "ప్రత్యయ పూర్వస్వరంబులు యథాప్రయోగంబుగ లోపించును." అనునది ఇట వీరు "యథాప్రయోగంబుగ" ననుట స్పష్టతకె. పూర్వాంశమునఁ గొన్నియెడల లోపించు నన్నను నదియు యథాప్రయోగముగనె కాని తద్భిన్నముగాఁ గాదు గదా.

విన్కు నిల్కు కాల్దుము ఇత్యాదులను లక్ష్యములుగాఁ జూపిరి. ఇం దుఁ గాల్దుము లక్ష్యము గాదు. ఇట వీరు ప్రత్యయము పర మైన స్వరము నకుఁ గదా లోపము చెప్పుచుండిరి. "కాలుదుము" అనుచో లువర్ణమునఁనుత్వ ము లోపింపవలయు నన్నఁ బర మైనదువర్ణము ప్రత్యయము గావలె.

"దుతివర్ణకౌ క్రమాత్ స్తః" అని చిం. యీదువర్ణమును ప్రత్యయముగానె చెప్పినది. కాని వీరు ప్రస్తుతవ్యాకరణమున సూరివలె దీనిని దుగాగమము గాఁ జెప్పిరి. (క్రియా.30) కాఁగా నీదువర్ణ మాగమమె కాని ప్రత్యయము గాదు. ప్రస్తుతలక్షణ మిటఁ బ్రవర్తింపవలె నన్న [ప్రత్యయము మువర్ణ ము గాన] "కాలుద్మ" అని కావలె. ప్రత్యయాగమము లభిన్నములుగా నెంచియుందురు. అది యసంగతము. [ఉ.కృత్-1] మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు [ఉ.తత్స.42] అని చెప్పు టేల?

అసలు వీ రీవిధానము చేయు టేల? ప్రత్యయపరకత్వమునప్రకీ.17 సూత్రముచే నుత్వలోపము రా దనియు నిట్టిరూపములు బాలవ్యాకరణముచే సంగ్రహింపఁబడ వనియు [వ్యా.సం.స.815] భావించుటచేతనె వీ రిట్లు సూత్రించిరి.

ఏల సంగ్రహింపఁబడవు? "అచ్చికంబులం బదమధ్యంబుల నను సూరిలక్షణ మిందు సరిపడుచునే యున్నదే. [చిం.లో అన్యేషాం చ ప్రయోగ మహితనా మ్మనుచో నివి యుదాహరించుచోఁ జేసినవిమర్శ (వ్యా.సం. స.807) యిందుకు మూలము గావచ్చు నది యసంగత మని తద్గ్రంథ పరామర్శనమున స్పష్ట మగు.

సూరి యిట కానుక కాన్క యని యుదాహరించె. ఇందుఁ గనుధాతువుపై "క" (కృత్) ప్రత్యయమే కదా. ప్రత్యయపరకతలో నీసూత్రముచే నుత్వలోపము రా దను టెట్లు? సూత్రమును జెప్పినసూరి ప్రత్యయపరకతలో నాకార్యము నుదాహరించియుండఁగా నయ్యది యీలక్షణమున కనుగుణము నై యుండఁగా వ్యాఖ్యాత యాసూత్ర మటఁ బ్రవర్తింప దని చెప్పు టెట్లు? వీరును నలదరాదిసూత్రమునకుఁ "గాన్క" సూరివలెనె యుదాహరించిరి. ఇఁకఁ దిఙ్ప్రత్యయములు పర మగునపుడు గా దని నియమింతురా? అస లీవివక్ష యేల?

ఇఁక నిల్లు, ఎగురుము, పడుము ఇత్యాదులందు లేదు గదా యన్న

నలడరల నుత్వలోప మన్న నెల్లయెడలఁ జేయవలసినదే యగునా? వాలుగ ఇత్యాదులలో ప్రత్యయేతరపరకతయందు మాత్ర మది సార్వత్రికమా?

కాఁగా వినుము- విన్మ, కానుక-కాన్క- అనురీతివి ప్రకి.17సూత్రమునకును, వందు-వల్దు, చెడక చెడ్క- యనురీతివి ప్రకి.18సూత్రమునకు లక్ష్యములే యగును.

రువర్ణకంబు పరం బగునపు డుత్వలోపమును క్రియా.62.సూ.చేఁ బ్రత్యేకముగా విధించుటకుఁ గారణము వే అనియు నీసూత్రము ప్రత్యయపరకత్వమునందుఁ బ్రవర్తింపకపోవుటచేఁ (వ్యా.సం.స.1532) గా దనియు గుర్తించితిమి. (చూ.క్రి.62)

కాఁగాఁ బ్రత్యయపరకస్వరలోపమును ప్రకి.17,18సూత్రములు సాధించుచునే యుండుటచే వీ రిట్లు ప్రత్యేకముగా సూత్రించుట యనవసర మని స్పష్టము.

ఇట్లు ప్రత్యయపరకస్వరలోపమును బ్రత్యేకముగాఁ జెప్పుటచే వీ రిట్లు వివరించుకొనవలసివచ్చె. ప్రథమాబహువచనలుప్రత్యయపరకత్వమునందలిఉత్వలోపము (అచ్చి.12) ప్రేరణచువర్ణకాదిపరకత్వమందలి లోపాగమాదేశాదులు (క్రియ.70,80)శత్రర్థకచువర్ణకపరకత్వమందలిఉత్వలోపాదికము (క్రియా.65) క్రియాప్రత్యయరువర్ణకపరకత్వమందలిఉత్వలోపము (క్రియా.72) మున్నగునవి వేఱుగ సూత్రింపఁబడును కాన వానినిం దుదాహరింపరాదు(ఉ.171)

అవియు నిందుదాహరింపఁదగినవే యైనపు డట్లు చేసిన సరిపోవు దానికి వేఱుగ సూత్రింపవలసినవిశేషము లున్నపు డీసూత్రమున కవి యెల్ల నుదాహరణములు గావు గదా. భేదమునుబట్టి విశేషవిధులకె లక్ష్యము లగు.

"ప్రేరణచువర్ణకాది" యనుట సరి కాదు. ప్రేరణమునందలిచుగాదు

లాగమములు అవి ప్రత్యయములు గామి వాని నిటఁ బ్రస్తావింప నవసరమె లేదు. ఇచ్చటియాగమాదేశాదులు పెక్కుదెఱఁగు లగుట ప్రత్యేకముగా నిరూపింపఁబడినవి గాన నవ్వాని కిటఁ బ్రసక్తి యుండదు.

శత్రర్థకచువర్ణకపరకత్వమున 'నన్వాదులు' కొన్నింటనే యాకార్యము గనుక దానిని వేఱుగఁ జెప్ప నవసరము. కాన నావిశేషవిధిచేత దాని కిటఁ బ్రసక్తి లేదు. ఇంకను వీ రిట 'ఉత్వలోపాదిక' మనుట విశేషము. ఆదిశబ్దముచే క్రి. 65సూత్రవిహిత మగుబిందువును గూడ నుద్దేశించిరా? ఈప్రస్తుత సూత్రము బిందువును జెప్పునది గామింజేసి యిట నాదిశబ్ద ముపయోగింప రాదు.

క్రియావిభక్తి యగురువర్ణకపరకతలో క్రియా72సూత్రము సున్న మీఁదితదడలకే లోపము చెప్పుచున్నది గావున "చత్రు" మొదలగున విటనే యుదాహరింపఁదగును.

మొత్తముపైఁ బ్రత్యయపరకతలో నిట విశేషముగా స్వరలోపము చెప్పక యట్టిస్థలములును బ్రత్యయప్రత్యయేతరవివక్ష లేక 17, 18సూత్రములచే సాధించినసూరి [కిట్టివివరణముతోఁ బని లేదు]లక్షణము సముచితము వీరు ప్రత్యయపరకస్వరలోపమును విశేషముగా నారంభించుట యనవసరము.

## అద్రుచు :

'చుక్పరకరువర్ణంబునుత్వంబునతు లోపంబు విభాష నగు నగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు' (20) అనుసూరిసూత్రమును వీరు చుపరక రువర్ణంబునకు ముందటిదువర్ణంబు ఉత్వంబునకు లోపం బగు అగుచోఁ దత్పూర్వస్వరంబు గురువు కాదు (అచ్చి. 30, 31) అని కొంచెము పవరించిరి. ఇందు సంధికార్యములు మానుట స్పష్టత కేమో. ఇవి యనింద్య గ్రామ్యము లందురు. (ఉ.సం. 24) సంధికార్యములవలన నస్పష్టత గాని యపసిద్ధాంతము గాని సూరి లక్షణమున లేదు.

'చుక్పరక' అని సూరి యన 'చుపరక' యని వీరు సవరించిరి. 'చుక్' అనుట సరి గా దని వీరియుద్దేశ్యము.. "వీనిలో అదురుచు-అ(ప్రేరణము. అ(డువన్. చూ ఆవయవికము. ఎదురుచు-ఎదిరించు అనునవి యాగమములె యయ్యెఁ (ఇందలి, చు- ఇంచు అనునవి యని యుద్దేశ్యము) (ప్రేరణార్థకములు గావు" (ఉ.172) 'ఎదురించు' అనుదానిప్రసక్తి యిట లేదు. 'ఎదురుచు' (ప్రేరణార్థకము గాదు. కాని యాగమమె. చుక్కే. కావున నీసూత్రము వర్తించుటలో బాధ లేదు. సూరి 'చుక్' అనెనే కాని '(ప్రేరణార్థకచుక్' అనలేదు గదా.

ఇంక "అదురుచు" అనుచో 'చు' అవయవిక మనుటవలన నాగమము (చుక్) కాదు గావున సూరి 'చుక్' అనుట సరి గా దనియు, 'చుపరక' యన్న నాగమము, నావయవికమును రెండును గ్రహింపఁబడును గావునఁ దా మట్లు సవరించుట యుక్త మనియు వీరియభిప్రాయము నెన్నవలయును.( వ్యా.సం.స.1580)

సం.లో నొకచో "చౌరేరుపధాత్మనశ్చేత్యాదిచింతామణిసూత్రమునకె యిదియు వివరణము. కావున అదురుచు-మున్నగుచోట్ల- అ(డుచు- అదుర్చు -(వ్యా.సం.స.71) చౌరేరుపధాత్మనశ్చేతిసూత్రముచేఁ ప్రేరణార్థక చువర్ణకపరకత్వమునను -ఉత్వలోపము. (వ్యా.సం.స.807) ప్రత్యయాగమము లభిన్నములుగా వీరు దలచుగా వ్యవహరించుచుండిరు.కాన నిట వీరు "అదురుచు" అనుచో 'చు' ప్రేరణార్థక మనియు నాగమ మనియు దలఁచి రని చెప్పవలె.

ఉ.లో అదురు-అదురుచు అనునవి పర్యాయరూపములు. కావుననె ముత్పరకత్వమున వకార మవును -అ(డువన్- (ఉ.403) అనిరి.

పర్యాయము లన నివి వేర్వేరుధాతువులా? అట్లు చెప్ప నేల? తనరు తనరుచు అనుచోవలె అదురు- అదురుచు అనుచో 'చు'వర్ణము స్వార్థమం

దాగమ మయిన దని చెప్పు టుచితము గదా. "అదురు" అనుధాతు వొకటి ప్రత్యేకముగా నుండఁగా నదే యర్థమునం దున్న "అదురుచు" అనునది భిన్న మగువేఱొకధాతు వన నవసర మేమి? తనరు-తనరుచు నన్న నిట్లు భిన్నములుగాఁ జెప్పిరా?

దానికిఁ గారణము కేవలము "అద్రువన్" అనురీతిగా నిట ముత్పర కత్వమున వకార మగుటయే యనవచ్చును. ఇట్టిస్థితి యిట నొక్కచోటనె యగునా?

విడుచు-విడుపన్ అని కావలె. ఒలుచు-ఒలుపన్- సాధువు విఱుచు-విఱుపన్ సాధువు-- (ఉ.412) వీనియం దెల్ల "చు" ఆగమమె. కావున పత్వమె రావలె ననియు వత్వము వచ్చినవి వ్యావహారికము లనియు,మహా కవిప్రయోగములలో లే వనియుఁ జెప్పుదురు. విడ్చు- విడుచుయొక్క రూపాంతరము- చాల వయ్యేదీశునకము విడ్వ [భార.మహా.1] అనుతిక్కన ప్రయోగమునే శ.ర. చూపినది. విడ్వన్ అనుచో నాగమచకారమునకు వకార మైనది గదా. ఎగుచు- ఎగువన్- [శ.ర.] మొ॥

చీర లొలువఁబడిరి [విరా.5.222] ఒలుపఁబడిరి. అనియే యుండఁ దగును. ఒలువఁబడిరి అనుముద్రణము సరి గా దని తోఁచెడి [వ్యా.సం.స. 1620] ఇట్లు మహాకవిప్రయుక్తములను దిద్దుచుండఁగా నిట్టివి కవిప్రయో గములం దె ట్లుండును.

కావునఁ గవిప్రయోగములను మార్చుటకంటెను నాగమచకారము నకును ముత్పరకత్వమునఁ గొన్నియెడల వకార మగుటను లక్షణబద్ధము చేయు టుచితము గదా. కావున అదురు అనుదానిపై స్వార్థమునఁ జుగాగమ ముతో "అదురుచు" అని యైన దని గుర్తింపఁదగును. స్వార్థమందలిచుగా గమముతో "అదురుచు" అనునది "అదురు" అనునర్థమునే యుండుటంజేసి శ.ర. అదురుయొక్క రూపాంతర [అదురుచు] మని యుండు.

కాఁగా "చుపరక" యనుసూరిలక్షణము సూక్తము.

వీరు "చుపరక" యనుటచే నాగమ మయినను సవ్య మయినను చువర్ణము పర మయినచో నీకార్యము రావలసియే యున్నది. ఎదురుచున్నాఁడు, అదురుచున్న యది మున్నగుస్థలములయందును "చుపరక" స్థితి కలిమి నటను నుత్వలోపము ప్రాప్త మయి ఎద్రుచున్నాఁ డనురీతిని గావలె. అట్టి కార్యమును వారించుటకే కద సూరి "చుక్పరక" యన్నది. అపరూపముల కవకాశమును గల్పించువీరిసవరణము సరి కా దని స్పష్టము. ఇట్టిరూపము లను వారించుటకు వీరు విభాషకు వ్యవస్థ చేసికొనవచ్చును. వీ రట్లు చెప్ప లేదు. కాని చేయనవును. అట్టియవసరము లేక యీకార్య మగుస్థలములను స్పష్టముగా నిర్దేశించినసూరిలక్షణము సూక్తమె కదా.

పిదపఁ 'దత్పూర్వంబు గురువు గా' దని సూరి పేర్కొనఁగా వీరు "తత్పూర్వస్వరంబు గురువు గా" దనిరి. ఇది వివరణమె. సూరిలక్షణమున నపసిద్ధాంత మేమియు లేదు.

సూరిలక్షణము సూక్తము.

## వళిప్రాసలు :

బాల. ప్రక్రి. 21, 22, 24సూత్రములను వరుసగా నట్లే గ్రహించిరి. (ఉ. అచ్చి. 42, సంధి. 37, సంజ్ఞా. 19)

గురులఘ్వాదు లగుఛందోవిషయములను సంజ్ఞాపరిచ్ఛేదమునఁ జెప్పిరి. కాని "పాదంబునం బ్రథమద్వితీయాక్షరంబులు వళిప్రాసంబులు నాఁబడు" (23) ననులక్షణమును వీరు ఉ. లోఁ జెప్పినట్లు గానరాలేదు.

శాస్త్రమునకు శాస్త్రాంతరముతోడిప్రవేశమును సూచించుచుఁ జివర ఛందోవిషయములను సూరి స్వల్పముగాఁ బ్రస్తావించె నని తద్జ్ఞు లందురు.

## రేఫలు :

రేఫంబులు లఘ్వలఘువులుం దక్కం గలవిశేషంబులు నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు (25) అనుసూరిలక్షణమును గూడ వీరు చెప్పినట్లు గానరాలేదు. కాని సంజ్ఞాపరిచ్ఛేదములోఁ గొన్ని శకటరేఫలు గల శబ్దములు సూపిరి. అది దీని నుద్దేశించిన దయ్యేడునవకాశము లేకపోలేదు.

బాలవ్యాకరణమున నీచివరిసూత్రముచే సూరి దానులక్షణమును దిక్ప్రదర్శనముగఁ దెలిపితి నని సూచించుచు నిం దనుక్తము లయిన యంశముల నశ్యమార్గమున నెఱుఁగవలయుటను స్పష్టము చేసెను.

అంతే గాక "శ్రేయంబు" అనుశబ్దముతో గ్రంథమును ముగించి యీశాస్త్రమును మంగళాంతముగాఁ జక్కగా నుపదేశించెను.

ఇది ప్రకీర్ణకపరిచ్ఛేదము.

॥ ఇతి శమ్ ॥